12/4/55

# తప్పక చూడండి

బొంబాయి, అహమ్మదాబాద్
బరోడా, పూనా, షోలాపూర్
మొదలగు నగరములలో...
**రజితోత్సవ వారములు**
. జరిపించుకున్న చిత్రం





ప్రసాద్ ప్రొడక్షన్స్ వారి

# బేటీ బేటే

(హింది)





సునీల్‌దత్, జమున, సరోజాదేవి...

బేటీ బేటే

నిర్మాత-దర్శకుడు: L.V. ప్రసాద్

**BETI BETE**

సంగీతం: శంకర్-జైకిషన్



పూర్ణా రిలీజ్

NAVARANG

STUDIO Kalpa

Studio Roopkala

# త్వరలో




భరణీ పిక్చర్స్ వారి




# వివాహబంధం

నవయుగ

నిర్మాత, దర్శకుడు: రామకృష్ణ

రచన: ఎ. విశ్వేశ్వరరావు :: పాటలు రచన: సి. నారాయణరెడ్డి :: సంగీతం: M.B. శ్రీనివాస్ :: సంగీత పర్యవేక్షణ: శ్రీమతి భానుమతి
కళ: రాజేంద్రకుమార్ :: ఛాయ: అన్నయ్య :: ఎడిటింగ్ :: M.V. రాజన్ :: పాటలు రికార్డింగ్: P.V. కోటేశ్వరరావు (భరణి)

NVKR'S

# TRIPLE TRIUMPH FOR TIARA










Tiara offers you a choice of three shampoos
to suit every kind of hair. Shampoos which condition your hair while washing it squeaky clean.

**Tiara Shampoo plus Egg.**
Dull, straggly hair springs back to life with Tiara Shampoo plus Egg. It ends snarls and tangles... tames stubborn locks. Tiara Shampoo plus Egg washes your hair shimmering clean.

**Tiara Creme Shampoo**
chases dandruff from your hair. Its rich lather penetrates into your scalp, washes away grease and every particle of dust. This highly concentrated shampoo is very economical in use. It is a complete beauty treatment for your hair.

**Tiara Lanolin Lotion Shampoo**
softens dry, brittle hair. The lanolin in the shampoo conditions your hair... makes it obedient. Watch the stars come back in your hair with Tiara Lanolin Lotion Shampoo.

Sole Distributors In India: SPENCER & CO. LTD. □ 153 Mount Rd., Madras 2 □ Spencers Building, Forjett Street, Bombay 26
70 Diamond Harbour Rd., Kidderpore, Calcutta 23 □ 19A Alipore Rd., Delhi 6



# ఉత్తరాలు

## ముఖచిత్రం

11—9—64 ప్రత్యేక సంచికలోని ముఖ చిత్రం గురించిన నాగరాజ్ గారి ఉత్తరం చదివి చాలా విచారమనిపించింది. నాకు తెలిసినంత మటుకు ఇందిరాగాంధీ, నెహ్రూల ముఖచిత్రాలు గల పత్రికలు కేవలం ముఖచిత్రాల కోసమే చాలా మంది కొన్నారు. చాలా ఇళ్లల్లో వాటిని ఫ్రేములు కట్టించిపెట్టుకొన్నారు. అటువంటప్పుడు కేవలం సినీనటుల ముఖచిత్రాలుంటేనే పత్రికలు అమ్ముడు పోతాయనుకోడం అవివేకం.

ఇ. హేమచందర్ (హనుమకొండ)

## సీరియల్ కథలు

'హృదయ కుసుమాలు' చాలా చక్కగా సాగి పోతూవుంది. కానీ సీత అక్క జీవితంలో ప్రవేశించడం అంత బాగున్నట్టు కనపడదు. జానకి భర్త పాత్రకూడా అంత సహజంగా అనిపించదు.

జీవితాన్ని కొందరు వరంగా భావిస్తారు. మరి కొందరు శాపంగా భావిస్తారు. కనీ అంతా దాన్ని దిద్దుకొను తీరుపై ఆధారపడుతుంది.

ఎదుటివారిని బాధపెట్టడం ఎవరికీ ఎవరి మీదా హక్కులేదు. కానీ ఆ బాధలను తప్పించుకోడానికి మనం చేసే ప్రయత్నాలలోనే జీవిత రహస్యం దాగుంది. జానకి జీవితం బాగు పడుతుందని ఆశిస్తాను.

ఉమారెడ్డి (బెంగుళూరు)

*   *   *

'కూలిన గోడలు' చాలా బాగుంది. కథ పేరు చూచి చివరికి ఏమవుతుందా అని అనుకున్నాను. కాని, చివరకు ముగింపు చాలా బాగుంది. సుధ కాపురం కూడ బాగుపడినట్లు రాస్తే బాగుండేది. అయినా మొత్తంమీద చాలా బాగుంది.

రాజేశ్వరిశర్మ (పచ్మడి)

*   *   *

డెర్వ్లా మర్ఫీ కథలు చదువుతున్నంత సేపు నిజంగా మాకు చాలా గర్వకారణమైనది. ఈ రోజుల యువకులే సైకిలుమీద బజారుకి వెళ్లిరావడానికి నానా బాధలు పడుతున్నారు. అలాంటిది ఒక అబల అంత సాహసముచేయుట మెచ్చుకోదగినది. కాని ఆమె భారత్ అంతా 'టూర్' చేయలేదా? ఒక్క ఢిల్లీ చూచి వెళ్లిపోయిందా? పత్రికాముఖమున విన్నవిస్తాను.

"భోలానాథుని కాశీ, కాపాలికుల కాశీ, అఘోరీ కాశీ" అను వ్యాసం చదువుతుంటే, ఇది సంభవమా అనిపించింది. ఏదో పురాణ గాథలలో వినడం, లేదా సినిమాలలో చూడడం తప్పిస్తే ఈ అణుయుగంలో కూడ, నరరూప రాక్షసులు ఉన్నారని తెలుసుకొనుటకు చాలా బాధగా ఉంది.

చెన్నుభొట్ల ప్రసూన (బి.ఎస్.సి.) చెన్నుభొట్ల ఉమాదేవి (బి.ఎస్.సి.) చెన్నుభొట్ల కళ్యాణి (మొదటి బి. ఇ.) (కాకినాడ)



## కథ

'వూహించని నిజాలు' నన్నెంతో ఆకర్షించింది. కథ అంతా ఓ నూతన పంథాలో నడిచింది.

డి. వి. గోపాలకృష్ణ (భువనేశ్వర్)

## దశావతారాలు

దశావతారాల మీద ప్రచురించిన ఉత్తరాలు చూసిన తర్వాత ఈ ఉత్తరం రాయకుండా ఉండలేక పోయాను.

వైదిక సాహిత్యంలో 'వామనుడు' ఒకడే విష్ణువు అవతారంగా చెప్ప బడినట్లు చదువుతాము. వరాహ, మత్స్య, కూర్మావతారాలు మూడూ ప్రజాపతి అవతారాలన్న సూచనలు కనిపిస్తాయి. తర్వాత, తర్వాత ఈ మూడూ విష్ణువు అవతారాల కింద పరిగణింప బడినాయి.

'మొత్తం ఎన్ని అవతారాలు ?' అనే ప్రశ్నకి కూడా ఒక సమాధానం దొరకదు. అంతే కాదు, ఏవి 'అసలు' అవతారాలో చెప్పలేము.

భారతంలో ఒక చోట నాలుగు అవతారాలే చెప్పబడి ఉన్నాయి— వామన, వరాహ, నరసింహ, కృష్ణావతారాలు. మరొకచోట భార్గవ రాముడూ, దాశరథి రాముడూ కూడా చేర్చబడ్డారు. ఆ తరువాత హంస, కూర్మ, మత్స్య, కల్కి అవతారాలతో కలిసి పది అవతారాలు అయ్యాయి మహాభారతంలో!

మత్స్య పురాణంలో నారాయణ, నరసింహ, వామన, దత్తాత్రేయ, మాంధాత్రి, బలరామ, దాశరథి రామ, వేదవ్యాస, బుద్ధ, కల్కి అవతారాల వివరాలు ఉన్నాయి.

వాయు పురాణంలో బుద్ధుడి బదులు కృష్ణుడు అవతారంగా పేర్కొన బడ్డాడు.

హరివంశం: బుద్ధ, మత్స్య, కూర్మ, (ఒక) రామావతారాల బదులు పద్మ, దత్తాత్రేయ, కేశవ వ్యాసావతారాలు వివరించబడి ఉన్నాయి !

భాగవత పురాణంలో 3 అవతారాల జాబితాలు కనిపిస్తాయి. మూడూ మూడు రకాలవి. ఒక జాబితాలో 24 అవతారాలు ఉంటాయి !

జయదేవుని జాబితాలో ఉన్న అవతారాలు : మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, భార్గవ రామ, దాశరథిరామ, హలాధరరామ, బుద్ధ, కల్కి అవతారాలు.

ఎ. కె. రావు (విజయవాడ)

## పేరులోనే కలదు పెన్నిధి

మీరు వినాయకచవితి ప్రత్యేక సంచికలో సినిమానటి రాజశ్రీని పరిచయం చేశారు. సంతోషం. ఆమెను గురించి వ్రాసిన వ్యాసంలో "వెండి తెరకు 'రాజశ్రీ' అనే పేరుతోనే పరిచయమైంది. 'పేరులోనే పెన్నిధి దొరికింది' టక, టక 'నిత్య కళ్యాణం — పచ్చతోరణం', 'ఆరాధన', 'స్వర్ణ గౌరి' 'మదనకామరాజు కథ', మొదలగు చిత్రాలలో నటించే అవకాశం వచ్చింది" అని వ్రాశారు.

కానీ అదే పత్రికలో 44, 45వ పేజీలలో మీరు వేసిన 'పేరులోనే కలదు పెన్నిధి' అనే వ్యాసం ప్రచురించారు. అందులోని పద్ధతిని బట్టి రాజశ్రీ పేరులో పెన్నిధి లేదనిపిస్తుంది.

R A J A S R E E

2 1 1 1 3 2 5 5=20

మొత్తం సంఖ్యలు 8 వాటిని కూడిన 20 వచ్చినది. మరి అందులో (ఆ వ్యాసంలో) 20 అంత మంచిది కాదు అని ఉంది. మరి అంత మంచిది కాని పేరుగల రాజశ్రీ మరి ఇప్పుడు తెలుగు, తమిళ, హిందీ చిత్రాలలో జైత్రయాత్ర చేస్తుంది. మరి మీ సంఖ్యా శాస్త్రం ఏమంటుంది ?

పి. శంకర్ (గుడివాడ)

* ఏమంటుంది ?

## దివ్యస్మృతి

పాశ్చాత్య పాలనలోని భారత దాస్యశృంఖలాల్ని
పటాపంచలొనరించి చేశాడు మనని దాస్య విముక్తుల్ని
అజేయులై అలరారిన ఆంగ్లేయులని
అహింసా సూత్రంతోనే జయించాలని
పట్టుబట్టాడు పూజ్య బాపూజీ
పట్టు విడవక పోరాడాడు గాంధీజీ
అవసరమన్నాడు ఆయన ఆత్మనిగ్రహం
అందుకు తోడు కావాలన్నాడు సత్యాగ్రహం
భరించాడు కడు యిడుములను ఓర్పుతో
భయపడక ప్రాణమైనా యిస్తానన్నాడు నేర్పుతో
సాధించలేకపోయారు బాపూజీని శాంతి సమరంలో
స్వాతంత్ర్యకాంక్ష మీరి ప్రజచేసిన సహాయ నిరాకరణంలో
రవి అస్తమించని సామ్రాజ్యం గల 'వారు'
రాజీకి రాకుండా ఉండలేక పోయారు!
బోధించాడు ప్రజలకు బాపూజీ సత్యాగ్రహ మాత్రం
భారత స్వాతంత్ర్యానికి పలికాడు సుస్వాగతం!

—మాధవ్

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 2—10—'64

క్రోధినామ సం॥ భాద్రపద మాస బ॥ ద్వాదశి

సంపుటము 57 సంచిక : 5

స్థాపితము:
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద ( Sea Mail ) రూ. 28 60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్ జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

విడిప్రతి 30 పై.
సంవత్సర చందా 15.60 పై.
6 మాసాల చందా 7.80 పై.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
**7. తంబుచెట్టి వీథి, మద్రాసు-1**




ఎలెక్షన్లకి డబ్బులిచ్చేంతదాకా నల్ల **ధనం తనిఖీకి భయపడవనుకో!**

## మనలో మాట

'అయిదు రేకులు' నవలా రచయిత్రి పేరు ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులకి సుపరిచితమయినదే! కొంత కాలం ముందు వనితాలోకం ప్రత్యేక వ్యాస శీర్షికలో ఈమె రచించిన 'ఉద్యోగాలు - స్త్రీల ఇబ్బందులు' ప్రచురించాము.

* * *

ఈ సంచిక 17వ పేజీలో ప్రారంభం అయ్యే 'యుగసంధి' కథ వ్రాసిన శ్రీ జయకాంతన్ మరో కథని ('విశాఖ' అనువాదం) ఇంతకుముందు ప్రచురించిన విషయం పాఠకులకి గుర్తు ఉండవచ్చు. 'యుగసంధి' మూలం అరవంలో ఉంది.

* * *

దీపావళి కథలపోటీవల్ల అయిఉండవచ్చు; మామూలుగా మా కార్యాలయానికి వచ్చే కథలసంఖ్య కొంచెంగా తక్కువగా ఉంటోంది! కాని దీపావళిపోటీ కథలు మాత్రం రోజుకి డెబ్భయి-ఎనభయి ప్రాంతంలో వస్తున్నాయి!!

* * *

'విదేశాలలోని విదుషీమణులు'లపై శ్రీమతి జె. వరలక్ష్మి వ్రాస్తున్న వ్యాస పరంపరలో ఉగాండా దేశం కూడా వుంది. ఆ దేశంలోని స్త్రీల పరిస్థితులను వివరించే వ్యాసం 13వ పేజీలో ప్రారంభం అవుతుంది.

* * *

పోయినవారం న్యూఢిల్లీ లేఖ ఎందుకు వెయ్యలేకపోయామో మా పాఠకులకు తెలుసు. ఆ కొరత కూడా తీర్చేందుకు, ఎలాగయితేనేం, యీ వారం మూడు పేజీల న్యూఢిల్లీ లేఖ వెయ్యగలుగుతున్నందుకు సంతోషిస్తున్నాం.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం: "వివాహబంధం"లో జానుమతి.

ఈ కారు పెద్ద గండినే దాటింది-!

అవిశ్వాస తీర్మానం

శాస్త్రీ ప్రభుత్వం

నగర సమస్యల పరిష్కారం... హైదరాబాద్ కౌన్సిల్ తీరుతెన్నులు



















ఉత్తరప్రదేశ్‌లో ఏనుగులపై కాల్పుల నిషేధాన్ని రద్దు చేశారు—వార్త

GOMMEH

# ఆహార పరిస్థితిపై తర్జన భర్జనలు: లోక్‌సభలో శ్రీ సుబ్రహ్మణ్యం చాతుర్యం!!

ఆహారశాఖా మంత్రి శ్రీ సుబ్రహ్మణ్యం చాలా గడుసుగా ప్రవర్తించారు. ప్రభుత్వం ఆహార విధానం గురించి పెద్ద ఉపన్యాసాలు



శ్రీ సుబ్రహ్మణ్యం

ఇవ్వకుండా, సభ్యులు చేసిన ఫిర్యాదులకి లెక్కలతో, సంఖ్యలతో సమాధానాలు చెప్పారు. విమర్శకుల విభిన్న దృక్పథాలు ఆయనకి తోడ్పడక పోలేదు. కమ్యూనిస్టులు ఇంకా కంట్రోళ్లు కావాలనీ, స్వతంత్ర పక్షంవారు అక్కరలేదనీ చెప్పటం ఆయనకి నచ్చిఉండాలి.

శ్రీ సుబ్రహ్మణ్యం అంతటితో వూరుకోలేదు. అసలు ప్రతిపక్షం వారు చేసిన గంద్రగోళం వల్లనే అందరూ ఆహారవస్తువులు కొని దాయటం మొదలు పెట్టారనీ, వారి బాధ్యత చాలా ఉందనీ ఆరోపణలు చేశారు.

'నల్లధనం'తోనే ఆహార వస్తువులు కొని దాచటం చేత పరిస్థితులు మరింత క్లిష్టంగా ఉన్నాయన్నారు.

లోకసభలో ప్రభుత్వం మీద అవిశ్వాస తీర్మానం జయించదు. కాని, ప్రభుత్వం విజయాల మూలంగా ధరలు తగ్గుతాయా అనేది ప్రశ్న. ఈ సందర్భంలోనే శ్రీమతి లక్ష్మీమీనన్ కూడా కొన్ని నగ్న సత్యాలు బయట పెట్టారు. యంగ్ ఉమెన్స్ వెల్‌ఫేర్ ఎసోసియేషన్ సభలో మాట్లాడుతూ, "ఎరువులు కావాలంటాము, అవి గొడవున్‌లలో కుళ్లి పోతున్నాయి; కుటుంబ నియంత్రణ అంటాము, పెద్ద కుటుంబాలకే ప్రోత్సాహం ఇస్తాము. వూరికే సభలు జరిపితే ఉత్పత్తి పెరగదు," అన్నారు. "అవిశ్వాస తీర్మానాలూ ఉత్పత్తిని పెంపు చెయ్యవు. శస్త్ర చికిత్స కావాలి," అన్నారు.

ఈపాటికి ప్రధానమంత్రి ఎవరెవరు తన అనుచరులో, ఎవరెవరు తన విరోధులో తెలుసుకునే ఉంటారు. శస్త్ర చికిత్సలు చేసినా ప్రజల ఆమోదం ఉంటే ప్రమాదం రాదు. ఈ పని ఢిల్లీలో ప్రారంభిస్తే మంచిది.

## మంత్రులా? తారలా?

'ప్రణాళికల ప్రచారం' గురించి పరిశోధనలు జరిపిన నిపుణుల సంఘం ప్రభుత్వం చేసే ప్రచారం అధికంగా మంత్రుల ఉపన్యాసాలనీ, సమావేశాల వివరాలనీ గురించే ఉంటున్నదని విమర్శించింది.

ఈ సంఘం ఆలిండియా రేడియోని ప్రత్యేకంగా విమర్శించింది. వ్యక్తులపట్లా, ప్రభుత్వ శాఖల పట్లా అనవసరమయిన శ్రద్ధ చూపుతున్నదనీ, ప్రభుత్వం విడుదల చేసే వార్తల మీద మరీ ఆధారపడి ఉందనీ, సహృదయంతో చేసిన విమర్శలని కూడా స్వీకరించటం లేదనీ సంఘం అంది.

ఒక్క ఆలిండియా రేడియో మాటేమిటి? బ్యూరో ఆఫ్ ప్రెస్ ఇన్‌ఫర్ మేషన్ (పత్రికలకి సంబంధించినది) కూడా అంతే. ఈ శాఖ అధికారి పని తమ మంత్రికి అనుచిత మయిన ప్రచారం చెయ్యడం తప్ప వేరే ఏదీ లేదు లాగుంది. మంత్రుల బొమ్మల పట్ల సినిమాతారల బొమ్మల విషయంలో చూపవలసిన శ్రద్ధ చూపిస్తారు, సమాచార శాఖ అధికారులు. పన్నులు కట్టే ప్రజలకి వీరు చేసే సేవ ఇదన్నమాట.

* * *

జపాన్, చెకోస్లొవియాల నుంచి రెండు వేల 'పవర్ టిల్లర్' లని దిగుమతి చేయనుంది, ప్రభుత్వం. వీటిని దేశంలోనే తయారు చేసే పథకం ఒకటి ఉందని ఇంతకు ముందే చెప్పాను. పది వేల ట్రాక్టర్లు, టిల్లర్లు తయారు చేసే కర్మాగారాలు నెలకొలుపుతారు. టిల్లర్ల ఉత్పత్తిలో చెక్ ప్రభుత్వం సాయ పడుతుంది.

ప్రయివేటు రంగంలో ట్రాక్టర్ల ఉత్పత్తి అంత బాగా జరగటం లేదు. నాలుగు కర్మాగారాలకి లైసెన్సు లిచ్చారు కాని రెండు కంపెనీలు మాత్రమే అభివృద్ధి చూపాయి. మాసీ— ఫెర్గుసన్, ఇంటర్ నేషనల్ హార్వెస్టర్ కంపెనీలు త్వరలో చెరొక 7000 యంత్రాలూ తయారు చేస్తాయి.

* * *

జనరల్ లూసియస్ క్లే, శ్రీ స్టీఫెన్ బెక్‌టెల్‌లు ఎరువుల సమస్యని క్షుణ్ణంగా పరిశీలించేందుకని వచ్చారు. ఇద్దరూ అమెరికన్ ఎంజినీర్లే. అయిదు

## అక్టోబరు రెండున...!



అక్టోబరు రెండవ తేదీకి భారతీయ రాజకీయపు చరిత్రలో ఒక విచిత్రమైన స్థానమున్నది!......ఆ రోజున్నే భూమ్మీద అవతరించిన మహాత్మాగాంధీ భారతీయ జనజీవనంలోనే చైతన్యాన్ని తీసుకవచ్చి, స్వాతంత్ర్యం ద్వారా కొత్త అధ్యాయాన్ని ప్రారంభింపచేశారు!

నేటి మన ప్రధాని కూడా అక్టోబరు రెండున జన్మించిన సంగతి చాలామందికి తెలిసిందే. ఈ అక్టోబరు రెండుతో అరవైసంవత్సరాలు నింపుకొని అరవయ్యొకటో సంవత్సరంలో ప్రవేశించనున్న శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి యీ నాడు ప్రధానిగాను, కాంగ్రెసు కార్యకర్తగాను, ప్రజా నాయకుడుగాను ఎన్నో క్లిష్టమైన సమస్యలను ఎదుర్కొంటున్నారు!

# 'వాయిస్ ఆఫ్ అమెరికా' అయోమయ పరిస్థితి

రోజుల పాటు ఇక్కడే ఉండి ఎరువుల ఉత్పత్తిలో ప్రపంచ ప్రఖ్యాతి గడించిన కొన్ని అమెరికన్ కంపెనీల తరఫున వీరిద్దరూ మాట్లాడుతారు.

**భారత దేశం అవసరాలకి సరిపోయే పరిమాణాలలో ఎరువుల ఉత్పత్తి కర్మాగారాల నిర్మాణం లోనూ, వాటి విక్రయంలోనూ తగిన విజ్ఞానం ఉన్నవారు, సాంకేతిక నిపుణులు ఈ కంపెనీలలో ఉన్నారుట.**

డిసెంబరు దాకా వివిధ విషయాలని అనుశీలిస్తారు. 'స్టాండర్డైజ్డ్ ప్లాంట్'ల నిర్మాణానికి సంబంధించిన విషయాలన్నీ అనుశీలించి, ఎరువుల ధరలు తగ్గించే మార్గాలని వెతుకుతారు. స్టాన్‌ఫర్డ్ రిసర్చ్ ఇన్‌స్టిట్యూట్, బెక్టెల్ కార్పొరేషన్‌లు ఈ అనుశీలనలని నడుపుతాయి.

ఇండియాకి మొత్తం మీద ఎంత ఎరువు కావాలో అంచనాలు వేసి ప్రాంతీయ అవసరాలకి కావలసిన కర్మాగార నిర్మాణాలు ఎటువంటివో వీరు చెబుతారు. ఆ తర్వాత ప్రాంతీయ ఉత్పత్తి కర్మాగారాల నిర్మాణ పరిమాణాలని నిర్ణయిస్తారు. సరయిన ఒక నమూనా తయారయితే దానిని బట్టి ఎన్నో కర్మాగారాలు కట్టి అనవసరమయిన ఖర్చులు తప్పించవచ్చు.

ఉత్పత్తి మాత్రమే కాక సరఫరా, విక్రయాల విషయంలో కూడా తగిన సలహా ఇస్తారు.

అంతా సవ్యంగా ఉంటే, ఈ నిపుణుల సలహాలు ప్రభుత్వం స్వీకరిస్తే, ప్రస్తుతం భారతదేశంలో సంస్థలు, ప్రభుత్వంతో సహకరించి ఈ ప్రణాళికలో పాల్గొనవచ్చు.

## ఒప్పందం విలువ

**సమాచార శాఖ సలహా సంఘంతో శ్రీమతి ఇందిరా గాంధీ, ఒక 250 కి. వా. షార్ట్‌వేవ్ ట్రాన్స్‌మిటర్ ఒక 1000 కి. వా. మీడియం వేవ్ ట్రాన్స్‌మిటర్ కన్నా బాగా పని చేస్తుందని చెప్పారుట.** అంతేకాక రాత్రింపవళ్ళూ పని చెయ్యగలదుట, షార్ట్‌వేవ్ యంత్రం.

మీడియంవేవ్ ట్రాన్స్‌మిటర్ వాడితే 'ఇంటర్ నేషనల్ టెలి కమ్యూనికేషన్స్ యూనియన్' ఒప్పందానికి విరుద్ధంగా ఉంటుందని కూడా అంటున్నారు. ఇక కాబినెట్ తీర్మానం ఎలా ఉంటుందో చూడాలి.

'వాయిస్ ఆఫ్ అమెరికా' ఒప్పందం గురించి శ్రీమతి గాంధీ కొంచెం వివరించి ఉంటే (ఈ సందర్భంలో) బాగుండేది. అసలు ఆ ఒప్పందం ఎవరి సలహాతో చేశారు ? నిపుణుల సంఘం ఏమన్నది ? ఎవరి నడిగి 1000 కి. వా. యంత్రాల కోసం టెండర్లని తెప్పించారు ?

చేసిన ఒప్పందంనుంచి తప్పించుకొనటం చాలా ప్రమాదకరమయిన విషయం. శ్రీ గోపాలరెడ్డిని, శ్రీ నవాబ్ సింగ్‌ని పంపించినంత మాత్రాన చాలదు. ప్రజలకి అన్ని వివరాలూ తెలపాలి, శ్రీమతి గాంధీ పైన చెప్పిన 'ప్రకటన'తో పరిస్థితిని మరింత అయోమయం చేశారు.

* * *

ఇటీవలి పార్లమెంటు సమావేశం ప్రారంభమే ఒక విశిష్టమైన ధోరణిలో అయింది. స్వతంత్ర సభ్యుడు శ్రీ ఎన్.సి. చటర్జీ శాస్త్రిమీద ప్రారంభించదలచిన అవిశ్వాస తీర్మానానికి, ప్రతిపక్షాలు అన్నింటినీ తన నీడనకూడాగట్టుకోవాలని తాపత్రయపడిన మాట వాస్తవం. ఆయన కొంత విజయాన్నికూడా సాధించారనే చెప్పాలి. దాదాపు 50 మంది సభ్యుల ఆమోదం ఆయనకు లభించటంతో, ఈ అవిశ్వాస తీర్మానం చర్చకు లోకసభలో అంగీకారంకూడా లభించింది.

ఈ కథంతా జరుగుతుందనీ ప్రభుత్వానికి ప్రభుత్వ పెద్దలకుకూడా తెలుసు. దేశంలో ఆహార పరిస్థితి చర్చకోసం తీర్మానాన్ని ఒకదానిని ప్రతిపాదిస్తూ, ప్రభుత్వం తద్వారా ప్రతిపక్షాన్ని వాళ్ళ అవిశ్వాసతీర్మానాన్ని మరో ప్రక్కకునెట్టింది.

ఆహార పరిస్థితిపై జరిగిన చర్చకూడా ప్రస్తావించ తగినదే. ఇందులో ఎన్నో సాధక బాధకాలు ఉన్నాయి. ఈ చర్చమీద లోక్‌సభలో తలకొక అభిప్రాయం వంతున వ్యక్తీకరించటంవల్ల, ఆహార మంత్రికి తన బాధలను చెప్పుకోవటానికి సులువు ఏర్పడింది. ఒకవైపున కమ్యూనిస్టుల, దాదాపు అవే భావాలుకల కొందరు కాంగ్రెసు పెద్దలు మాట్లాడుతూ, ఆహారపదార్థాలు వ్యాపారం, ఎగుమతి, బ్యాంకింగులను జాతీయకరణ చేయాలని కోరారు. స్వతంత్రపార్టీ మరువైపున గొంతు సవరించుకుంటూ కంట్రోళ్ళు, పాక్షిక జాతీయకరణాలవల్లనే ఈనాటి అనర్థాలు తలయెత్తాయని పేర్కొన్నది. ఇక ఇండియన్ చేంబర్స్ ఆఫ్ కామర్స్ ఫెడరేషన్ సరే! వాళ్ళ కథనం ప్రకారం ప్రతి వ్యాపారీ భూమ్మీద జన్మించిన దేవతలాంటివాడుట ! డబ్బు వాసన అంటే గిట్టదట !

లోక్‌సభలోకూడా ప్రభుత్వంయొక్క ఆహార విధానం సమర్థించటంతో, ప్రతిపక్షాలు తేదలచిన అవిశ్వాస తీర్మానం ఎలాంటి దారుణ స్థితిలో పడిందో వేరే చెప్పనక్కరలేదు.

ఇదంతా చూస్తుంటే, కాంగ్రెస్‌కు కలుగుతున్న అపాయానికి ముఖ్య కారణం ఆ సంస్థలోని కొందరు వ్యక్తులేనా ?— అన్న సందేహం కలుగక మానదు. అటు పంజాబ్, ఇటు దక్షిణాదిన కేరళలో జరిగిన 'భాగోతాల'వల్లకూడా కాంగ్రెస్ సంస్థలలో అనర్థాలున్నట్లే బుజువవుతున్నది. కేంద్రం పరిస్థితి అంతే !

**అసలే దేశమూ, పరిస్థితిలూ అంతంత మాత్రంగా ఉంటే, ఇదే అదనుకదా అనుకుంటూ పండిట్ కె.డి.మాలవీయాలాంటి మహానుభావులు నాయ**

---

## ఇంటింటి పద్యాలు

**ఆరుద్ర**

**ఆకాశంలో ఇన్ని నక్షత్రా లెప్పుడూ లేవు**

అమ్మో ఈ యేడు మండిపోతున్నాయి ఎండలు
అని బాదుకుంటారు కొందరు గుండెలు
ఇదేమిటీయేడు ఇంత విపరీతంగా చలి
ఇంకా సందేహమా ! ప్రవేశించింది పూర్తిగా కలి
ఇలా ఎడతెరిపి లేకుండా పడుతున్నాయేం వానలు
ఇంగ్లీషు సామెతలా కురుస్తున్నాయి కుక్కలూ పిల్లికూనలు
సక్రమంగా సాగడానికి ఋతువులు
సాగించేవారు పూర్వం క్రతువులు
ఎవరేం చేసినా ప్రకృతి
ఎప్పుడూ మారుస్తూ వుంటుంది తన ఆకృతి
ఎండో వానో మబ్బో ఎలాగో ఒకలాగ ఉండాలికదా వాతావరణం
ఎలా ఉన్నా దాన్ని ఆడిపోసుకొంటేనే కాలహరణం.

# మాలవీయ, మీనన్ ల అంతర్నాటకంలో అంతరార్థం

కలిసిపోతున్నారు. ఈతని వర్గం ఈ మధ్యనే ఒక సదస్సును జరిపింది. ఈ సదస్సులో శ్రీ కామరాజ్ శ్రీమతి ఇందిర, శ్రీ నందా, ప్రభృతులుకూడా పాల్గొన్న సంగతి తెలిసిందే.

శ్రీ కామరాజ్, ఈ సందర్భంలోనే ఒక ఉపన్యాసంచేస్తూ, కాంగ్రెస్ సంస్థలో ముఠాతత్వం నశించాలన్నారు. తనకి ఇది ఎందుకు వర్తించి ఉండదా అని కాబోలు— శ్రీ మాలవీయ మరుక్షణంలో తన సహకారాన్ని అందచేస్తానని కామరాజ్ కు వాగ్దానంచేశాడు.

రేపో, మాపో గాంధీజీ జన్మదినోత్సవం రానున్నది. ఈ మాట తలచుకున్నప్పుడల్లా హృదయం బరువెక్కిపోతున్నది. గాంధీజీ ఆదర్శాలు ఎక్కడా వినిపించటంలేదు, కనిపించటంలేదు. ఇంకా విపులంగా చెప్పాలంటే అవి విక్రమార్కుడి సింహాసనంకన్నా, భోజరాజు సాలభంజికలకన్నా పాతబడ్డాయా అనిపిస్తుంది. మన ప్రక్కన ఉన్న సామాన్యునికి సేవ చేయాలని గాంధీజీ ఆదర్శం రూపుమాసిపోయింది. అంతటితో ఆగలేదు. ఆత్మసేవ, 'అహమూ' పెచ్చు పెరిగి హద్దులుదాటిపోతున్నాయి. అందాకా ఎందుకు?— ఈ మధ్య జరిగిన అఖిలభారత కాంగ్రెస్ సమావేశంలో శ్రీమతి ఇందిరాగాంధీ ఉండనే ఉంది. కామరాజు పథకాన్ని కొందరు కాంగ్రెస్ వాదులు దుయ్యబట్టింది కూడా ఈ సమావేశంలోనే కదా ! ఈ దుయ్యబట్టటం ద్వారా, కొందరు మాజీ మంత్రులకు కలిగిన సంతృప్తిని శ్రీమతి ఇందిరా గాంధి గమనించి ఉండకపోదు.

అంతటి సమావేశంలో, కాంగ్రెస్ 17 ఏళ్ల ప్రగతిని సమర్థించటానికి శ్రీమతి ఇందిరాగాంధి ఎలుగెత్తి ముందుకు వచ్చారు. ఇందుకు మరో కారణం ఉంది. కాంగ్రెసు పాలనను విమర్శించటం, ఇంతకాలంగా తన తండ్రిచేసిన పరిపాలననే విమర్శించినట్లు అవుతుంది.

మరో దృష్టాంతంకూడా ఉంది. ఈ మధ్య ఒక సమావేశంలో మన ప్రధాని శ్రీ శాస్త్రి వ్యవసాయంయొక్క ప్రాధాన్యత ఉగ్గడిస్తే, శ్రీమతి గాంధి భారీ పరిశ్రమల ఆవశ్యకతను స్పష్టీకరించారు. అంటే, ఇండియాయొక్క నిర్మాణాత్మక ప్రగతికి అవకాశాలను విస్మరించి, శ్రీమతి గాంధి తన తండ్రి ఆదర్శానే కొనసాగాలని ప్రయత్నించారని చెప్పుకోవచ్చు.

శ్రీ నెహ్రూ రాటుదేలిన రాజకీయవాదే కావచ్చును. కాని, ఒక దృక్పథంనుంచి చూస్తే శ్రీ నెహ్రూ మరణాంతరమే శ్రీమతి ఇంధిరా నిజమైన రాజకీయరంగంలోనికి ప్రవేశించింది. అందువల్ల మరో అనర్థం ఉంది. శ్రీమతి ఇందిరని సరియైన మార్గంలో ఎవరు నడిపిస్తారు ? ఎలా నడిపిస్తారు?

తెలుగు వ్యాకరణం విద్యార్థికి విరోధాభాసాలంకారం చెప్పి, దానికి ఉదాహరణగా శ్రీమతి ఇందిరా గాంధి పేరు చెపితే చాలు. అదీ యీనాటి ఆమె పరిస్థితి.

పది, పదిహేనురోజులయి ఉంటుంది. — ఒక



శ్రీమతి ఇందిరాగాంధి

సందర్భంలో శ్రీమతి ఇందిరాగాంధి మాట్లాడుతూ గుల్జారీలాల్ నందా 'అవినీతి నిర్మూలన' కు చేస్తున్న కృషిని ఆక్షేపించింది. 'అవినీతి' అనే సమస్యకి ఇంతటి ప్రచారాన్ని ఇవ్వటం శ్రీమతి గాంధికి నచ్చకపోవచ్చును. కాని, నందాగారు పాతకాలపు కాంగ్రెసువాదుల్లో ఒకరు. అందువల్ల నినాదాలమీద, జనబాహుళ్యపు ప్రచారాలమీదనే ఆయనకు నమ్మకం ఉండవచ్చును.

ఏ. ఐ. సి. సి. సమావేశంలో శ్రీమతి ఇందిరా గాంధి చెప్పిన కొన్ని మాటలు ఇంకా విచిత్రంగా ఉన్నాయ్. ప్రజలు నిత్యజీవితపు సమస్యలతో ఉక్కిరి బిక్కిరి అయిపోతున్నప్పుడు వాస్తవిక జీవితానికి దగ్గరగా లేని సమస్యలను కాంగ్రెసు చర్చించాలని వా రన్నారు.

కాంగ్రెసులో వారికి గౌరవప్రదమైన స్థానమే ఉంది. కాని దానికి, దీనికి సంబంధం లేదు.

ఆమె ఈనాడు వివిధ రాజకీయ పక్షాలున్న ఒకానొక లోక్‌సభలో ఉంది. సహజంగా వారి తాతగారైన మోతీలాల్‌కంటే ఇందిరాగాంధికే విర్లక్షణ మెక్కువ. పైగా, ఏంచేసినా, ఏమన్నా ప్రతి పత్రిక ఆమెను ఆకాశానికి లేవనెత్తటం మరో విషాదాంత కథ. సరియైన మార్గం చూపగల జ్యోతి ఏదైన లభించిననాడు ఆమె తప్పకుండా గొప్ప నాయకురాలు అవుతుంది.

పండిట్ మాలవీయ జరిపిన సదస్సులో చాలా మందికి పూడిపోయిన గొంతులో తిరిగి రహదార్లు ఏర్పడ్డాయి. ప్రతివాడూ ఉపన్యాసం దంచేసినవాడేగదా ! "ఎయిర్ కండిషన్డు" బంగాళాలలో, ఖరీదైన ఉన్ని దుస్తులు ధరించే పెద్దలు చాలామంది 'సోషలిజం' గురించి ఉపన్యసించ బూనుకోవటం హాస్యాస్పదంగా లేదూ ! మహానుభావులు కృష్ణ మీనన్, మాలవీయ కలసి ఇండియాలోని పేదవాని సొమ్ముని ఎంత దుర్వినియోగం చేశారో ఇంకా లెక్క వేయవలసి ఉన్నదన్న సంగతి మా పాఠకులు మరిచిపోలేదనే భావిస్తా !

ఢిల్లీ అంతా వరదల్లో మునిగి తేలుతున్న సమయంలో మాలవీయ ఈ సమావేశం జరపటానికి బదులు, ఆ డబ్బును వరదబాధితులకైనా ఇచ్చి ఉంటే, పుణ్యమో, పురుషార్థమో మిగిలేది. పాపం అదీ మిగల్లేదనే నా చింత.

అసలు రహస్యం వేరే ఉంది. దేశంలో సోషలిజం నెలకొల్పాలనిగాని పేదరికం నిర్మూలించాలనిగాని వీళ్లసలు అనుకోరు. మళ్లీ 1967 జనరల్ ఎన్నికలు రానున్నాయిగా! దానికే యీ నిర్మాణం, యీ కపట నాటకమంతా !

శ్రీకృష్ణ. ★

కుమారి లలితాకుమారి ఆ రోజు సందిగ్ధావస్థలో పడ్డది. తన మనో భావాలు తనకే అర్థం కావడం లేదు. పెళ్లి అంటే తనకు భయం లేక పోయినప్పటికీ పెళ్లి గురించి నికరమైన అభిప్రాయాలు ఏవీ లేవు.— కనీసం తన పెళ్లి గురించి.

ఆమె రాసిన వంద పైచిలుకు కథల్లో చాలా సార్లు పెళ్లి, ప్రేమా గురించి తన పాత్రల చేత వాగ్వాదాలు జరిపించింది. ప్రేమలేని పెళ్లిళ్ల మీదా పెళ్లిని కోరని ప్రేమ మీదా డజన్ల కొద్దీ కథలు రాసింది. పెళ్లయిన భార్యా భర్తల మధ్య కీచులాటలూ, భార్యలను కుక్కల కన్నా హీనంగా చూసే భర్తలనూ సృష్టించింది. పవిత్ర ప్రేమ కల ప్రేమికులు ఆత్మహత్యలు చేసుకోవటమూ, సంఘానికి ఎదురాడి ఎన్ని కష్టాలు వచ్చినా సహించి, కొండలూ, గుట్టలూ ఎక్కి, నదులు దాటి మనసారా ప్రేమించిన యువతిని కథానాయకుడు చేపట్టిన ఘట్టాలు ఎన్నో సృష్టించింది.

కాని తనకు మాత్రం వాటివంటి ఏ ఒక అవకాశం లభించలేదు. కాబట్టి వాటి యాదార్థ్యం ఆమెకు తెలీదనే చెప్పాలి. ఆమెకు జీవితం గురించి అనుభవం కన్న, పరిజ్ఞానం ఎక్కువ. ఆమె కథానాయికలు మాత్రం ఏ ప్రబంధ నాయికకూ తీసిపోరు. వారందరికీ కాస్తో, కూస్తో సాహిత్య పిపాస ఉంటుంది. వాళ్లు పుస్తకాలు — యింటి పని చేస్తారో, చెయ్యరో, మనకు తెలీదు — ఇరవై నాలుగు గంటలూ చదువుతారు. జుట్టు కత్తిరించుకుని, పెదాలకు రంగులు వేసుకునే స్త్రీలు కూడా ఆవిడ కథల్లోకి తొంగి చూస్తూ వుంటారు. కాని వాళ్లు దుష్ట వర్గానికి చెందిన వాళ్లు. ఆవిడ కథల్లో ఇంకొక ప్రత్యేకత ఏమిటంటే కథానాయకుడూ, కథా నాయికా ఒకళ్లనొకళ్లు ముట్టుకోరు. కనీసం ఓ పది అడుగులు దగ్గరగానైనా రారు. మనుషుల్లో 'రేడియో యాక్టివ్' కిరణాలు లేవని ఏం నమ్మకం ? అందుచేత అవివాహితులైన ప్రేమికుల చేత అప్రాచ్యపు పనులు చేయించటం ఆవిడకు అలవి కాని పని. ఎంత 'షూర్ షాట్'గా పెళ్లి కాబోతున్నప్పటికీ వాళ్లు కావిలించుకోవటమూ ముద్దు పెట్టుకోవటమూ చాలా చౌకబారు వీధి వేషాలుగా కనిపించేవి ఆవిడకు. అంత ఆత్రం వుంటే పెళ్లయే వరకూ ఆగవచ్చుగా ? మొదటి రాత్రి ఆలీలలన్నీ జరుపుకో వచ్చుగా ? చిక్కేమిటంటే ఆవిడ దానికి కూడా ఒప్పుకోదల్లే వుంది, ఎప్పుడూ అటువంటి రాత్రి అనుభవాలు ఆమె రాయలా. ఎందుచేతనంటే ఆవిడ రాసిన కథలు ఆ రాత్రి రాక మునుపే అంతమైపోయేవి.

ఒక్క ముక్కలో చెప్పాలంటే ఆవిడవన్నీ విచిత్రమైన భావాలు. కథల్లో రెండు పార్టీలు. పెళ్లవాళ్లు కథ చివరన చచ్చి అయినా పోయేవాళ్లు లేదా వోడిపోయే వాళ్లు. ఒక్కొక్కప్పుడు పశ్చాత్తాప పడేవాళ్లు కూడా, మంచితనమూ, ప్రేమా చివరకు గెలుస్తాయి. వీటిని బట్టి లలితా కుమారి ఆదర్శాలు మనం తెలుసుకోవచ్చు.

ప్రస్తుతం ఆవిడ మనస్సును చికాకు పరుస్తున్నదేమిటంటే, ఆమె కోసం తలిదండ్రులు పెళ్లి సంబంధాలు చూస్తున్నారు. ఓ డజను సంబంధాలు ఎరుకలో ఉన్నాయి. ఇంకొక రెండు డజన్లయినా రావచ్చు. లలితా కుమారికి పెళ్లి చెయ్యాలనే జిజ్ఞాస ఆమె తండ్రిని వేధిస్తున్నదీ మధ్య. ఆమెకు పెళ్లి కాదనే దిగులు ఆయనకి లేదు. ఆమె ఎం. ఏ. చదువు కున్నదీ, కనీసం అయిదారు సంవత్సరాల నుంచీ రచయిత్రిగా గొప్ప పేరు తెచ్చుకుందీ. ఆవిడను చేసుకోమని పేపర్లో ప్రకటిస్తే ఈ రోజున కనీసం రెండు వేల దరఖాస్తులయినా వస్తాయి. కారణమేమింటే ఆమె ఒక విధంగా 'ప్రాడిజీ.' ఆవిడ పదిహేనో ఏట తన మొట్ట మొదటి కథ రాసింది. ఆ తర్వాత గాండీవంలోంచి తూపులు వచ్చినట్టు ఈ అయిదారు సంవత్సరాలుగా, కథలు వెలువడుతున్నాయి. ఆవిడకు వారి వూరివాళ్లు సన్మానం ఏర్పాటు చేస్తే, ఏం మాట్లాడాలో తోచక ఏడ్చి కూచుంది — అవి ఆనంద బాష్పాలు ! ఆవిడకు ఇంత అనుభవం ఎట్లా వచ్చింది చెప్మా అని ఆవిడ కథలు చదివిన జుట్టు నెరిసిన పెద్దలు సైతం ముక్కు మీద వేలు వేసుకున్నారు. కాబట్టి పెళ్లి కుమార్తెగా ఆవిడకు ఘనమైన భవిష్యత్తు వుంది. కొంత మంది గడుగ్గాయిలు ఆవిడకు ప్రేమలేఖలు గూడా రాశారని వదంతి. ఈ పుకార్లను మనం నమ్మా



రచన:

## రామన్న



ల్సిన అవసరం లేదనుకోండి. ఆవిడ తండ్రిని కలవరపరుస్తున్నని ఇవేవీ కావు. ఆమె వయస్సు ఇప్పుడు ఇరవై ఒకటి. ఇంకా వయస్సు ముదరక మునుపే పెళ్లిచేసి చూడాలని ఆయన అభిలాష. అందువల్ల పెళ్లి సంబంధాలు చూస్తున్నారాయన. అన్ని విధాలా అనుకూలమైన సంబంధం కలిసి వస్తే ఎంత కట్నమయినా ఇవ్వటానికి ఆయన సిద్ధంగానే ఉన్నాడు. ఆ సంగతి లలితా కుమారికి తెలీకుండా గుప్తంగా వుంచాడు. ఆవిడకు తెలిస్తే చచ్చినా పెళ్లి చేసుకోదు. పైపెచ్చు దాని మీద నాలుగయిదు కథలు కూడా రాయచ్చు.

ఇంతవరకు వచ్చిన సంబంధాలలో సగం తల్లి దండ్రులే పడగొట్టారు. మిగతా సగం ఆమె బుట్ట దాఖలా చేసింది. బుట్ట దాఖలా అయిన వాటిల్లో ఒకరిద్దరు అందమైన కుర్రాళ్లు లేక పోలేదు. కానీ లలితాకుమారికి కావలసింది బాహ్యాకర్షణ కాదు. హృదయ సౌందర్యం. ఆ హృదయ సౌందర్యం ఎట్లా కనిపెట్టడం అదో ఆవిడకే తెలియాలి. ఆవిడ ఇంతవరకూ ఏ యువకుడికీ దగ్గరగా రాలేదు — ఆవిడ రాసే కథల్లోని ప్రధాన పాత్రలకు మల్లే. కనీసం గూరాన్నించయినా ప్రేమించలేదు. బొత్తిగా ముక్కూ మొహం ఎరుగని మనిషిని ఎట్లా పెళ్లి చేసుకోవటం ? పెళ్లి చేసుకున్నాక అతని అభిరుచులూ, తన అభిరుచులూ కలవక యావజ్జీవం ఘర్షణ పడాల్సి వస్తుంది.

లలితాకుమారి బుర్ర వేడెక్కింది. చేతిలో వున్న 'గోరా' పుస్తకం సోఫా మీద పెట్టి బాల్కనీలోకి వెళ్లింది. బయట పిండార బోసినట్లు వెన్నెల. కొబ్బరిచెట్ల ఆకుల మధ్య నుంచి పూర్ణ చంద్రుడు కనుపిస్తున్నాడు. ఎక్కడ నుంచో నైట్‌క్వీన్ పరిమళం వస్తోంది. వాతావరణం రసమయంగా వుంది. మెల్లిగా కదిలి తన గదిలో డ్రస్సింగ్ టేబుల్ ముందు నుంచుంది. అద్దంలో తన ప్రతిబింబం చూసుకుంది. తెల్లని కాటన్ చీర, నల్లని రవికతో, వదులుగా వేలాడుతున్న జడను ముందుకు వేసుకునే తన ప్రతిబింబాన్ని కాస్సేపు దీక్షగా చూసుకుంది. ఇక్కడ లలితాకుమారి అందం గురించి కొంచెం ప్రస్తావించటం అవసరం. ఆవూళ్లో వున్న వందమంది అందమైన అమ్మాయిల జాబితా తయారు చేస్తే, లలితాకుమారి పేరు దాంట్లో తప్పకుండా వుంటుంది. ఆమె రంభ కాదు. కాని ఆమెలో ఆకర్షణ లేకపోలేదు. కోల మొహం పెద్ద కళ్లు, పొడుగాటి జడా. ఆమెకు పూలు పెట్టుకునే అలవాటు లేదు. పూలంటే మాత్రం చాలా ఇష్టం. జడ కూడా ఎప్పుడూ వదులుగా వేసుకుంటుంది. వస్తూతా మనిషి పొడగరేమో, ఏ చీర కట్టుకున్నా తీర్చిదిద్దినట్టు ఉంటుంది. ఎప్పుడూ కాటన్ చీరలు మాత్రమే కట్టుకుంటుంది. రెండు చెవులకూ దిద్దులు తప్పితే వేరే నగలు లేవు. వుంటానికి చాలా వున్నాయి. వాటిని పెట్టుకోటం ఇష్టం లేదు. ఎప్పుడయినా వాళ్లమ్మ పోరగా పోరగా పట్టుచీర కట్టుకుని నగలు పెట్టుకునేది. ఎం. ఏ. పాసయిన తర్వాత అదీ మానేసింది. ఏ విధమైన ఆడంబరం లేకపోయినా తనలో ఉన్న ఆకర్షణ శక్తి మీద లలితాకుమారికి చాలా విశ్వాసం వుంది. అందుచేతనే తనకు వచ్చే సంబంధాలలో అవతలి వాళ్లకు తను నచ్చుతానా లేదా అనే సమస్య ఆమె తలలోకి ప్రవేశించనే లేదు. లలితాకుమారి అద్దం ముందు నుంచుని అక్కణ్నుంచి కదలి వెళ్లి హాల్లో సోఫాలోకి చేరగిలి బడింది. లలితాకుమారి తండ్రి రాఘవయ్యగారు హాల్లోకి వచ్చారు. చేతిలో ఉత్తరం ఏదో కాగితాలూ ఉన్నాయి.

"అమ్మాయి లలితా, ఏం చేస్తున్నావమ్మా ?" అంటూ వచ్చి పక్కన కూచున్నారు.

"ఏం లేదు నాన్నా ఏదో పుస్తకం చదువుకుంటున్నాను." అంది లలితా కుమారి.

"ఇవ్వాళ ఓ మంచి సంబంధం వచ్చింది తల్లీ. ఇదుగో మద్రాసు నుంచి జానకి రామయ్యగారి ఉత్తరం. ఆయన అమధ్య ఢిల్లీ వెళ్లినప్పుడు అక్కడ రాజారావు గారని, ఓ పాత స్నేహితుని ఇంటికి వెళ్లారట. వాళ్లబ్బాయి పెళ్లికి ఉన్నాడట. ఇరవయి ఎనిమిదేళ్లు. ఢిల్లీలోనే ఇంజనీరుగా పని చేస్తున్నాడట. ఆ అబ్బాయి ఫోటోను లలితా కుమారి చేతికిచ్చారు.

లలిత ఆ ఫోటో వైపు నిర్వికారంగా చూసింది. కుర్రాడు మాత్రం బావున్నాడు. కళ్లూ, ముక్కూ, పెదిమలూ తీర్చి దిద్దినట్టున్నాయి. తెలివైన మొహం. సూటు వేసుకుని, రెండు చేతులూ పాంటు జేబుల్లో పెట్టుకుని ఠీవిగా నుంచుని ఉన్నాడు.

"ఎట్లా వున్నాడు లలితా ?" ఆత్రంగా అడిగారు రాఘవయ్యగారు.

" ఫోటోలో చూడ్డానికి బాగానే కనిపిస్తు న్నాడు. కానీ .........."

" ఈ సంబంధం దివ్యంగా కనుపిస్తోంది నాకు. రాజారావు గారి కుటుంబం కూడా నవనాగరికంగా కనుపిస్తుంది. ఆయన చాలా కాలం ఢిల్లీలో ఏదో పెద్ద ఉద్యోగంలో ఉండి రిటైరైనారట. ఆయనకు నలుగురు కొడుకులు, ఇద్దరు కూతుళ్ళా నట. ముగ్గురు కొడుకులకు పెళ్ళయి మంచి ఉద్యోగాలలో ఉన్నారట. ఇతను — పేరు — మదన — పేరే ఎంత నవనాగరికంగా ఉందో — యూరప్‌లో మూడు సంవత్సరాలు ఇంజనీరింగులో ట్రెయినింగు పొంది వచ్చాడట. జీతం ఎనిమిది తొమ్మిదొందలు వుండవచ్చునని జానకి రామయ్యగారు రాశారు. ఇతని అన్న ఒకతను అమెరికాలో ఉన్నా డట. ఇంకొకతను రష్యా వెళ్లపోతున్నాడట. . . . దేముడి దయవల్ల ఈ సంబంధం కనుక కుదిరితే ..." రాఘవయ్య గారి ఉత్సాహం గోదావరి వరదలా పొంగుతోంది.

" అదంతా ఎందుకు నాన్నా ? వాళ్ల ఐశ్వర్యం వాళ్లకే ఉంటుంది. మనకు ఒరిగేదేముంటుంది !" అంది లలిత ఈ సంబంధం తనకు నచ్చని దానల్లే.

రాఘవయ్యగారి నెత్తి మీద ఏదో బలముయినది పడ్డట్టయింది.

" అయితే నువ్వీ సంబంధానికి ఒప్పుకోవా ? " అని అడిగారు రాఘవయ్యగారు తన చెవులను తనే నమ్మలేని వాడిలా.

" ఒప్పుకోనని నేననటం లేదు. ముందు అతన్ని మనం చూడనీయండి. మనకీ వాళ్లకీ అన్నీ కుదరాలి. అతను నాకు నచ్చాలి. ఆ తర్వాత ఎన్నో విషయాలు మాట్లాడుకోవాలి. ఈలోపుగానే మనం స్వర్గం దిగివచ్చినట్లు గంతు లెందుకు వేయటం ?" అంది లలితాకుమారి నిబ్బరంగా, తన సహజ రచనా ధోరణిలో.

" అన్నీ కుదురుతాయి తల్లీ. నువ్వు సరేనంటే చాలు....... నాకు తెలుసు నువ్వు ఒప్పుకుంటావని !"

# రచయిత్రి పెళ్లి

ఉత్సాహంగా భార్య వద్దకు పరుగెత్తాడు రాఘవయ్యగారు.

లలితాకుమారి తన చేతిలోనున్న ఫోటో వైపు దృష్టి మరల్చింది. " ఎంత బాగున్నాడు ? " అనుకుంది. తన తండ్రి దగ్గర తన అభిప్రాయం వెలిబుచ్చడం ఇష్టం లేదు.

సోఫాలోంచి లేచి వెళ్లి తన బెడ్ రూంలోకి వెళ్లి బెడ్‌లైటు వేసింది. పక్క మీద బోర్లా పడుకుని ఫోటోను లైటుకు దగ్గరగా పెట్టి చూడ సాగింది.

" ఇతని మనస్తత్వం నాకు తెలిస్తే ఎంత బావుణ్ను" అనుకుంది. ఇంజనీరంటే స్క్రూ డ్రైవరు పట్టుకుని వుంటాడు. కావల్ను. సాహిత్యం అంటే ఏమైనా అభిరుచి వుందో లేదో, ఇతను పెళ్ళాన్ని పువ్వుల్లో పెట్టి పూజించే రకమో, లేక కుక్కలా చూసే రకమో !"

ఎంత ఆలోచించినా మదన మీద దురభిప్రాయం కలిగించుకో లేకపోయింది లలిత.

"ఛా ! ఏమిటి నా అనుమానాలు. మనిషిని చూడందే అతని మీద అభిప్రాయం ఏర్పడటం ఎట్లా ? " అనుకుని 'గోరా' పుస్తకంలో పెట్టేసింది ఫోటోను.

లలితాకుమారి మనసులో ఏదో తెలియని అలజడి మొదయింది. దీపం ఆర్పేసి పడుకోటానికి ప్రయ త్నించింది. నిద్ర రావటం లేదు. తలంతా ఆలోచ నలతో నిండి వుంది. పక్క మీద అటూ ఇటూ దొర్లింది. తర్వాత పక్కమీద నుంచి లేచి బాల్కనీలోకి వెళ్లి పిట్టగోడ వానుకుని నుంచుంది. బయట చల్లని వెన్నెల. ప్రకృతి ప్రశాంతంగా వుంది. తన మానసిక స్థితి మీద కథ రాద్దామని గదిలోకి వచ్చి కాగితం, కలం తీసుకుని పక్కమీద బోర్లా పడుకుంది. లైటు వేసి కథ రాయటానికి తెల్ల కాగితం మీద కలం పెట్టింది. కలం సాగలేదు.

కలం పక్కన పెట్టేసి, 'గోరా' పుస్తకం తెరిచింది. ఫోటో కింద బడ్డది. గుండెల్లో ఏదో అర్థం కాని వేగం. ఫోటో వేపే చూస్తూ పడుకుంది. ఏవో భావాలు మనసును గిలిగింతలు పెట్టసాగాయి. ఫోటో పుస్తకంలో పెట్టేసి, లైటు ఆర్పేసింది. ఆ రాత్రికి నిద్ర రావటం అసంభవం. రచయిత్రి కూడా మనిషే.

వో వారం రోజుల తర్వాత ఢిల్లీ నుంచి ఉత్తరం వచ్చింది. వచ్చే నెలలో మదన ఏదో పని మీద మద్రాసు వెళ్లబోతున్నాడట. వచ్చేటప్పుడు, పోయేటప్పుడో మధ్యలో దిగి పిల్లను చూసి పోతా నని ఉత్తరం రాశాడట. వాళ్ల నాన్న, అమ్మా వాళ్ళ పిల్లను చూడ నక్కర్లేదట. అబ్బాయికి నచ్చితే వాళ్లకు నచ్చినట్టేనట. వాళ్ళు కట్నాలూ, కానుకలూ పుచ్చుకునే రకాలు కారట.

రాఘవయ్యగారు ఈ సంబంధం కుదరాలని వెయ్యి దేవుళ్లకు మొక్కుకుంటున్నాడు.

రెండు వారాల తర్వాత మదన రానే వచ్చాడు. ఫోటోలో కంటే బావున్నాడు. ఉలెన సూట్ వేసు కుని అందంగా ఉన్నాడు. చేతిలో వో ప్లాస్టిక్ సూట్ కేస్ ఉంది. రాఘవయ్యగారు స్టేషనుకు వెళ్లి వెంట పెట్టుకుని తీసుకు వచ్చారు.

"కూచోండి. కాఫీ చెప్పివస్తా"నని రాఘవయ్య గారు డ్రాయింగు రూంలో మదనను కూచో పెట్టి లోపలికి వెళ్లారు.

మదనకు ఏం చెయ్యటానికీ తోచక గదంతా కలయ చూశాడు. గోడకు రవీంద్రనాథ్ టాగూర్ ఫోటో తగిలించి ఉంది. మరో వైపున మహాత్మా గాంధీ చిత్రం. గదికి నాలుగు వైపులా అద్దాల బీరువాలు. వాటినిండా పుస్తకాలు. వో పక్కగా రేడియోగ్రాం ఉంది. దానిమీద శివపార్వతి శిల్పం ప్రక్కనే ఫ్లవర్‌వేస్. ఇవికాక కొన్ని దేవుళ్ల చిత్ర పటాలు వేలాడేసి ఉన్నాయి. మదన ఎందుకో చిన్న నవ్వు నవ్వాడు. పుస్తకాల బీరువా దగ్గరగా వెళ్లి పుస్తకాల పేర్లు చూశాడు. ఒక అరంతా టాగూర్ పుస్తకాలు— గీతాంజలి, ఇతర పుస్తకాలు, క్రింద అరలో 'నారాయణరావు', 'వేయి పడగలు' ఆంధ్ర మహాభారతం, రామాయణం ఇత్యాది. మదన ముఖం మీద మళ్లీ చిరునవ్వు కనుపించింది.

హాల్లోకి ఎవరో వచ్చిన చప్పుడయి మదన వెనక్కు తిరిగాడు— రాఘవయ్యగారూ, లలితా కుమారి, వెనకాలగా రాఘవయ్య భార్య పార్వతమ్మ గారు. ఆవిడ గుమ్మం దగ్గరనే ఆగి, చీరచెంగు చేత్తో పట్టుకుని నుంచుని ఉండి పోయింది.

లలితాకుమారి ట్రేలో మూడు కాఫీకప్పులు పట్టుకుని టీపాయ్ మీద ఉంచింది.

"మా అమ్మాయి లలితాకుమారి" అని మద నకు పరిచయం చేశారు రాఘవయ్యగారు.

"నమస్కారం." చేతులు జోడించి సిగ్గుతో తల దించుకుంది లలిత. అప్పుడు మదన చేతిలో ఉన్న పుస్తకం షెల్ఫులో పెట్టి నమస్కారం పెట్టాడు.

మదన కాసేపు నింపాదిగా లలిత వైపు చూశాడు. లలిత మదన వైపు చూసింది. రాఘ వయ్యగారు మదన ముఖంవైపే చూస్తున్నాడు.

45 వ పేజీ చూడండి



# ఆదర్శవంతమైన జీవితంకోసం ఉగాండా మహిళల పంచశీల!

జె. వరలక్ష్మి

ఉగాండా అనే దేశాన్ని తలచుకోగానే అతి సార వంతమైన భూమి, చాలినంత వర్షపాతం జ్ఞాపకం వస్తాయ్. ఈ భూమిని దున్ని పంటలు పండించ టానికి తగినంత మంది స్త్రీలు కూడా ఉన్నారు. అందేత ఈ దేశంలోని జనాభాకు పెద్దగా అవసరా లనేవి కూడా లేవు. ఇక స్త్రీలకున్న దల్లా ఒకే ఒక కోరిక ! చదువుకోవాలనీ, కళాత్మకంగా అల్లికలు, కుట్లు తయారు చేయాలనీ, అధునాతన పద్ధతు లలో జీవించాలనీ, నాగరికతా ప్రభావం వల్లనే నేమో బలమైన యీ కోరిక కలిగింది. ఇది గుర్తించి ప్రభుత్వం, వారిని ఉత్సాహ పూరితులను చేయా లని నిశ్చయించింది. ఆఫ్రికన్ ప్రజలలో బిడ్డల ఎడల ఆసక్తి హెచ్చు ! శిశుమరణాలు లేకుండా బిడ్డలను ఆరోగ్య కరమైన పద్ధతులలో పెంచడం ఎలాగో నేర్పి, తల్లులకు నవజీవన పద్ధతులలో జీవించటం కూడా నేర్పుతున్నది ఆ ప్రభుత్వం.

1946వ సంవత్సరములో మహిళా సంస్థలు అక్కడక్కడా స్థాపించి మహిళాభ్యుదయం యొక్క అవశ్యకతను వివరించి చెప్పటంతో ఈ కార్య క్రమం ప్రారంభ మయింది. క్రమ క్రమేణా ప్రతి జిల్లాలోనూ సంక్షేమ కార్యక్రమాలు వ్యాప్తి చెందాయి. జిల్లాకొక కమ్యూనిటీ డెవలప్‌మెంటు ఆఫీసరు, మరొక సహాయాధికారి ఉంటారు. వీరిలో ఒకరు మగ అయితే మరొకరు ఆడవారు. 5 జిల్లాలలో స్త్రీలే ప్రస్తుతం జిల్లా అధికార్లుగా ఉన్నారు.

వీరంతా చరిత్ర, లా, సైన్సు మొదలైన సబ్జక్టులలో పట్టభద్రులై ఉంటారు. ఇప్పటి కప్పుడే 60 మంది సహాయాధికారులు ఉన్నారు. 200 మందికి పైగా అసరరీ వర్కర్లు ఉన్నారు.

ఇక వీరు చేసే పని కూడా ఆఫీసుల్లో కూచోని చేసేది కాదు. జనాభాలో ఎక్కువ మంది గ్రామా లలో కాకుండా బనానా తోటల్లో నివసిస్తారు. వారు తోటల్లో పని చేస్తూ ఉంటేనూ, వెళ్ళి తరబడి నడుస్తూ ఉంటేనూ, వారితో కలిసి మెలసి తిరుగుతూ నచ్చ జెప్పాలి. వారిని సమావేశ పరచా లన్నా సులభమే! వేదికలూ అక్కర్లేదు. ఉపన్యాసాలు అక్కర్లేదు. వారు పని చేస్తూ ఉన్నప్పుడే వారికి మహిళాభ్యుదయాన్ని గురించి చెప్పాలి. మహిళా సంఘాలు, వాటి ఆవశ్యకతను గురించి కూడా మామూలు మాటల్లో చెబితేనే వారు అర్థం చేసుకోగలరు. ఇప్పుడిప్పుడే స్త్రీలు అక్షరాస్యులు అవుతున్న దేశంలో, అప్పుడే 1500 క్లబ్బులున్నా యనీ, వాటి సభ్యత్వం 30,000 దాకా ఉన్నదనీ అంటే ఆశ్చర్యంగా లేదూ ! ఈ క్లబ్బులు స్వతంత్రంగా వాటి కార్యకలాపాలను అవే నిర్వహించు కుంటాయి. ఎన్నికలలో గెలుపొందిన సభ్యులు గల ''కమిటీ''లు ఉంటాయి. ఈ కమిటీ సభ్యులు ''కమ్యూనిటీ డెవలప్‌మెంటు'' ఆఫీసర్లతో అవసర మైనప్పుడు సలహా సంప్రదింపులు చేస్తూ ఉం టారు. వారాని కొకసారి ఈ సభ్యులతో కౌన్సిల్ హాల్సులోను, చర్చిలలోనూ, స్కూళ్ళలోను లేక చల్లగా ఉన్న చెట్ల కిందనూ సమావేశ మవుతూ ఉంటారు. ఈ సమావేశాలలో తరచు, ప్రభుత్వాధి కారులు వచ్చి విద్య, వ్యవసాయం, ఆరోగ్యం మొద లైన విషయాల మీద మాట్లాడుతూ ఉంటారు.

మహిళా సంక్షేమ కార్య కర్తలకు స్వల్పకాలిక శిక్షణ ఇవ్వబడుతుంది. గృహ నిర్వహణ, శిశు సంక్షేమం, పాకశాస్త్రం, దుస్తుల తయారీ వంటి విషయాలలో శిక్షణ ఉంటుంది. సాంప్రదాయ సిద్ధమైన కొన్ని కళలను, నవీన కాలానికి అను గుణ్యంగా మార్చి నేర్పుతారు. అప్పుడప్పుడు పోటీలు నిర్వహించ బడతాయి కూడా !

''గుడ్‌హోమ్'' అనేది వారి ఆదర్శం. ఆదర్శ ప్రాయమైన ఇల్లు ఎలా ఉండాలో బోధించిన తరువాత, అలాంటి ''గుడ్‌హోమ్స్'' కొన్ని [illegible]



క్రీడారంగం — అందులోనూ వ్యాయామ క్రీడలకు పశ్చిమ జర్మనీ పేరెన్నిక గన్నది. వివిధ క్రీడల్లో అత్యుత్తమ శిక్షణ నిచ్చే అంతర్జాతీయ కేంద్రంగా ప్రసిద్ధిచెందిన కొలోన్ వ్యాయామ కళాశాలలోని ఒక మహిళ ''హూప్''తో క్రొత్త తరహా వ్యాయామాన్ని అభ్యసిస్తుండటం చిత్రంలో చూడవచ్చును.

# ఉగాండా స్త్రీలు

తారు. "ఫారం" ఆదర్శ ప్రాయంగా ఉంచడం కూడా ఒక కళగా అభ్యసించ బడుతోంది. అందుచేత మంచి మంచి తోటలూ, విహారాలూ చూపిస్తారు. "నాస్మెజి" ట్రెయినింగ్ సెంటరు స్థాపించిన తరువాత, కార్యకర్తలకు, గ్రామీణ మహిళలకు మంచి శిక్షణ లభిస్తోంది. ప్రతి జిల్లాకూ, ఒక శిక్షణా శిబిరం నిర్వహించ బడుతున్నదనే చెప్పాలి. బోధన ఇంగ్లీషు భాషలోనే జరుగుతుంది. "మోడరన్ లివింగ్స్" (నవీన పద్ధతులలో జీవించటం) లోని మెళుకువలు, సాధక బాధకాలు కూడా నేర్చుకుంటారు. ప్రతి సంవత్సరంలోనూ మూడు మాసాల పాటు "నాయకత్వ ,నిర్వహణలోనూ, గృహానికి సంబంధించిన ఆర్థిక వ్యవహారాల లోనూ శిక్షణ గరప బడుతుంది. ఆ విధంగా తర్ఫీదు పొందిన వారిని లెక్కవేసి చూస్తే ఒక్క 1961వ సంవత్సరంలోనే 175 మంది దాకా ఉన్నారు. ఈ శిక్షితులు అప్పుడే జిల్లాలలో పర్యటించి తమ అనుభవాలను, అభిప్రాయాలను ప్రజలకు తెలియ జెబుతున్నారు. 3 మాసాల పాటు ఇల్లు, వాకిలి విడిచి శిక్షణ పొందట మంటే ఉగాండా స్త్రీల విషయంలో మాటలు కాదు. కాని ఏవో ఏర్పాట్లు ఇళ్లలో చేసుకొని, ఈ శిక్షణ పొందటం కోసం అవకాశం దొరికితే చాలు, ఉత్సాహంగా స్త్రీలు ముందుకు వస్తున్నారు. "అంకోల్" అనే జిల్లాలో 20 మందికని ట్రెయినింగ్ ప్రారంభిస్తే 33 మంది వచ్చి చేరారు. ఆ శిక్షణా కేంద్రాన్ని నిర్వహిస్తున్న అధికారి "చూడండి ! మహిళల వద్ద నుంచి ఎంత వత్తిడి వచ్చిందంటే వారి దరఖాస్తులన్నీ పరిశీలించి శిక్షితుల సంఖ్యను 20 నించి 33కు పెంచాల్సి వచ్చింది" అన్నారట.

మదర్స్ యూనియన్, కాథలిక్ యాక్షన్, శాల్వేషన్ ఆర్మీ, వై. డబ్ల్యు. సి. ఎ, మొదలైన స్వచ్ఛంద సంస్థలు పూర్తి సహకారాన్ని అందజేసి ప్రభుత్వంద్వారా 'యునిసెఫ్' యొక్క సహాయాన్ని పొంద గలిగారు. అందుకే ఉగాండా ప్రభుత్వం ఆ సంస్థ వారికి ఎంతో ఋణపడి ఉన్నామని చెబుతుంది. జిల్లాలలో పర్యటించే వారికి వాహనాలు లభించినందువల్ల మారుమూల ప్రాంతాలు కూడా పర్యటించడానికి వీలయింది.

1959వ సంవత్సరములో "హోం ఎకనామిక్సు సిలబస్" తయారయింది. ఇందులో, గ్రామం, ఇల్లు, తోట, దొడ్డి మొదలైనవి ఎలా చూసుకోవాలో చెప్పబడి ఉంది. కుటుంబ జీవితం ఎలా సుఖవంతం చేసుకోవచ్చు అనే విషయం మీద డాక్టర్ వినిఫ్రెడ్ వ్రాసినది కూడా పుస్తకములో ఉంది. ఇందులో కుటుంబములో ఉన్నవారి మధ్య ఎలాంటి సంబంధ బాంధవ్యాలు ఉండాలి

అనేది ముఖ్యంగా చెప్పటమే కాక స్కూలుకు వెళ్ళని పసిబిడ్డ దగ్గర నుంచీ వివాహితుల దాకా వివరించ బడి ఉంది. అంతే కాదు ! పిల్లలకు పుట్టుకను గురించి ఎప్పుడు ఎలా చెప్పాలి అనేది కూడా వర్ణించ బడి ఉన్నది. మరికొన్ని భాగాలు కుటుంబ ఆరోగ్యాన్ని ఎలా కాపాడాలి, ఆహార విహారాలు ఎలా ఉండాలి, చాకలిపని, 'నీడిల్ వర్కు' ఎలా చేయాలి అనే విషయాలను గురించి కూడా చెబుతున్నాయి !

రెడ్‌క్రాస్, మెడికల్ డిపార్టుమెంటు వారి సహాయంతో శిశుపోషణలోని మూలసూత్రాలను గూర్చి శిక్షణ ఇస్తున్నారు. ఇలా శిక్షణ పొందిన వారు ఈ నాడు వందలూ, వేలూ ! సర్టిఫికేట్లు సంపాదించి గర్వంగా బాడ్జీలు ధరించి గర్విస్తున్నారు.

క్లబ్బులు చిన్న చిన్న సంఘాలను ఏర్పాటు చేస్తున్నాయి. జిల్లాకొక సంఘాన్ని స్థాపించిన తర్వాత ఉగాండా దేశాని కంతకీ కలిపి ఒక సంఘాన్ని ఏర్పరుస్తున్నారు. "మెంగో" అనే జిల్లాలో ఇలాంటి సంఘాలే ఎక్కువ చొరవ తీసుకుంటున్నాయి. కమ్యూనిటీ డెవలెప్‌మెంటు ఆఫీసర్లు కూడా సాక్షిలాగా కాకుండా ఈ సంఘాలకు సలహాలనిస్తూ, బాధ్యతనంతా ఈ సంఘాల "లీడర్ల"కే వదిలేస్తున్నారు.

కమ్యూనిటీ డెవలప్‌మెంటు ప్రోగ్రాము ప్రారంభమైన తరువాత స్త్రీలంతా సాంఘిక జీవనములోని సంపూర్ణతను అర్థం చేసుకుంటున్నారు. ముఖ్యంగా స్త్రీ పురుషుల మధ్య సహకారం ఎంతగా అవసరమో గుర్తించ బడింది. మగవాళ్ళ "ఇల్లును" నిర్మిస్తే, ఆడవాళ్ళు దానిని "స్వర్గధామం" చేయ జూస్తున్నారు ! !

అన్ని కార్యక్రమాలకూ అంతరంగికమైన మూలసూత్రం ఒకటే ! ఆడవాళ్ల క్లబ్బులు "మంచి ఇళ్లను" తయారు చేయడానికే ! "మంచి భార్యలుగా," "మంచి తల్లులుగా", "మంచి పౌరులు"గా తయారు కావటమే ప్రస్తుతం ఉగాండా స్త్రీల లక్ష్యం.

పంచశీలలాగా, ఉగాండా స్త్రీలకు అయిదు ఆదర్శాలు ఉన్నవి :

1. ఇల్లులనేది చిన్న ప్రపంచం. అలాంటి ఇల్లు, దానిలోని ముఖ్యమైన సౌఖ్యాన్ని, సెక్యూరిటీని కలిగి ఉండేలా చూడటం.

2. మంచి గృహిణిగా తయారు కావటం.

3. క్లబ్బులలో నేర్పే విషయాలను క్షుణ్ణంగా అవగాహన చేసుకొని మంచిగా గ్రహించటం.

4. స్వంత చేతులలో అన్ని పనులూ చేయగలగటం. క్లబ్బులో నేర్పిన విషయాలను ఆచరణలో పెట్టటం.

5. మంచి కుటుంబానికి మంచి "అధినేత"గా ఉండి, ఉగాండా దేశానికి "మంచి పౌరులుగా" తయారు కావటం. 

# వనితా వాణి

## విదుషీమణులు

శ్యామసుందరిగారి "అమెరికాలో విదుషీమణులు" వ్యాసం పత్రికకు నిజంగా వన్నె తెచ్చింది. ఈ లాంటి వ్యాసాలు ఎప్పుడూ పత్రికలో వేస్తూండవలెనని కోరుతున్నాను. 'సశేషం' అని చూడగానే తరువాయిది గూడ ఇప్పుడే చదివేయాలని ఉంది. వచ్చేవారం పత్రిక ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూశానంటే నమ్మండి.

వి. సరళాదేవి (న్యూఢిల్లీ)

## శ్రీవారితో సినిమాకి

మీ ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ప్రచురింపబడిన "శ్రీవారితో సినిమాకి".....అను వ్యాసము చాలా బాగుంది. ఇటువంటి ఉదాత్తమైన (యదార్థమైన) వ్యాసము ప్రతి పత్రికలో ఒక్కటైన ప్రచురిస్తే చాలా బాగుంటుంది.

బి. సి. మునెయ్య (యామవరము)

## లిప్‌స్టిక్ పాశ్చాత్యుల సంపర్కమా

"లిప్‌స్టిక్ వగైరా కృత్రిమ పాశ్చాత్య సౌందర్య సాధనలు" అనే వ్యాసం చదివిన తర్వాత నా అభిప్రాయాలు వెల్లడించకుండా ఉండలేక పోతున్నాను.

మన భారత దేశంలో తాంబూల మనేది కామవర్ధకం అనీ, యువతీ యువకులలో ఆకర్షణ కలిగించేదీ అని ఆయుర్వేద అభిప్రాయం. అందుకనే దాన్ని బ్రహ్మచర్యం అవలంబిస్తున్నవారు వేసుకోకూడదనిన్నీ నిషేధం ఉంది. దానివల్ల జిహ్వకూ, అధరాలకూ మాత్రమే కాకుండా— దంతాలకు కూడా కొద్దిగా ఎరుపురంగు వస్తుంది. ఆరోగ్యరీత్యా మంచిదే అయినా— సర్వకాలాలు తాంబూలం నమలడానికి వీలుండదు. అటువంటప్పుడు తాంబూలం వల్ల ఉండే ఎరుపుదనం తాత్కాలికమే అవుతుంది.

ఇదే కాకుండా పూర్వీకులకు ఎల్లప్పుడూ వాడటానికి వీలుగా లత్తుక అని ద్రవం ఉండేది. ఈ లత్తుకని ఎల్లకాలమూ కొంత మంది వాడేవారు.

రచయిత్రి చెప్పినట్లు చలికాలములో పెదవులు పగులుట వలన ఆయింట్‌మెంటు పూస్తారనీ— క్రమేపీ దానికి రంగుకలపడం వల్ల లిప్‌స్టిక్ అయింది అన్న మాట పాశ్చాత్యులకి అన్వయిస్తుందేమో కాని మనకు కాదు. ఇప్పుడిప్పుడు పాశ్చాత్యులు కనుగొంటున్నవీ, ఇంతవరకూ కనుగొన్నవీ కూడా మన పూర్వులు ఎంతో కాలం ముందరే కనుగొన్నారు. పెరటి చెట్టు మందుకు కొరగాదన్నట్లు మన గొప్పతనాన్ని, సంస్కృతిని మనం మాత్రమే గుర్తించలేము.

చలికాలంలో పెదవులు పగలకుండుటకై కుంకుమగానీ మైనముగాని వ్రాసేవారని కుమార సంభవంలో ఉన్నది.

"హిమ వ్యపాయాద్విశదాధ రాణాం
మాపాణ్డరీ భూతముఖచ్ఛవీనాం....."

దీనికి మల్లినాథసూరి తన వ్యాఖ్యానంలో "కిన్నర స్త్రీలు చలివల్ల పెదవులు పగలకుండుటకు కుంకుమగానీ మైనము గానీ బూయుదురు. వసంత కాలమున చలిలేకుండుటచే వారి పెదవులు ఏ విధమైన ముఖరాగమూ లేక శుభ్రమైన పాండుర వర్ణముతో ప్రకాశించుచుండెననియు."

ఈ సాధనములు తాత్కాలికము

"రాగేణ బాలారుణ కోమలేన
చూత ప్రవాళోష్ఠ మలంచకార"

"వసంతలక్ష్మి బాలారుణకాంతితో సమానమైన లత్తుకచే మావిచిగురను క్రింది పెదవిని అలంకరించెను" ఇదీ మల్లినాథుని వ్యాఖ్యానమే.

"విస్పష్ట రాగాదధరాన్ని వర్తిత
స్తనాంగ రాగారుణి తేచ్చకందుకాత్...."

పార్వతీదేవి అంగుళులు పెదవులకు లత్తుక పూయుట చేతనూ, స్తనములకు మైపూతగా వాడు అంగరాగము చేత ఎర్రనైన బంతిని ధరించుట చేతను అరుణ వర్ణమును దాల్చుచుండెడివట ! ఆ రెంటిని తపశ్చర్య వల్ల మానినదట !

పై రెండు ఉదాహరణములచేతను పెదవులకు వ్రాయు లత్తుక ఎరుపురంగుదే అని రూఢి అగును కదా !

"....చిరోజ్ఝితా లక్తక పాటలేనతే
తులాం యదా రోహతి దన్తవాససా."

కోట వటువు పార్వతీదేవితో కుశల ప్రశ్నలలో ఇలా అంటాడు "నీచే పోషింప బడిన లత— చిరకాలము నుండి లత్తుక పూయక పోవుటచే పాటల వర్ణము (తెలుపుతో గూడిన ఎరుపు) గలిగిన నీ అధరము వంటి చిగురును వేసినదా ?"

పార్వతీదేవిని దొండపళ్ల వంటి యధరములని అన్న కవి పై మాటతో దానినే కొట్టి వేసినాడు.

అయినా కూడా ఇది కాళిదాసు వ్రాసినది కనుక కవులు వ్రాయువానిలో కొద్దిగా నైనను సాంఘికముగా సమకాలికములైన అలవాట్లు, ఆచారములు ప్రతిబింబించుట సహజము. దీనివలన మనకు కాళిదాసు కాలములో స్త్రీలు లత్తుక పెదవులకు పూయువారని ధృవపడుతోంది కదా !

నేను చదివినది కుమార సంభవము ఒకటే కనుక— నిరూపణార్థము దాని నుండే శ్లోకములను ఉదహరించాను. ఆ కాలములో ఉన్న లత్తుక క్రమేపీ అదృశ్యమయి ఇప్పుడు పాశ్చాత్యులు వాడటాన్ని చూసి లిప్‌స్టిక్ అనేది పాశ్చాత్య సంపర్కం వల్లనే మనకువచ్చింది అని అనుకోవటం శోచనీయం.

లిప్‌స్టిక్ వేసుకోవడం అమర్యాద అని భావించడం గూడా తప్పు. పూర్వకాలం వాళ్ళు దానిని అందం తగ్గిపోతుందనే వాడారా ? ఈ కాలపు పాశ్చాత్యులూ అలానే అనుకొంటున్నారా ? ఏదైనా అలవాటైతే అదే అందంగా మారిపోతుంది.

(నేను మాత్రం ఎప్పుడూ వాడను లిప్‌స్టిక్ ! ఈ ఉత్తరం చూసి అనుకొనేరు !)

విజయ ప్రియ (హైదరాబాదు)★

గౌరి బామ్మగారు ఓర్పుతో బాలసేవ బస్సులో నిలబడింది. అందరూ దిగాక, తన కాకీరంగు సంచీయొక్క భారాన్ని నడుము దగ్గరగా ఎత్తుకుని ఆఖర్నవచ్చింది.

"అవ్వా.........అవ్వా! సంచీని తీసుకుని రావా? రిక్షా అణా ఇయ్యి అవ్వా".

"బండి కావాలా అమ్మా?"

"పురుషోత్తమ్ ప్లీడరు గుమస్తాగారింటికేనా... రండి పోదాం"— అని అనేక స్వాగత కంఠాలతో ఆమెని దిగనీయకుండా అడ్డుపడి నిలిచిన బండి వాళ్లనీ, కూలీ కుర్రవాళ్లనీ చూసి ఆదరంగా నవ్వి అవ్వగారు చెప్పింది.

"నాకేమీ వద్దయ్యా.......కొంచెం దారి వదలితే నేను మెల్లగా నడిచే వెళ్లిపోతాను....ఏమయ్యా ఇలా ఇంటినికూడా తెలిసిపెట్టుకున్నావే. నేను నెలకు ఒక్కసారి వస్తున్నానే, ఏనాడేనా బండిలో వెళ్లానా.?" అని ఒక్కొక్కరికీ ఒక్కో జవాబు చెప్పి, వారిని తప్పించుకుని దారిచేసుకుని, నిప్పుల్లాగా దహించే ఎండలో మునుగు లాక్కుని నడుమున ఎత్తుకున్న భారంతో కాలుతున్న మట్టిని అదిమి అదిమి త్రొక్కుతూ ఒక ప్రక్కగా ఒరిగి నడచింది బామ్మగారు.

బామ్మగార్కి వయస్సు డెబ్బయి అయినా శరీరం దృఢంగానే ఉంది. వయస్సువల్ల ఏర్పడిన స్థూలమూ, అందువల్ల కలిగే అలసటా ఇంటికి వెళ్లాకే కదా తెలుస్తుంది?.......

ఆమె కళ్ల ఎదుటే నిన్న పుట్టిన పిల్లలంతా, అదుగో రిక్షాలలోనూ, జట్కాలలోనూ సైకిళ్ల మీదా ఎగిరి ఎగిరి పరుగులెత్తుతున్నారు.

వర్షమూ, ఎండా మనుష్యుల్ని ఆరిమే తీరుని తలచుకుని బామ్మగారు నవ్వుకుంది.

ఆవిడకిదంతా ఒక లెక్కా? వరదలాగా పొంగి వచ్చిన జీవితపు సుడి గుండాలలోనూ, ఆటు పిమ్మట హఠాత్తుగా ఎండిన ఎడారిగా మారిపోయిన జీవితపు అగ్నిలోనూ ఓర్పుతో నడిచి అలవాటయిన ఆవిడని, ఈ ఎండా వానా ఏమిచేయగల్గుతాయి? ఏమిచేస్తే మాత్రం ఏం?

కాలుతున్న మట్టిని పాదాలు అదిమి అదిమి త్రొక్కగా, ఆడుతూ ఆడుతూ నడుస్తూంది బామ్మగారు.

దారిలో బాట ప్రక్కగా నలుగురైదుగురు మనుష్యులు నిలుచుని సుఖాన్ని చవి చూడ్డానికని మొలిచిన పెద్ద ఛత్రంలాగా నీడని పరుస్తూందొక చిన్న వేపచెట్టు.

ఆ నీడలో ఒంటరిగా కాస్త నిలుచుంది బామ్మగారు. కార్చి దహించే ఆ ఎండ నడుమ, సుఖాన్నివ్వడానికని పడిన ఆ నీడలాగా, యంత్రాలనే తప్పించి, వేరే దేన్నీ నమ్మని ఈ ఇరవైయవ శతాబ్దంలో— గత శతాబ్దపు చిహ్నంగా తన స్వంత కాళ్లనే నమ్మి నిలుచున్న— చూడ్డానికి అపురూపమైన ఆ ముసలావిడ ప్రసన్నతలాగా మెల్లగా వీచిన చల్లగాలిలో వేప రెమ్మలు కదిలాయి. "శంభో! మహాదేవా!" అని భగవంతునికి కృతజ్ఞత తెలుపుకుని ఆ శీతలాన్ని అనుభవించింది బామ్మగారు.

బామ్మగారి మునుగున్న గుండ్రటి ముఖంలో ఒక పసిదాని కళ నిండివుంది. ఈ వయస్సులోకూడా ఆమె నవ్వేటప్పుడు పలు వరుసలు అందంగా అమరి ఉండటం ఒక వింతే! ఆవిడ గడ్డంపై కుడి ప్రక్కగా ఒక మిరియం గింజంతకంటే కొంచెం పెద్దదిగా ఉన్న అందమైన నల్లటి మచ్చ. దాని మీద మాత్రం నల్ల నల్లని రెండు వెంట్రుకలు— ఇవన్నింటినీ ఒక్కసారి చేర్చి చూసేవారు ఈవిడ యవ్వనప్రాయంలో ఎలాగ ఉండి ఉంటుందో అని అనుకోకుండా ఉండలేరు.

బామ్మగారి బంగారపుచ్ఛాయ మేనిపై అధికంగా వర్ణభేదం కనపడకుండా నారపట్టు పంచ గాలిలో రెపరెపలాడింది. చీరతో పెట్టుగున్న మునుగు తొలగినప్పుడల్లా ముళ్ల ముళ్లలాగా లేశంగా కనపడుతోంది— రోజులయినందువలన పెరిగిన— నెరిసిన జుట్టు. మెడలో స్ఫటికమాల, నుదుట చెమటతో చెదరిన విభూతి రేఖలు. చీర కొంగుతో ముఖాన్ని, చేతులని వక్షస్థలంపు చీర మడతలని రాసుకుని తుడుచుకుంది. అప్పుడు కుడి రొమ్ముమీద ఉన్న చిన్న పగడంలాంటి ఎర్రటి మచ్చ బయటికి కన్పించింది.

—తిరిగి నీడలోనుండి ఎండలోకి వచ్చి మట్టి నుంచి బాగా కాలిన 'కెడిల' నది ఆనకట్ట కాంక్రీటు నేలమీద పాదాలని శాంతంగా మోపి, ఆడుతూ, ఆడుతూ ఆమె వచ్చేటప్పుడు—

ఆనకట్టమీద గట్టు వారగా, బామ్మగారిమీద పడకూడదన్న భయానుభూతితో తప్పుకుని నిలుచుని, చేతిలోనున్న చిన్నరేకు పెట్టెతో దండం పెట్టాడు. ఒక బాగా ఎరిగున్న— మంగలి.

"బామ్మగారూ ........ఎక్కడ్నుంచి, నైవేలి నుంచా?" అని ఆదరంగా అడిగాడు.

"ఎవరూ వేలాయుధమా?........అవును! నీ పెళ్లాం నీళ్లాడిందా?" అని ఆత్మర్థంగా అడిగింది ముసలావిడ.

"ఆడిందండీ...........మొగపిల్లవాడే"

"బాగా ఉండనీ.........భగవంతుని లీల.......! ఇది మూడో పిల్లవాడా?"

"అవునండి" అని తృప్తిగా నవ్వాడు వేలాయుధం.

"నువ్వు అదృష్టవంతుడవే........ఎలాంటి కష్టమైనాపడి చదివించు. విన్నావా?" అనగానే వేలాయుధం జారు ముడిని గోక్కుంటూ నవ్వాడు.

"ఓరి పిచ్చాడా, ఏమిటి నవ్వుతున్నావు? కాలం చాలా మారిపోతోందిరా, నీ తండ్రి కాలం నీ కాలం ఇలాగ పెట్టెలు మోసే వెళ్లిపోయింది.......ఇక మీదట ఇలాగ జరగదు.......పురుషులంతా షాపులకి వెళ్లడంన్నారు........ఆడవారికంతా వాతాగా ఇంకనిమీదట లేదని ఇప్పుడే తెలిసిపోయిందే...... పూ......అంతాసరే కాలం మారేటప్పుడు మనుష్యులూ మారాలి.........ఏం, నేను చెప్పేది?" అనిచెప్పి ఏదో రహస్యంగా మాట్లాడినట్లు బామ్మగారు నవ్వింది. జవాబుగా వాడూ నవ్వాడు.

"ఇదుగో. ఎండకి రెండు కొరుకుతూ వెళ్లు" అని చంకవున్న చిన్న సంచీలో బయటికి కన్పడుతూ నిలిచిన రెండు నక్కదోస పిందెలని తీసి వాడు చాపిన దోసిలిలో వేసింది.

"బస్సులో వస్తుంటే అణాకి నాలుగని అమ్మాడు .........పిల్లలకి ఉంటాయికదా అని ఒక నాలుగు అణాలకి కొన్నాను" అని ఆవిడ చెప్పగానే వేలాయుధం ఒక దండంపెట్టి— తనని ఆవిడ దాటేదాకా తవరకు నిలబడి, తర్వాత తన దారిన తాను వెళ్లాడు.

చిదంబరంలో పుట్టి పెరిగిన గౌరమ్మగారు తన పదో వయస్సులో ఈ కడలూరులో మంచి స్థితిలో ఉన్న ఒక కుటుంబంలో కాపరంచేసింది. పదహారో ఏట తన చేతిలో ఒక పిల్లాడితో విధవ రూపు వచ్చాక కూడా, ఇంతకాలం తన కొడుకుని తన అత్త వాటాకి వచ్చిన ఇంటిని వదిలి ఏ వూరూ వెళ్లలేదు.

కానీ తన కొడుకు కడుపున పుట్టిన పెద్ద కూతురు గీత పెళ్లి కూతురయిన పది నెలలకే ధరించిన సుమంగళి వేషాన్ని నాటకపు రంగులని తుడుచుకున్నట్లు తుడిచేసుకుని కుటుంబాన్ని ముంచే పెద్ద శోకంగా అయి రోదిస్తూ తన ఒడిలో పడి విలపించిన రోజు మొదలు తన జీవితంలో చవి చూచే కడసారి దుఃఖంగా ఆమెని దగ్గరికి తీసింది గౌరి బామ్మగారు. తన కౌగిలింతలో, తన ఆదరంలో తన కన్నీటితో, తన స్పర్శతో ఆమెని దగ్గరగా 'తీసుకోవడమే' తన బాధ్యతగా స్వీకరించింది. అంతవరకూ గీతమీద, కొడుకుకన్న అమ్మాయన్న పాశం మాత్రమే కలిగిన బామ్మగారు— భర్తని కోల్పోయిన రోజు మొదలు తన ప్రాణాల్నే కొడుకుమీద పెట్టుకున్న ఆ తల్లి— దాన్ని మార్చుకుని గీతకి ఓదార్పునిచ్చే బాధ్యత వహించింది.

గౌరి బామ్మగారు తన గడచిన కాలపు వర్తమాన ప్రతినిధిగా తననే అమెలో చూసుకోసాగింది.

బామ్మగారి కొడుకు గణేశయ్యరు తండ్రి మరణాన్ని— అందువల్ల కల్గిన అత్యంత శోకాన్ని గ్రహించినవారు. ఆయన భార్య పార్వతి అప్పుడప్పుడు రహస్యంగా ఖండించేదానికి తగ్గట్టే ఆయన ఒక తల్లిచాటు పిల్లవాడే.

విధవ అయిన గీతని గూర్చి అనేక విధాలుగా ఏడ్చి ఏడ్చి తర్వాత ఒకరోజు హైస్కూలు చదువుతో ఆపేసిన ఆమెని, ఉపాధ్యాయ శిక్షణకి పంపనుద్దేశించి, సందేహించి సందేహించి తన తల్లి అభిప్రాయం అడిగినప్పుడు, ఆయన నిర్ణయాన్ని అతిగా ప్రశంసించి, ఆవిడ అంగీకరించగానే, గౌరి బామ్మగార్ని కొలవడానికి అంచనవేయడానికి ఆయన వలన సాధ్యంకాలేదు.

బామ్మగారు, మారిన కాలంలో పుట్టిన గీత అదృష్టాన్ని తలచుకుని మనస్సులో ఉప్పొంగింది...

శిక్షణ ముగిసి చాలాకాలం స్వంత వూరులోనే పనిచేస్తున్న గీతకి పోయిన సంవత్సరం— క్రొత్తగ జనించి త్వరగా పెరిగిపోతున్న పరిశ్రమల నగరమైన నైవేలికి ఉద్యోగ బదిలీ వచ్చినప్పుడు గణేశయ్యర్ విచారించారు.

"దాని కేమిటి? నేను వెళ్తాను తోడుగా.... అని, ఈ అవసాన కాలంలో కొడుకుని కుటుంబాన్ని వదిలి వంటరిగా ఆమె స్వయంగా ముందుకు వచ్చిన కారణం, ఎక్కడ ముప్ఫయి సంవత్సరాలేనా దాటని తన గీత వైధవ్యపు చీకటి గదులలో బంధించబడిపోతుందేమోనన్న భయమే.

ఈ ఒక్క సంవత్సర కాలంలో, పెద్ద సెలవులకి ఇద్దరూ వచ్చివుండి వెళ్లటమేకాక, శని, ఆదివారాలలో తలుచుకున్నప్పుడు వచ్చేస్తుంది బామ్మ

# యుగసంధి

గారు. అందుకు ముఖ్యమైన కారణాలలో ఒకటి ఆమెకి అలవాటయిన మంగలివాడు వేలాయుధమూ అంతకు ముందర వాడి తండ్రులు తప్ప వేరే ఎవరి దగ్గరా బామ్మగారికి కేశాలని తీసుకునే అలవాటు లేనందువలననే.

ఇప్పుడు దారిలో ఎదురయిన వేలాయుధం, మర్నాడు ప్రొద్దున్న తన ఇంటిముందర వచ్చి ఉంటాడని బామ్మగారికి తెలుసు. కావాల్సి ఉంటుందనికూడా వాడికి తెలుసు. అది అలవాటు.

ఒక మైలుకంటే తక్కువైన ఆ దారిని అర్ధ గంటసేపు నడిచి ఆమె ఇంటిదగ్గరగా వచ్చినప్పుడు గణేశయ్యరు ముఖానికి దినపత్రికని అడ్డు పెట్టుకుని ఈజీ చైరులో సాగిలబడి నిద్ర పోతున్నారు. ప్రక్కన తెరచి ఉంచిన తగరపు డబ్బా, చేటలో పోసుకున్న మినప్పప్పుతో, ముక్కుమీది నున్న కళ్లజోడుని దించి రాళ్లు ఏరుతూంది కోడలు పార్వతమ్మ. పూచల దడి పెట్టి మూసిన ముందర ప్రక్క, కటకటాలలో ఒక మూలగా ఎండకి చాటుగా ప్రేలాడుతున్న తడక వారగా లక్క పిడతలు చెదరి ఉండగా, నోట్లో ఏదో అర్థం లేని సంభాషణలు తాను మాత్రం రాగంతో గొణుగుతూ సంసారపు ఆట నడుపుతోంది. ఆఖరి

మనుమరాలైన ఆరేళ్ల జానా.

—బామ్మగారు వచ్చి నిలుచోవటం ఎవరూ గమనించనందువలన— ఇనుప తలుపు గడియగని జరిపి లేశంగా శబ్దం చేయవలసి వచ్చింది. ఆ చిన్న శబ్దానికి అటుల స్వాగరస్వారస్యంతో తిరిగి చూసిన జానా, ప్రేమతో నిండిన ఆత్రుతతో "బామ్మా" అన్న పిలుపుతో కళ్లని పెద్దవిగా తెరచి ముఖాన్ని విప్పారచేసింది.

"తలుపుని తెరవవే" అని బామ్మ చెప్పేది చెవులో పడటానికి ముందరే, "అమ్మా అమ్మా... బామ్మ వచ్చేసిందమ్మా, బామ్మ వచ్చేసింది !......" అని అరుస్తూ లోపలికి పరిగెత్తింది జానా.

తలుపు తెరవకుండా తన రాకని తెలుపుతూ లోపలికి పరిగెత్తిన పిల్లనిచూసి బామ్మగారు నవ్వింది.

గణేశయ్యరు, ముఖంమీద పడివున్నపత్రి కని లాగి కళ్ల తెరచి చూసారు. పిల్ల ఉత్సాహపు కేకలు వలన హఠాత్తుగా లేచి ఎర్రబడిన కళ్లతో బెదరి బెదరి తదేకంగా ఒక్క నిముషం ఏమీ అర్థమవకుండా ప్రగుడ్లప్పగించారాయన. అంత లోగా "ఏమిటే శవీ. ఇలా అరుస్తూ పరిగెత్తుతున్నవు !" అని పిల్లని తిట్టేసి, "రాండి, ఎండలో నడిచి వచ్చారు......ఒక బండి చేసుకోకూడదా" అని అంగలార్చుతూ మర్యాదతో లేచి వచ్చి తలుపు తెరిచింది పార్వతి.

"ఇక్కడుండే చోటుకి బండీ వాహనమూ కావాల్సి వచ్చింది. వాడో పదణాలు ఇయ్యి, పదిమిదణాలు ఇయ్యి అంటాడు........." అని విసుక్కుంటూ మెట్లెక్కి లోపలికి వచ్చిన తల్లిని చూడగానే "మంచి ఎండలో వచ్చావమ్మా......పార్వతీ ! అమ్మకి మజ్జిగ తీసుకొచ్చి ఇయ్యి" అని ఉప చరిస్తూ ఈజీచైరులో నుంచి లేచారు గణేశయ్యరు.

"పాపం. గాఢ నిద్రపోతున్నావు. ఇంకా కొంచెం పడుకో" అని అల్లన్ని చేత్తో కూర్చోబెడుతూ, ఈజీచైరు ప్రక్కనే ఉన్న స్టూలుమీద సంచీని పెట్టి మండువాలో దిగి, తొట్టెలోని మంచినీటిని తీసుకుని కాళ్లూ ముఖమూ కడుగుకుని, తలమీద కూడా ఒక చేతితో తీసుకుని చల్లుకుంది బామ్మగారు. తర్వాత కొంగుతో ముఖాన్ని తుడుచుకుని సావిట్లోని ప్యాండులోంచి విభూతిపండు తీసుకుని "శంభో ! మహాదేవా" అని పుర్యా విభూతి పెట్టుకుని వచ్చేవరకూ గణేశయ్యరు ఈజీచైరు దగ్గరే నిలబడి ఉన్నారు.

ఆ ఈజీ చైరు బామ్మగారికి సూత్రమే హెచ్చన్న సింహాసనం. ఆవిడ ఇంటిలో లేనప్పుడు మాత్రమే ఎవరైనా దాంట్లో కూర్చోవడం అల వాటు. ఆవిడ ఈజీచైరులో కూర్చున్నాక ప్రక్కనే ఉన్న ఒక కుర్చీ లాక్కుని కూర్చుని విసరసాగారు గణేశయ్యరు. అందుకోసమే కాచుకున్న దానిలా బామ్మ కూర్చోగానే ఆవిడ వడిలోకి వచ్చి ఎక్కింది జానా.

"బామ్మ ఎండలో వచ్చింది. కొంచెం తప్పుకో... వచ్చి రాగానే మైకి ఎక్కి........" అని విసురుతున్న విసరకర్రతో జానాని తట్టారు గణేశయ్యరు.

"ఉండనీయరా......పసిపిల్ల ! నువ్వు కూర్చో" అని పిల్లని ఒడిలోకి లాక్కుని పట్టుకుంది బామ్మగారు.

"ఇప్పుడేం చేస్తావోయ్" అని నాలుక కరిచి చూపి తండ్రిని వెక్కిరించింది జానా.

జానాని ఒళ్లో పెట్టుకునే ప్రక్కన స్టూలు మీద పెట్టిన సంచీని తీసి అందులోనున్న నక్క దోసకాయల విందెలని తీసి వరుసగా పెట్టి జానా చేతిలో ఒక్కటి ఇచ్చింది. పినులు త్రిప్పి పెట్టిన మారు చీరని దండెంమీద వేయడానికి ప్రక్కనే కొంచెం త్రోసిపెట్టింది. తర్వాత సంచీని తల క్రిందులుగా పట్టుకుని అందులోనున్న మూడు పడుల వేరు శనగ కాయలనీ పోసినప్పుడు దానితో బాటే ఒక కవరు పడింది.

"సరే, మీనా, అంబి ఎక్కడ? కనపడ్డంలేదే" అని చుట్టుప్రక్కల చూస్తూ "ఇది నీ దగ్గర ఇవ్వమని చెప్పింది గీత" అని కవరుని చాపింది బామ్మగారు.

ఇరవై ఏళ్లు నిండిన కూతురుని అంబి తోడుగా మాట్నీ షో చూడ్డానికి ఎంత దగ్గరలోనున్నా ఎలాగ సినిమాకి పంపుతానని తల్లి కోప్పడుతుందో ఏమిటో అన్న భయంతో కవరుని తీసుకుంటూ "ఏదో అది చదివిన నవలట. సినిమాగా వచ్చిందని ప్రొద్దున్ననుంచి ప్రాణాలు తీసేశారు. ఇద్దరు తనుబాను. మాట్నీషోనేగదా......పోనియ్యి అని పంపాను" అన్నారు గణేశయ్యరు.

"ఓ ! సీరియల్ కథగా వచ్చిందే....ఆ కథేనా అది.?..........పేరుని చూసాను......" అని ఒక పత్రిక పేరు, ఒక రచయిత పేరు మొదలైన వన్నీ వివరంగా అడిగింది బామ్మగారు. "ఇందు కోసమని పోయి పోయి పిల్లని ఎందుకు శని అని తిట్టుతున్నావు?..........నీకూ నాకూ సినిమా అంటే ఏమిటో తెలియదు. ఈ కాలపు పిల్లల. సినిమా తప్పించి వేరే ఏమీ తెలీదు. మన పిల్లల ఎంతో నయం అనుకో........" అని కొడుక్కి బుద్ధి చెప్పేసి, "కవరులోది ఏమిటో చెప్పు— దాన్ని అడిగినప్పుడు, 'నాన్నే చెప్తుతారు' అని బూటకంగా ఇచ్చి పంపేసింది" అని గొణిగింది బామ్మగారు.

కవరుని విప్పి, కళ్లజోడు తీసుకు తగిలించకుని అందులోనున్న ఒకే ఒక కాగితంలో క్లుప్తంగా వ్రాసిన విషయాన్ని చదువనారంభించినప్పుడు గణేశయ్యరు చేతులు వణికాయి, ముఖమంతా గుప్పుమని చెమర్చి పెదిమలు వణికేయి. చదివి ముగించగానే తలయెత్తి ఎదురుగోడమీద వ్రేలాడిన గీత పెళ్లినాటి ఫోటోనే తీక్ష్ణంగా చూశారు..........

తల్లి దగ్గరగా కూర్చుని సుందరమైన స్థితిలో సంతోషంగానున్న గణేశయ్యరు ముఖము హఠాత్తుగా చల్లబడింది ! కుర్చీ చేతిని గట్టిగా పట్టుకుని తల్లి ముఖాన్నే తదేకంగా చూడసాగారు. అతని చేతిలోని ఉత్తరం క్రింద జారి పడడంకూడా గమనించలేదు.

"ఏమి విపరీతం !" అని హడలిన బామ్మగారు, నేలమీద పడిన ఆ ఉత్తరాన్ని వెలుతురులో పట్టుకుని చదువనారంభించింది. ఆవిడ కళ్లద్దాలు లేకుండానే చదవగలదు !

"నా ప్రియమైన నాన్న, అమ్మ, బామ్మ మొదలయినవారికి,

ఈ ఉత్తరం వ్రాయటానికి ఆరునెలలు దీర్ఘంగా ఆలోచించి తీర్మానమైన ఒక నిర్ణయానికి వచ్చాకనే సరియైన మనస్సుతో బే వ్రాస్తున్నాను. ఈ ఉత్తరం తర్వాత మీరు

39వ పేజీ చూడండి



## 2-10-1964 శుక్రవారము మొదలు 8-10-1964 గురువారము వరకు.

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
|  |  | గు | రా |
| శ | వారఫలం మహేష్ |  | కు |
|  |  |  | చం శు |
| కే |  |  | ర బు |

### మేషం :

(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ వారం అన్ని వ్యవహారాల్లోనూ ప్రోత్సాహం లభిస్తుంది. వృత్తి వ్యాపారాల్లో ధైర్యంగా ముందుకు వెళ్లవలసిన సమయం. వ్యాపారంలో మీ అభివృద్ధిని సహించలేని వ్యక్తులు మీకు కొన్ని చికాకులను కలిగించడానికి ప్రయత్నించేస్తారు. కాని మీకు ఏ విధంగాను నష్టం కలిగించలేరు. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు రావచ్చును. వృత్తిలో మీరు ఇదివరకు చేసిన ప్రయత్నాలకు ఫలితాన్ని ఈ వారం మీరు పొందగలరు. స్థిరాస్థి వ్యవహారాలు యధాతథంగా ఉంటాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది.

స్త్రీలకు— ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. సాటివారితో మాట పట్టింపులు రావచ్చును. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

4,5,6 తేదీలు మంచివికావు. మిగిలినవి మంచివి.

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగ 1, 2 పా.)

ఈ వారం గతవారంకంటే బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో క్రమాభివృద్ధిని సాధిస్తారు. స్వతంగా చేసే వ్యాపారాలకంటే భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. అధికారులవలన జరుగవలసిన పనులు యీవారం మధ్యలో నెరవేరడంవలన ఆదాయం పెరగడానికి అవకాశం ఉంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో మీకు వ్యతిరేకమైన మార్పులు ఏమీ జరగవు. వారం ప్రారంభంలో ప్రయాణ సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. రాజకీయ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరిగినా, మొత్తంమీద పరిస్థితి బాగానే ఉంటుంది.

7,8 తేదీలు మంచివికావు. మిగిలినవి మంచివి.

### మిధునం :

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు, 1, 2, 3 పా.)

ఈ వారం చిత్రంగా ఉంటుంది. మీ ఆలోచనలు ఇతరులకు సలహా రూపంలో బాగా ఉపకరిస్తాయిగాని మీకు మాత్రం వాటివల్ల ఏమీ ప్రయోజనం ఉండదు. వ్యాపారంలో మామూలుగా జరిగే వ్యవహారాలకుకూడా ఆటంకాలు రావడం వలన మీకు నిస్పృహ కలగవచ్చును. ముఖ్యమైన వ్యవహారాలు భాగస్వాముల నిర్ణయానికి విడిచిపెట్టడం మంచిది. ఉద్యోగరీత్యా మీరు ఇదివరకు జరిపిన వ్యవహారాల్లో ఇప్పుడు చికాకులు రావచ్చును. కోర్టు వ్యవహారాల్లో అభివృద్ధి ఉండదు. ఆరోగ్యం అంత బాగా ఉండదు.

స్త్రీలకు— అనారోగ్య సూచనలు ఉన్నాయి. శుభకార్యాల విషయంలో అభివృద్ధి ఉంటుంది. అధిక వ్యయంచేస్తారు.

7,8 తేదీలు మంచివి. మిగిలినవి సామాన్యం.

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

మీరు ప్రయత్నంచేసిన వ్యవహారాలకు ఆటంకాలు రావడం, కొన్ని వ్యవహారాలు మీ ప్రయత్నం లేకుండానే నెరవేరడంవంటి సంఘటనలు జరగవచ్చును. ఇంతవరకు ధనలోపం వలన నిలిచిపోయిన వ్యవహారాలను తిరిగి ప్రారంభించగల సూచనలు ఉన్నాయి. వృత్తిలోగల అనిశ్చిత పరిస్థితి తొలగిపోవడంవలన కొంత మనశ్శాంతి లభిస్తుంది. మీ స్వంత వ్యవహారాలలోకంటే ఇతరుల పనులమీద శ్రమపొందవలసి వస్తుంది. ఉద్యోగంలో మీ పరిస్థితి గత వారంలోకంటే బాగా ఉంటుంది. ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో అభివృద్ధి ఉంటుంది. సాంఘిక వ్యవహారాల్లో పలుకుబడి లభిస్తుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

2,3 తేదీలు మంచివి. మిగిలినవి సామాన్యం.

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

వృత్తి వ్యాపారాల్లో మీరు అనవసరమైన వ్యయప్రయాసలకు గురి కాగల సూచనలు ఉన్నాయి కాని, మీరు ప్రయత్నంచేసిన వ్యవహారాలన్నీ నెరవేరటంవలన ఈ వారం సంతృప్తికరంగానే ఉంటుంది. వ్యాపారంలో నూతనావకాశాలు కొన్ని ఇంద్రజాలంవలె కన్పిస్తాయి గాని ఫలితం పూర్తిగా చేతికి వచ్చేవరకూ నమ్మడానికి అవకాశంలేదు. వృత్తిలో మీ అభిప్రాయాలకు తగిన అవకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో అధికారుల ఆదరణ సాటివారిలో గౌరవ లభిస్తాయి. ఆరోగ్యం బాగా ఉన్నా శరీర శ్రమతో కూడిన కార్యక్రమాలు పనికిరావు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభమూలంగా ధన వ్యయం జరుగుతుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

7,8 తేదీలు సామాన్యం. మిగిలినవి మంచివి.

**సూచన**

నూతన వ్యవహారాలు ప్రారంభించడానికి, ముఖ్యమైన నిర్ణయాలు చేయడానికి మంచివి అని వ్రాసిన తేదీలు అనుకూలంగా ఉంటాయి. మంచివి కాని తేదీల్లో అనుకూలమైన సంఘటనలు జరగడానికి అవకాశం ఉంది. కాబట్టి జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం.

### కన్య :

(ఉత్తర 2, 3 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

ఈ వారంలో కొన్ని వ్యవహారాల్లో చికాకులు వచ్చేటట్లు కన్పిస్తాయి కాని సమయోచిత శక్తివలన రాబోయే చికాకులను తప్పించుకొనడమే కాకుండా వృత్తి వ్యాపారాల్లో తగిన అభివృద్ధి సాధించగలరు. భాగస్వాములతో ఏర్పడిన భేదాభిప్రాయాలు తొలగిపోతాయి. వ్యాపారంలో పెట్టుబడి చాలని లోపం అప్పుడప్పుడు కన్పిస్తుంది. వృత్తిలో ప్రయోజనకర పరిచయాలు ఏర్పడుతాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. ఉష్ణాధిక్యతవలన అనారోగ్యం చేయవచ్చును.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉన్నా బలహీనత చేస్తుంది. నూతన విషయాలు తెల్సుకుంటారు. బంధువులకు సహాయం చేస్తారు.

2,3,4 తేదీలు మంచివికావు. మిగిలినవి మంచివి.

### తుల :

(చిత 3,4 పాదాలు, స్వాతి, విశాఖ, 1,2,3 పా.)

వృత్తి వ్యాపారాల పైకి ప్రశాంతంగా కన్పించినప్పటికీ మీరు ఏ మాత్రం యేమరుపాటుగా ఉన్నా నష్టం తప్పదు. మీ స్వంత పనులు ఎలాగ ఉన్నా ఇతరులకు చేసిన వాగ్దానాలు మీరు ఈ వారంలో పూర్తిచేయగలగడంవలన సంతృప్తి లభిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రావచ్చును. వృత్తిలో శ్రమ పెరుగుతుంది. ఉద్యోగరీత్యా కొంతమంది అవాంఛనీయులైన వ్యక్తులతో సన్నిహితంగా ప్రవర్తించవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. ముఖ్యమైన కార్యక్రమాలను వాయిదా వేయడం మంచిది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు— ఆరోగ్యం గత వారంలోకంటే బాగా ఉంటుంది. సాంఘిక వ్యవహారాల్లో వ్యయమూ, బాధ్యతా పెరుగుతాయి.

4,5,6 తేదీలు మంచివికావు. మిగిలినది మంచివి.

### వృశ్చికం :

(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

గ్రహబలం అనుకూలంగా ఉంది. వృత్తి వ్యాపారాల్లో అధికాదాయమేకాకుండా, విజయాన్ని సాధించామనే సంతృప్తి కలిగే పరిస్థితి ఏర్పడుతుంది. సాటివారిలో మీ ప్రతిభా విశేషాలు గుర్తింపబడుతాయి. రావలసిన డబ్బు సమయానికి అందడంవలన అన్ని వ్యవహారాలూ ఒడుదుడుకుల్

# వారఫలం

లేకుండా నెరవేరతాయి. ఉద్యోగంకూడా అనుకూలంగానే ఉంటుంది. మీ మంచితనాన్ని ఆసరాగా తీసికొని కొంతమంది వ్యక్తులు తమ స్వార్థం కోసం మిమ్మల్ని వినియోగించుకొనడానికి ప్రయత్నం చేస్తారు. ఆరోగ్యం బాగా ఉంటుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. ప్రయాణాలు చేయగల సూచనలు ఉన్నాయి.

7,8 తేదీలు మంచివికావు. మిగిలినవి మంచివి.

## ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

వృత్తి వ్యాపారాల్లో మీ అభిప్రాయాలకు విరుద్ధంగా వ్యవహరించవలసి వస్తుంది కాని అంతిమంగా ఫలితం మీరు వూహించినదానికంటే బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో నూతన వ్యవహారాలు ప్రారంభించడానికి సమయంకాదు. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో మాట పట్టింపుల వలన కార్యభారం పెరగవచ్చును. ఉద్యోగంలో మీ పరిస్థితి యదాతథంగా ఉంటుంది. కోర్టు వ్యవహారాల్లో మీకు కొంతమంది ప్రముఖ వ్యక్తుల అండదండలు లభిస్తాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం సాధారణంగా ఉంటుంది. కుటుంబంలో భేదాభిప్రాయాలు రావచ్చును. విలువైన వస్తువులు కొంటారు.

7,8 తేదీలు మిక్కిలి మంచివి. మిగిలినవి సామాన్యం.

## మకరం :

(ఉషా 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)

ఇదివరకు మీరు జరిపిన వ్యవహారాల్లో ఏర్పడిన చికాకులను పరిష్కరించుకొనడంలో నిమగ్నమయి పోవడంవలన వృత్తి వ్యాపారాల్లో చెప్పతగిన అభివృద్ధిని సాధించడానికి అవకాశంలేదు. ఆర్థికంగా నష్టంలేకపోయినా, ఎప్పుడూ ఏదో ఒక విధంగా ఆందోళన కలిగించే పరిస్థితి ఏర్పడుతుంది. భాగస్వాములతో భేదాభిప్రాయాలు రావడంవలన కొన్ని వ్యవహారాలు నిలచిపోవచ్చును. వృత్తిరీత్యా ప్రయోజనంలేని ప్రయాణాలు చేస్తారు. ఉద్యోగంలో మీ స్థానాన్ని శ్రమమీద నిల్పుకుంటారు. కొంచెం అనారోగ్యం చేయవచ్చును.

స్త్రీలకు— సాహిత్య కళారంగంలో ఖ్యాతి లభిస్తుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

2,3,4 తేదీలు మంచివికావు. మిగిలినవి మంచివి.

## కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా. శతభిషం, పూ. భా. 1, 2, 3)

వృత్తి వ్యాపారాల్లో గౌరవం బాగా ఉంటుంది. గాని ఆర్థికంగా అంత ప్రోత్సాహకరంగా ఉండక పోవచ్చును. వ్యాపారంలో కేవలం మీ పనులే కాకుండా ఇతరులవ్యవహారాలుకూడ చూడవలసి రావడంవలన కార్యభారం పెరుగుతుంది. వృత్తిలో ముందుముందు ఉపయోగించు అవసరమైన మార్పులు చేస్తారు. ఉద్యోగంలో అధికారులతో భేదాభిప్రాయాలు వచ్చినా మీ గౌరవానికి భంగం ఏమీ కలగదు. కొన్ని వ్యవహారాలలో మీరు వూహించినదానికంటే అదనంగా వ్యయం జరగడంవలన ఆర్థికంగా తొట్రుపాటు కలుగుతుంది. ఆరోగ్యం బాగానే ఉంటుంది.

స్త్రీలకు— బంధువుల వ్యవహారాల్లో శ్రమ పొందినా నిష్ఫూరం వస్తుంది. ఆరోగ్యం బాగా వున్నా మానసికాందోళన కలుగుతుంది.

4,5,6 తేదీలు మంచివికావు. మిగిలినవి మంచివి.

## మీనం :

(పూ. భాద్ర, 4 పా, ఉ. రేవతి.)

ప్రతిక్షణమూ హెూరా హెూరీగా పోరాడితేనే గాని ఏ వ్యవహారాన్ని సాధించలేరు. వృత్తి వ్యాపారాల్లో మీ ప్రతి కక్షులు మీ మీద పనిగట్టుకొని దుష్ప్రచారం చేసే ప్రమాదం ఉంది. నిగ్రహంతో వ్యవహరించడం చాలా అవసరం. అధికారులవలన జరుగవలసిన పనులు కొంచెము శ్రమమీద నెరవేరి లాభం కలుగుతుంది. ఆర్థిక వ్యవహారాల్లో ఏర్పడి ఉన్న చికాకులు క్రమంగా తగ్గుముఖం పడతాయి. ఉద్యోగంలో కార్యభారం పెరిగినా తగిన ప్రతిఫలం ఉంటుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు— ఇతరులతో మాట పట్టింపులకు సమయంకాదు. దైవ కార్యాలు నెరవేరతాయి. సాంఘిక కార్యక్రమాల్లో మార్పులు వస్తాయి.

5,6 తేదీలుమంచివి. మిగిలినవి మంచివికావు. ★

# జన్మదినఫలం

## అక్టోబరు–2

అప్పుడప్పుడు కొన్ని అవాంఛనీయములైన పరిస్థితులు యేర్పడినా మొత్తం మీద ఈ సంవత్సరం సంతృప్తికరంగా ఉంటుంది. వ్యాపారంలో అనుకూలత లభిస్తుంది. భారీ యెత్తున చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. కొన్ని వ్యవహారాల్లో ఆకస్మికంగా చికాకులు యేర్పడడం వలన అనవసరమైన వ్యయం జరుగుతుంది. వృత్తిలో సాటి వారిలో గౌరవం లభిస్తుంది. నూతన మార్గాల ద్వారా ఆదాయం పెరగ గల సూచనలు ఉన్నాయి. ఉద్యోగం కూడా సంతృప్తికరంగా ఉంటుంది. స్థిరాస్థి వ్యవహారాల్లో ప్రతికూలత యేర్పడ వచ్చును. ఆరోగ్యం బాగా ఉంటుంది. గాని అప్పుడప్పుడు రక్తసంబంధమైన అనారోగ్యం చేయ వచ్చును. కుటుంబ వ్యవహారాలు నిరాటంకంగా నెరవేరతాయి. సాహిత్య వైజ్ఞానిక రంగాల్లో మీ కృషికి ఆటంకాలు రావచ్చును. విద్యార్థులు చాలా శ్రమ మీద కృతార్థులు కాగలరు.

## అక్టోబరు–3

ఈ సంవత్సరం బాగా ఉంటుంది. ఇది వరకు మీరు ప్రయత్నించిన వ్యవహారాలు కూడా ఇప్పుడు నెరవేరతాయి. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మీ ఆలోచనలు కేవలం మీ వ్యవహారాల్లోనే కాకుండా మీ మిత్రులకు కూడా తోడ్పడగలవు. మీకు రావలసిన డబ్బు కొన్ని వ్యవహారాల్లో చిక్కుకొని పోవడం వలన సంవత్సరం మధ్యలో వ్యాపారంలో చికాకులు రావచ్చును కాని యేదో ఒక విధంగా మీ పలుకుబడి వలన సర్దుకొని పోగలరు. వృత్తి ఉద్యోగాల్లో మీ పరిస్థితి సంతృప్తికరంగానే ఉంటుంది. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో భేదాభిప్రాయాలు రాగల సూచనలు ఉన్నాయి. బంధువుల తగాదాలు మీ కృషి వలన పరిష్కారం కాగలవు. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

## అక్టోబరు–4

ఈ సంవత్సరం మొత్తం మీద అంత సంతృప్తికరంగా ఉండదు. మీరు ఇది వరకు జరిపిన వ్యవహారాల్లో యేర్పడిన చికాకులను తొలగించుకొనడంలో నిమగ్నమయి పోవడం వలన వృత్తి వ్యాపారాల్లో ఈ సంవత్సరం చెప్ప తగిన అభివృద్ధిని సాధించటానికి అవకాశం ఉండదు. భారీ యెత్తున చేసే వ్యాపారాలు వాయిదా వేయడం మంచిది. వృత్తి ఉద్యోగాల్లో మీ పరిస్థితి అంత బాగా ఉండదు. ఇతరులు చేసిన పొరబాట్లకు కూడా మీరే బాధ్యత వహించ వలసిన పరిస్థితి యేర్పడుతుంది. కొంతమంది వ్యక్తులు మీ యెదురుగా పొగడుతూ, చాటున మిమ్మల్ని దూషిస్తూ ఉంటారు. వృత్తిలో చేయతగిన మార్పుల కోసం సంవత్సరాంతంలో ప్రయత్నించడం మంచిది. ఆరోగ్యం బాగానే ఉంటుంది కాని అప్పుడప్పుడు మానసికాందోళన కలుగుతుంది. కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. విద్యార్థులు మొదటి నుంచి శ్రద్ధగా చదవడం మంచిది.

## అక్టోబరు-5

ఈ సంవత్సరం మీ జీవితంలో చాలా ముఖ్యమైనది. ఇంతవరకు కేవలం ఆశయాలుగా మీ మనఃపథంలో ఉన్న విషయాలు వాస్తవ రూపాన్ని ధరించే సమయం. వృత్తి వ్యాపారాల్లో మీ ఆలోచనలు అభిప్రాయాలు అందరిచేత ఆమోదింప బడతాయి. మీరు ఇంతవరకు రాదను కొన్న డబ్బు కూడా చేతికి అందగల అవకాశం ఉన్నది. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా కొంతవరకు అనుకూలంగా ఉంటాయి. వృత్తిలో మీకు విశేష ప్రాబల్యంగల వ్యక్తుల అండ దండలు లభించడం వలన చెప్పదగిన అభివృద్ధిని సాధించ గలరు. ఉద్యోగంలో కొంచెం శ్రమ మీద ఉన్నత స్థానం లభించ వచ్చును. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలలో యేర్పడిన చికాకులు తొలగిపోతాయి, సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

## అక్టోబరు-6

ఈ సంవత్సరం కొన్ని వ్యవహారాల్లో ఆందోళనా, అనవసరమైన వ్యయమూ జరిగినా, మొత్తం మీద బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో ఇంత వరకూ ఉన్న చికాకులు తగ్గు ముఖం పడతాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రారంభంలో సామాన్యంగా ఉన్నా ముమ్మందు ఉపయోగించుటకు అవకాశం ఉన్నది. వృత్తిలో క్రమాభివృద్ధిని సాధిస్తారు. ఉద్యోగంలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. రావలసిన సహాయాన్నిగాని డబ్బును గాని నమ్మి ఇతరులకు వాగ్దానం చేయడం మంచిది కాదు. స్థిరాస్తి వ్యవహారాలు చాలా వరకు అనుకూలంగా ఉంటాయి. ఆరోగ్యం బాగా ఉన్నా అప్పుడప్పుడు బలహీనత కన్పిస్తుంది. కుటుంబ, వ్యవహారాల్లో ఆర్భాటం హడావుడీ తప్ప చెప్పతగిన అభివృద్ధి ఉండదు. రాజకీయాల్లో బాధ్యత, పలుకుబడి పెరుగుతాయి. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు.

## అక్టోబరు-7

ఈ సంవత్సరం శుభా శుభ మిశ్రమంగా ఉంటుంది. మీరు ఇంత వరకు ఒక దారికి తెచ్చిన వ్యవహారాల్లో కూడా మరల చికాకులు వచ్చే సూచనలు ఉన్నాయి. ప్రతి వ్యవహారంలోను వ్యయ ప్రయాసలకు గురి కావలసి వస్తుంది కాని మొత్తం మీద స్వల్పాభి వృద్ధిని సాధించ గలరు. కొన్ని అనవసరమైన వ్యవహారాల్లో మీరు చిక్కుబడి పోయే ప్రమాదం ఉంది. కాబట్టి సాధ్యమైనంత వరకు తటస్థంగా ఉండడం మంచిది. వృత్తి ఉద్యోగాల్లో క్రమాభివృద్ధిని సాధిస్తారు. సంవత్సరాంతంలో వ్యాపారంలో ఆకస్మిక ధన లాభం కలుగ వచ్చును. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కాని శరీర శ్రమతో కూడిన వ్యవహారాలు పనికి రావు. కుటుంబ వ్యవహారాలు బాగానే ఉంటాయి. దూర ప్రయాణాలు చేస్తారు. విద్యార్థులు శ్రమ మీద కృతార్థులు కాగలరు. వైద్యులకు, కళాకారులకు మంచి సమయం.

## అక్టోబరు-8

ఈ సంవత్సరం మీరు ఘన విజయాల్ని యేమీ సాధించ లేకపోయినా, మీరు నిరుత్సాహ పడ వలసిన అవసరం లేదు. వృత్తి వ్యాపారాల్లో మీ ఆలోచనలను అమలులో పెట్టడానికి అవకాశం లభిస్తుంది కాని ఫలితం అంత సంతృప్తికరంగా ఉండదు. సాహసంతో కూడిన వ్యాపారాలు కూడా సంవత్సరం మధ్యలో రాణించగల సూచనలు ఉన్నాయి. వృత్తిలో ప్రయాస పెరిగినా తగిన ప్రయోజనం కూడా ఉంటుంది. ఉద్యోగంలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. రావలసిన డబ్బు సమయానికి అందడం వలన అన్నివ్యవహారాలూ ఒడుదుడుకులు లేకుండా సాగిపోతాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు యధాతథంగా ఉంటాయి. తీర్థయాత్రలు పుణ్య కార్యాలు నిరాటంకంగా నెరవేరుతాయి. విద్యార్థులు కృతార్థులు కాగలరు. ★





# అతి తేలిక

# మీకు

# కావలసిందల్లా




# మాత్రమే

## నేషనల్ అండ్ గ్రిండ్లేస్‌లో

## సేవింగ్స్ బ్యాంక్ అకౌంట్

ప్రారంభించడానికి



బ్యాంక్ ఛార్జీలు లేవు — పైగా సాలీనా నూటికి రు. 3/-లు వడ్డీకూడా మీకు లభిస్తుంది.

నేడే మీకు సమీపంలోవున్న బ్రాంచికి వెళ్లండి:

## నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంక్ లిమిటెడ్

(యునైటెడ్ కింగ్‌డమ్‌లో ఇన్‌కార్పొరేట్ చేయబడింది. మెంబర్ల బాధ్యత పరిమితం) NGB/61.166

బ్రాంచిలు: మద్రాసు: 3, నార్త్ బీచ్ రోడ్డు; 378 నేతాజీ సుభాస్ చంద్రబోస్ రోడ్డు, (సౌకార్‌పేట బ్రాంచి); 6, ఆర్మీనియన్ స్ట్రీట్; 158, మౌంట్ రోడ్డు. హైదరాబాద్: అబీడ్ రోడ్.

# హృదయ కుసుమాలు



### జ రి గి న క థ

డాక్టర్ సీత, తన స్నేహితురాలయిన డాక్టర్ రాధకు తమ కుటుంబ గాథను చెపుతూవుంటుంది... 'జానకి, సీత అక్కచెల్లెళ్ళు. జానకి రామారావులకు పెళ్ళవుతుంది. జానకికీ, చనిపోయిన చినమామయ్యకీ సంబంధం వుందన్న కోపంతో రామారావు ఆమెను చిన్నచూపు చూస్తాడు. భార్యాభర్తల మధ్య తీవ్రమైన అభిప్రాయభేదాలు రావటంతో, జానకి తానాశించిన ఆనందాన్ని పొందలేకపోతుంది. జానకిపై రామారావు అనుమానం నానాటికీ ఎక్కువవుతూ వుంటుంది. పండుగకు జానకి దగ్గరకెళ్ళిన సీత, ఆ సంసారాన్నంతా బాగా అర్థం చేసికొనగలుగుతుంది. సినిమా హాలులో రామారావు, విద్యార్థిని రమతో మాట్లాడటం సీతలో అనుమానానికి దారితీస్తుంది. ఆ సంగతి ప్రస్తావించిన జానకికి రా మా రా వు చేతిలో మళ్ళీ చీవాట్లు తగిలాయి. ముమ్ముందు రామారావు రమను తన యింటికే తీసుకొస్తున్నాడన్న వార్త జానకి పుట్టింట్లో సంచలనాన్ని కల్గిస్తుంది.

## 8

అమ్మ గోల చెప్పటానికి వీల్లేదు. ఆవిడ గుండెల్లో రాయిపడ్డది. ఎప్పుడెప్పుడు వెళ్ళి చూరుతుందా, ఎప్పుడు గుంటూరు పోదామా అనిపించింది.

అమ్మను తీసుకుని గుంటూరు వెళ్ళాను. ఇంటికి వెళ్ళగానే జానకిని చూచి అమ్మ కావిలించు కుని ఉన్నుంది. [illegible] తల, చెంపలు, [illegible] ఆప్యాయంగా, ప్రేమతో నిమిరింది. అక్కయ్య అమ్మను ఓదార్చి "కంట తడిపెట్టవద్దు ఇంకా నేను బ్రతికే ఉన్నానమ్మా" అన్నది. ఆ మాట అంటూ నా వైపు చూసింది. దాని జీవితమంతా సినిమా రీలులా నా కళ్ళముందు కనిపించింది. అక్కయ్య తెలుగువారి ఆడబడుచు. మానాభిమానాలుగల స్త్రీమూర్తి. పవిత్ర భారత దేశంలో పుట్టి, పవిత్రమైన ఆదర్శాలకు, సాంఘిక కట్టుబాట్లకూ తలవంచి, పవిత్ర భావాలతో, ఆదరాభిమానాలు ఎంతమాత్రం చూపని భర్తతో కాపురం చేస్తున్నది. ఇంటరులో అది సంపాదించుకున్న ఫస్టుక్లాసు సర్టిఫికేటుగాని, ప్రిన్సిపాల్ గారిచ్చిన కాండక్టు సర్టిఫికెట్లుగాని, లెక్చరర్లూ, విద్యార్థులూ చూపిన ఆదరాభిమానాలు, [illegible]

[illegible]
లతో జీవించటానికూడా ఏ విధంగానూ ఉప యోగపడలేవేమో ననిపించింది. అక్కయ్య ముఖంలో ఆనాటి కాంతిరేఖలు శాశ్వితంగా తొలిగి పోయినయ్యి. నిరాశ, నిస్పృహ గూడుకట్టుకుని కాపురంచేస్తున్నాయి.

మేం వెళ్లేసరికి బావ ఇంట్లోనే ఉన్నారు. నన్ను చూడగానే నవ్వుతూ ముభావంగానే పలకరించారు.

"కులాసాగా ఉన్నారా బావా. అక్కయ్యను చూస్తానంటే అమ్మను తీసుకువచ్చాను" అన్నాను.

"అట్లాగా. మావగారు కులాసాగా ఉన్నారా? వెళ్లేరోజున వారు కొంచెం సుస్తీగా ఉన్నట్లు కనిపించారు. సరే వస్తా" అంటూనే వెళ్లిపోయారు.

అమ్మ నాలుగు రోజులుంది. అన్ని విషయాలూ అమ్మతో చెప్పింది. జానకి. అమ్మ నెత్తీ నోరూ బాదుకుంది. అమ్మ మనస్సులో దిగులు పేరుకుపోయింది. కన్నతల్లి మనస్సు అక్కయ్య జీవితాన్ని తల్చుకుని బావమీద కార్పణ్యంతో నిండిపోయింది. ఆవిడ విచారానికి అంతులేదు. కొన్నాళ్లపాటు నన్ను ఉండమని అమ్మ వెళ్లింది. మీ అమ్మ ఎందుకు వచ్చిందని, అప్పుడే వెళ్లిందేమనిగాని బావ అనలేదు. అమ్మ ఉన్న నాలుగు రోజులూ ఆయన రావటం రాత్రి పదిగంటల తరువాతనే.

ఆ రోజు ఆదివారం. బావ ఇంట్లోనే ఉన్నారు. శెలవయినా సాయంత్రం నాలుగ్గంటలదాకా ఉంటం నాకు కొంచెం ఆశ్చర్యం కలిగించింది. సరిగ్గా నాలుగున్నరకు ఒకమ్మాయి వచ్చింది. వస్తూనే బావను పలకరిస్తూ "ఏం మాష్టారూ, ఇవాళ

# హృదయ కుసుమాలు

పాట కచ్చేరీ ఉంది మర్చిపోయారా" అని నవ్వుతూ అంటూ అక్కడే కుర్చీలో కూర్చుంది. అమ్మాయిని పరిశీలనగా చూశాను. ఆ రోజున సినిమాలో చూసినమ్మాయే. రమాదేవి. నన్ను ఆ అమ్మాయి చూళ్లేదు.

"వస్తున్నా రమా. పాట కచ్చేరి సంగతి నాకూ గుర్తుంది. నువ్వే వచ్చి పిలిస్తేనేగాని వెళ్లదల్చుకోలేదు."

"ఆ మర్చిపోయా. కస్త జాగ్రత్త. మా మరదలు సీత వచ్చింది." అన్నారు.

నాకు తల నరికినంత పనయింది. అక్కయ్యకు ఇదంతా అలవాటయినట్లుంది. అమ్మాయి రాగానే ఒక్కసారి చూచి కళ్లు తుడ్చుకుంది. అభిమానం కల ఆడదానికి తన భర్తతో ఒక పరాయిస్త్రీ తన కళ్ల ఎదటనే తనకన్న ఆధిక్యత చూపుతూ కులుకుతుంటే అంతకన్నా తలవంపు విషయమేముంటుంది.?

నేను బావగారి గదిలోకి వెళ్లాను. నన్ను చూడగానే రమాదేవి నిర్ఘాంతపోయి లేచి నిల్చుంది. గులాబిరంగు షిఫాన్ చీరె కట్టుకుంది. నారింజ రంగు వెల్వెట్ జాకెట్టు తొడుక్కుంది. లంగాకు కుట్టిన నక్షత్రాల్లాంటి చెమ్కీ పూలు చీరెలోంచి నన్నుచూసి నవ్వుతూ మెరుస్తున్నయ్యి.

"కాలేజీలో మా శిష్యురాలు రమాదేవి. ఆమ్మాయి సీత, మా మరదలు" అంటూ ఒకరికొకరు పరిచయం




చూశారు బావ. నాకు వళ్లు మండిపోయింది.

"నమస్కారమండీ" అన్నది రమాదేవి. ప్రతి నమస్కారంచేస్తూనే తీక్షణంగా రమాదేవిని చూశాను. రమాదేవి, ఖంగారుపడి తలొంచుకుంది.

బావతో కలసి రమాదేవి వెళ్లిపోయింది. వాళ్లిద్దరూ వెళుతుంటే నా మనస్సులోని ఆవేదన పెల్లుబికి శరీరం వణికిపోయింది. అక్కయ్య ఆక్రమించవలసిన స్థానం రమాదేవి ఆక్రమించింది. వాళ్లు వెళ్లాక నాకు వళ్లు తెలీలేదు.

"జానకీ. బావ అట్లా చెడిపోవటానికి నువ్వే కారణమే. అట్లా మొద్దులా చూస్తూ వూరుకోవటంనుంచే బావ అట్లా తయారయారు. నీ కాపురం బాగుచేసుకోవటం నీకు చేతకాదు. నువ్వు సుఖపడలేవు. ఒకళ్లను సుఖపెట్టలేవు. పిల్లి చాలా సాత్వికమైన జంతువు. ఎంతచేసినా 'మ్యావ్' మంటూ తోక ముడ్చుకుని వెళ్లిపోతుంది. తలుపులన్నీ వేసి కర్ర తీసుకుంటే ఇంక ఏం చేస్తుంది. గుడ్లు పీకుతుంది. నువ్వు పిల్లిలా ఉంటే బావ ఇంకా చెడిపోతారు. నేను అవివాహితను. నేను చెప్పరానివి, చెప్పకూడనివి ఎన్నో విషయాలుంటయ్యి. భర్త చెడుమార్గాన పడుతున్నా తిర్చిదిద్దుకోని భార్య ఉన్నా ఒకటే, లేకపోయినా ఒకటే" అన్నాను. ఏ మాట్లాడుతున్నానో నాకు తెలీలేదు.

"అక్కయ్యా" అంటూ బావురుమని అక్కయ్యని కావిలించుకున్నాను. నా మనస్సులోని ఉద్వేగం కట్టలు తెంచుకుంది. నేను ఏడ్చినంతగా అక్కయ్య తన విచారాన్ని వ్యక్తంచేయలేదు. నాకు ఆశ్చర్యం కలిగింది— అగ్ని పర్వతం బ్రద్దలయినా ఇంకా ఇంత నిదానమేమిటా అని. కళ్లు తుడ్చుకుని అక్కయ్య ముఖంలోకి చూశాను. నన్నుచూస్తూ "సీతా ఎందుకే నువ్వేడుస్తావు" అంటూ నీరసంగా నవ్వింది. అంత క్షమాగుణం, ఓర్పు, ధైర్యంతో కష్టాన్ని ఎదుర్కోవటం ఎట్లా నేర్చుకున్నదా అనుకున్నాను.

"నా జీవితంలో అన్ని ఆశలూ అణగారి పోయినయ్యే సీతా. ఏడ్చినా కన్నీళ్లు రావు. నాలోని కన్నీళ్లు ఎప్పుడో ఇంకిపోయినయ్యి. అన్ని కోరికలూ, అన్ని కాంక్షలూ, అంత అనురాగమూ, అన్ని ఉద్రేకాలూ, అన్ని ఉద్వేగాలూ, చంపుకున్నాను. ఈ పొట్టలో వాడికోసం బ్రతుకుతున్నాను. ఈ పొట్టలో పిండం కదులుతుంటే అన్ని కష్టాల్ని మర్చిపోతున్నాను. అన్ని అవమానాల్నీ చిరునవ్వుతో ఎదుర్కొంటున్నాను. అన్ని అనుభూతుల్నీ, అన్ని కోరికల్ని నరిపెట్టుకొని తృప్తి పడుతున్నాను. వారిమీద ఎన్నో కోరికలు, కాంక్షలూ, అనురాగమూ ఉన్నయ్యి. ఏంలాభం? ఏమనుకుని తృప్తి పడను? ఎన్నాళ్లని అన్నం నీళ్లు మానను. తిండి మానేస్తే ఈ పొట్టలోని వాడి గతి. వాడికే వాళ్ల నాన్న పోలికవస్తే అప్పుడు నా క్షోభ ఉండనే ఉన్నది. ఇప్పట్నుంచే వాడి విషయమై కూడా ఎట్లా అనుకుని బాధపడను. అయినా ఈ కాన్పు సవ్యంగా అయి మళ్లా బ్రతికి బయటపడినప్పటి సంగతికదా? అంతదాకా నువ్వయినా తోడుగా ఉంటావని నాన్నను బ్రతిమాలాను. అమ్మతో ప్రాధేయపడి అడిగాను. అమ్మా, నాన్నా వింటారనే నమ్మకంతో ప్రాధేయపడ్డాను. మీ బావతో ప్రాధేయపట్టమేకాదు, ప్రాణాలు వదుల్తాననే అన్నాను. కన్నీటితో వారిపాదాలు

కడిగాను. మనస్సు కరిగేటట్లు చెప్పుకున్నాను. నా అనుభవాలు తల్చుకుంటే నాకు ఏడుపు రావడం లేదు. గుండె రాయిగా మారిపోయింది. మనస్సులో ఏ అనుభూతులూ, ఏ కాంక్షలూ, ఏ కోరికలూ కలగడంలేదు. ఒక్కటే ఆశ. ఒక్కటే కోరిక. ఒకటే బాధ. నువ్వు బావను తీర్చిదిద్దగలవే సీతా. బాగుపడితే నీ ద్వారానే వారు బాగుపడాలి. లేకపోతే నువ్వూ ఒక అభాండాన్ని నెత్తినవేసుకుని పోతావు. నా అదృష్టం ఈ రీతిగా ఉన్నదా, నీ అదృష్టం ఎట్లా ఉందో చూడు. ఆ. ఏమీ అనుకోకు సీతా. ఏదో ఆవేదన పట్టలేక అనేస్తున్నాను." అంటూ ఆయాసపడుతూ అన్నది అక్కయ్య. అక్కయ్య మాటలు వినేసరికి నాకు ప్రాణం నిర్జీవమైపోయింది. ఏం మాట్లాడాలో తోచలేదు.

బావ రాత్రి పదకొండు గంటలకి వచ్చారు. అప్పటివరకూ అక్కయ్య అన్నం తినకుండా కళ్లల్లో ప్రాణాలు పెట్టుకుని ఎదురుచూస్తూ కూర్చుంది. వడ్డించలేక, వడ్డించలేక బావ కంచంలో వడ్డించింది. కూర్చుని వడ్డిస్తున్నా చేతుల్లో బలంలేక పులుసు గరిటె వణికి పులుసంతా ఆయన చేతిమీదా, కాలిమీదా పోసింది. చెయ్యి వణికి అంతపని జరిగింది. అక్కయ్య హడలిపోయింది. నా మనస్సు గతుక్కుమంది. బావ కోపం పరవళ్లు త్రొక్కింది.

"జానకీ! చూడు, నాకు వడ్డించటానికి కష్టంగా ఉంటే పోయి పడుకో. అంత ఇష్టంలేని తిండి కావాలని నేనేం ఏడవటంలేదు. నీకు కష్టంగా ఉంటే రేపట్నుంచీ హొటల్లోనే భోంచేస్తాను. నవ్వు ఆరుగంటలకల్లా తిని పడుకో. నువ్వు నాకు వంటచేసి పెట్టటంలేదని నేననుకోను. నా అదృష్టం బావుండి ఆ పులుసు వేడిగాలేదు కాబట్టి సరిపోయింది. లేకపోతే చెయ్యి, కాలూ తాట పూసేది." అంటూ కంచంలో చెయ్యి కడుక్కుని వెళ్లారు.

వెనకాలే అక్కయ్య వెళ్లింది. నేను గుమ్మంలోనే కూర్చున్నాను.

"చూడండి. నేనేం పొయ్యాలని పొయ్యలేదు. వంట్లో నీరసంగా ఉండి చెయ్యి వణికిపోయింది. మీకు అన్నం వండిపెట్టటానికి కాకపోతే నా జీవితానికి కావలసిందేముంది. ఇంతసేపూ కనిపెట్టుక కూర్చుని నేను ఎంగిలి పడకుండా ఉన్నది దేనికి? మీకోసం కాదా. మీరసలు పూర్తిగా మారిపోతున్నారు. మీకు కాకపోతే నా గోడు ఎవరికి చెప్పుకోను. నా వంట్లో ఏమీ స్వాస్థ్యం లేదు. అందుకు నేను బాధపట్టంలేదు. మీ గౌరవం పోతున్నదనే నా మనస్సులో బాధ. లోకం కోడయికూస్తున్నది. ఆ రమాదేవి స్నేహం మానండి. అంతకన్నా నేను కోరేది, కోరదగింది ఏదీ లేదు" అన్నది అక్కయ్య.

"అయిందా లెక్చరు. జానకీ ఒక్కటే చెప్తున్నా. నా స్వంత విషయాలలో నువ్వు జోక్యం కలగచేసుకోవద్దు. నీకు కష్టంగా ఉంటే రేపే వెళ్లు పిలూరు. సీత వచ్చిందిగా. సీతతో వెళ్లిపో. నువ్వు వెళ్లినందుకు నేను బాధపడను. పురిటికి ఎట్లాగూ వెళ్లాలిగా. రేపే వెళ్లు. రమాదేవి విషయం ఎత్తకు. ఆ పిల్ల కాలిగోటికికూడా నువ్వు సరిపోవు. ఆ అమ్మాయి అరికాలినున్న అదృష్టం నీ ముఖానకూడా లేదు. ఎక్కడో రాసిపెట్టి ఉండడంనుంచి ఆ చదువు అబ్బిందిగాని, నీలో ఏంచూసి చేసుకున్నానో నాకు ఆలోచించుకుంటే ఇప్పటికీ అర్థంకావటంలేదు. ఇంకనుంచీ నువ్వు నాకు ఏ సలహా చెప్పనక్కర్లేదు. నా మంచి చెడ్డలు నాకు తెల్సు. నా సుఖం నేను చూసుకుంటాను. నాకిష్టమైన, నన్ను ఆశించిన వారిని సంతోషపెడతాను. నాకు ఎవరియందు ఇష్టత ఉంటే వారితోనే ఉంటాను. కడుపుతో ఉన్న దానివని కనికరించి మంచిగా చెపుతున్నాను. ఇప్పట్నుంచీ నీ పురిటి ఏర్పాట్లు నువ్వు చూసుకో. నన్ను గురించి నువ్వేమీ బాధపడకు" అన్నాడు బావ. అన్నీ నాకు వినబడుతూనే ఉన్నయ్యి. ఆడదాని జీవితానికి అక్కయ్య గీటురాయి.

"మీ స్వంత విషయాలంటే నేను జోక్యం ఏనాడూ కలిగించుకోను. పండంటి కాపురంలో కారుచిచ్చు పెట్టి, ఒక అప్రాచ్యురాలు నా స్థానాన్ని ఆక్రమించి, నా భర్తని తన చేతిలో కీలుబొమ్మగా చేసుకుంటే చూస్తూ పూరుకోవాలంటారా? నేనే కాదు ఎవ్వరూ దీన్ని హర్షించరు. ఏ భార్యా తన



గుమస్తా: సార్! ధరలు బాగా పెరిగిపోయాయి; కుటుంబాన్ని భరించలేకుండా ఉన్నా; మీరు ఇచ్చే జీతం చాలడం లేదు.

మేనేజరు: ఇంతకీ జీతం పెంచమని అడగడానికి వచ్చావా?

గు: లేదు సార్! ఈ ఉద్యోగమూ, సంసారమూ ఒదిలేసి సన్యాసం పుచ్చుకుంటున్నానని చెప్పి వెళ్లడానికి వచ్చాను.

కె. రంగారావు (కాకరపర్రు)

భర్త స్త్రీలోలుడయితే సహించదు. ఇది మీ స్వంత విషయంకాదు. మన స్వంత విషయం. మన కాపురం విషయం. మన సంసారం విషయం. ఈ విధంగా మీరు మారిపోతుంటే నా మనస్సు ఎంత క్షోభిల్లుతుస్తదో ఆ పరమాత్ముడికేఎరుక. దాని అరికాలినున్న అదృష్టం నా ముఖానలేదన్నారు. నిజమే. చెడిపోయిన ఆడదాని అదృష్టం అరికాల్లోనే ఉంటుంది. అరికాల్లో అదృష్టం ఉండటం నుంచే అట్లా చెడు తిరుగుతూ మిమ్మల్ని తన చుట్టూ తిప్పుకుంటూ మిమ్మల్ని సర్వనాశనం చేస్తున్నది. చదువుకున్నవారు. పది మందికి చెప్పగలవారు.........." అక్కయ్య చెంప ఛెళ్లుమంది. నా గుండె ఝల్లుమంది.. గదిలోకి వెళ్లాను. అక్కయ్య చెంప అట్లాగే పట్టుకుంది. గుడ్ల నీళ్లు గుడ్ల గుక్కుకుని ఆయాసపడుతూ ఇవతలకి వచ్చింది. బావ తలుపులు గడియ వేసుకున్నారు. అక్కయ్యకు నోట మాటరాలేదు. బావ మనస్సూ, అక్కయ్య సంసార జీవితమూ తల్చుకుంటే పెళ్లనే తతంగానికి అసలు అర్థంలేదనే అనిపిస్తున్నది. ఆదరణలేని భర్తతో అగచాట్లుపడుతూ, వ్యక్తిత్వాన్ని చంపుకుని, లోకానికి తలొగ్గి, మానానికి మగ్గి, అవ్యక్త వ్యథల్ని అనుభవిస్తూ, నరనరాల్లోని నరక బాధల్ని పళ్ల బిగువుకు అణిచిపెట్టుకుని, మంగళసూత్రాల్ని, మెట్టెల్ని, నల్లపూసల్ని చూసుకుని నేనూ నా భర్తతో కాపురం చేస్తున్నానని ఆత్మవంచన చేసుకుని, ఆదర్శ గృహిణినని అనుకుంటూ నికృష్ట జీవితాన్ని గడిపేకన్న, క్షణిక సుఖాన్ని మనస్సులోకి రానీయక, నిజాయితీగా ఏ ఉద్యోగమైనా చేసుకుంటూ, గౌరవంగా బ్రతకటమే ఆడది తన జీవిత పరమార్థంగా తలచి, ఆ రకంగా జీవించగలిగితే, అంతకన్నా సుఖమయ జీవితంలేదు. పెళ్లికొచ్చిన ఏ పెద్దలూ ఇలాంటి సంసారాన్ని తీర్చిదిద్దలేరు. వంకలుపెట్టి వ్యాఖ్యానించి పోవటం తప్ప.

అక్కయ్య జీవితం నన్నెంతో కుంగదీసింది. ఆడదాని జీవితంలో సుఖ సంతోషాలకన్నా ఆత్మవంచన జాస్తి. ఆత్మవంచన చేసుకుంటే ఆడది తన కాపురం బయటపడకుండా జీవించగలిగేది. అంతరాంతర కల్లోలాన్ని దిగమింగి, ఆత్మ పరిశీలన చేసుకోక 'అహహహ' అని నవ్వుతూ ఎవరి భర్తని వాళ్లు వాళ్లు వెనకేసుకుని జీవించగలిగితేనే ఆ భార్యాభర్తలు సంఘం దృష్టిలో చిలకా, గోరింకల్లా ఉన్నట్లుగా అనుకుంటారు. అదే సంసారం, అదే ఆదర్శ గృహిణి జీవితం. అదే దాంపత్యానికి గీటురాయి. అదే చక్కగా, ముచ్చటగా కాపురంచెయ్యటం. ఛీ! ఆడదాని జీవితం ఎంత నికృష్టమైనదో! ఎంత ఆత్మవంచనతో కూడుకుని ఉందో ఈనాటికి నాకు అర్థమైంది. అనుకుని వాపోయాను ఆ రోజున.

అక్కయ్య సొమ్మసిల్లి పడుకుంది. దాని చెంపల మీద కన్నీటిచారలు శాశ్వతంగా దారి ఏర్పర్చుకున్నయ్యి. ఆ రాత్రి నాకు నిద్రపట్టలేదు. కళ్లు మూసుకుంటే రమాదేవి కనుపించసాగింది. దాని వెనకనే విచారంగా అక్కయ్య నిల్చుని ఉండేది. రెప్ప వాల్చకుండా కూర్చున్నాను. నా పద్దెనిమిదేళ్ల జీవితంలో ఎనభై ఏళ్ల సంసార జీవితాన్ని నా కళ్లతో చూశాను.

ఆ రోజునుంచే అక్కయ్య మంచమెక్కింది. దాని పన్లు అది చేసుకోవటంలోకూడా జాప్యం, నిర్లక్ష్యత, నిరాశ, కనబరుస్తూ ఏదో చావలేక, బ్రతుకుతున్నట్లుగానే ఉంటున్నది. వంటకూడా నేనే చేస్తున్నాను. బావకు మాత్రం లేని ఓపిక తెచ్చుకుని నిదానంగా వడ్డిస్తున్నది. డాక్టరుకు చూపించారు బావ. డాక్టరుమాత్రం ఏం చెప్తాడు. పడికట్టు పదాలు చెప్పి, మందులూ, ఇంజక్షన్లూ మామూలుగా ఇస్తున్నాడు. అంతకు మినహా అక్కయ్య ఆరోగ్యం విషయంలో బావ తీసుకున్న శ్రద్ధాసక్తులేమీ లేవు. లేడీ డాక్టర్ని కూడా పిలిపించి పరీక్ష చేయిస్తే ఆవిడ అంతా బాగానే ఉన్నదనీ బలానికి టానిక్కులు, ఇంజక్షన్లూ తీసుకోవాలనీ, విశ్రాంతి అవసరమనీ ఒక మందుల జాబితా రాసిచ్చింది. అంతకన్నా తను చేయగలిగిందేమీ లేనట్లుగా పూరుకున్నారు బావ. వారానికి రెండుసార్లు అక్కయ్యతో లేడీ డాక్టరు

42 వ పేజీ చూడండి

**కొత్త సీరియల్ ప్రారంభం:**

# అయిదుర

సాయంత్రం ఆరుగంటలవేళ పగలంతా తన ప్రతాపం చూపించిన ఎండ విశ్రాంతి తీసుకున్నది. మెల్లిగా చల్లగాలి తిరిగింది ఏప్రిల్ మొదటివారం. విద్యార్థి లోకం ఖుషీగా గడిపే వేసవి సెలవులు. ఏడాది అలసటను నిమిషంలో పోగొట్టి వినూత్న ఉత్సాహాన్ని అందజేసే మధురమైన రోజులు. పరీక్షలు పూర్తికావటంతో కళ తీరికగా వీధి వరండాలో కూర్చుని నవల చదువుకుంటున్నది. జానకమ్మ లోపలినుంచి కేకేసింది.

"ఏమే కళా! కాస్త శారదకు సాయం చెయ్యరాదూ? సెలవులేగా?"

వరండాకు కుడివేపున ఉన్న గదిలో జానకమ్మ నడుంనొప్పితో కదల్లేక మంచం మీద పడుకున్నది. కాస్త దూరంలో గోడకు మరో మంచం చేరబెట్టి ఉన్నది.

మద్రాసులో ఇళ్ళు దొరకటమంటే సామాన్యమైన విషయం కాదు. అది చైనా — భారత్ సమస్య అంతటి జటిల సమస్య. అయినా రామయ్యగారు అసాధ్యులు. రామయ్యగారంటే జానకమ్మకు భర్త. కళకు నాన్నగారు. ఆయనకు కళగాక మరో నలుగురు కుమారీ మణులున్నారు. వాళ్ళు గీత ఉష, చిత్ర, శారద. కళ, గీత కవల పిల్లలు తెరొక ఇరవై రెండేళ్ళు ఉంటాయి.

ఉష వాళ్లకంటె రెండేళ్ళు చిన్నది. ఆ రెండేళ్ళ తేడాను నిలుపుకుంటూ ఉష తర్వాత చిత్ర, చిత్ర తర్వాత శారద పుట్టారు. కళ హోం సైన్సు బి. యస్. స్సి. పరీక్ష, గీత బి. ఏ. మ్యూజిక్ పరీక్ష వ్రాశారు. ఉష పాలిటెక్నిక్‌లో డ్రెస్ మేకింగ్ డిప్లొమా కోర్సు చదువుతున్నది. మూడేళ్ళ కోర్సులో రెండేళ్ళు ముగిశాయి. చిత్ర ఆర్ట్సు స్కూల్లో మొదటి ఏడాది పూర్తి చేసింది. పోతే శారదకు ఇంగ్లీషు చదువులు అబ్బలేదు. కనీసం ఎస్. ఎస్. ఎల్. సీ. వరకైనా రాలేక పోయింది. మూడో ఫారమ్ తోటే చదువుకో నమస్కారం పెట్టి ఇంట్లో కూర్చుంది. అయితే వూరికే కూర్చోలేదు. హిందీ క్లాసులకు హాజరవుతూ వచ్చింది. ఫిబ్రవరిలో విశారద రెండో పార్టు వ్రాసింది.

రామయ్యగారు అసాధ్యులంటే అయిదుగురు ఆడ పిల్లల తండ్రి కావటంలో కాదు. ఆయన ట్రిప్లికేనులో, ఒక మంచి లొకాలిటీలో, వంద రూపాయలకు ఒక చక్కని ఇంటిని సంపాదించగల్గారు. — అద్దెకే అయినా అనుకోవలసిన మాట. రామయ్యగారికి బ్రాడ్వేలో ఒక వాచీల షాపుంది. ఆ షాపు మీద లక్షలకు లక్షలు సంపాదించలేకపోయినా, సంసారం మాత్రం సుఖంగానే దొర్లిపోతున్నది. ఉదయం పది గంటల నుండి రాత్రి ఏడున్నర గంటల వరకూ ఆయనా కొట్లోనే ఉంటారు! రాత్రిపూట తప్పించి పగటి పూట ఆయన ఇంట్లో ఉన్నట్టే ఉండరు, ఒక్క ఆదివారం మినహా.

రామయ్యగారు అద్దెకుంటున్న డాబా ఇల్లు మరీ పెద్దది కాదు. ఇంటిముందు గేటు, గేటుకు కాస్త దూరంలో వీధి వరండామెట్లు, వరండాకు కుడివేపున వరసాగా మూడు గదులు ఎడం వైపున రెండు గదులు, మధ్యలో హాలు. వెనకాతల ఓపెన్ వరండా—మధ్య హాలు డ్రాయింగు రూముగా వాడుకుంటున్నారు. కుడివేపు గదుల్లో మొదటి గది జానకమ్మ పడక గది. రెండో గదిలో గీత సంగీత సాధన చేసుకుంటుంది, మూడోది వంటిల్లు. ఇటుపక్క రెండు గదుల్లో ఒకటి అమ్మాయిల పడక గదిగా ఉపయోగపడుతున్నది. రెండోది బాత్ రూం.

ఇంట్లో సామాన్లు అట్టే లేకపోయినా ఉన్నవి ఖరీదైనవి, అందమైనవి. గీత పాడుకునే గదిలో అయిదడుగుల ఎత్తు గాడ్రెజ్ బీరువాను అందంగా అమర్చారు, కాస్త దూరంలో రెండు, మూడు తోలు పెట్టెలు మరో రెండు మూడు ట్రంకు పెట్టెలు, ఇతర చిల్లర మల్లర సామాన్లు ఉన్నాయి. జానకమ్మ పడుకున్న గదిలో కూడా ఏవో కాసిని సామాన్లు ఉన్నాయి. జానకమ్మ, రామయ్యగారు తప్ప పిల్లలెవరూ మంచాల మీద పడుకోరు. అందుకే మంచాల సంఖ్య రెండుకు మించి పెరగలేదు.



# కళ



మందరపు లలిత

ఇంత లావు, అంత పొడుగు ఉన్నా జానకమ్మ ఎప్పుడూ ఏదో ఒక జబ్బుతో బాధ పడుతూనే ఉంటుంది. ఓపిక ఉన్ననాడు ఇంట్లో పని చూసు కుంటుంది. లేనినాడు మంచాన్ని అంటిపెట్టు కుంటుంది. ఆ సమయంలో శారద తప్ప మరె వ్వరూ వంటింటి ఛాయలకైనా పోరు. ఈ రోజు కూడా శారద వంటింట్లో కూర్చుని వంకాయలు తరుగుతున్నది. ఒక మూల రెండు ఇత్తడి బిందెల నిండా మంచి నీళ్లున్నాయి. వంట చేసుకోవడానికి ఎత్తుగా, అరుగు లాంటిది కట్టారు. దాని మీద ఒక వేపున స్టీలు గిన్నెలు, రెండు, మూడు ఇత్తడి గిన్నెలు తళతళా మెరిసిపోతూ ఉన్నాయి. ఇంకో వేపున పోపుల డబ్బాలను పేర్చారు. స్టౌ మీద వంట కాబట్టి వంటిల్లు మసి చూరి శిథిలమై పోలేదు. మిగతా అన్ని గదుల మాదిరిగానే వంటిల్లు కూడా తెల్లని గోడలతో నీటుగా ఉన్నది.

జానకమ్మ గదిలో నుంచి సూటిగా వంటిల్లు కనబడుతుంది. శారద ఒక్కతే పని చేసుకోవటం చేసి జానకమ్మ జాలి పడింది. అందుకే కళను కేకేసింది.

కళ నవల మీది నుంచి చూపులు మళ్లించి దురుసుగా అన్నది.

"అబ్బ ! నేను చెయ్యలేను బాబు ! కాలేజీ పరీక్షలు వదిలాయనుకుంటే మళ్లా తీరిక లేకుండా ఇంటెడు చాకిరీ చేస్తానే కాని నీకు తృప్తిగా ఉండదు కాబోలు ! కాలేజీలో చేసి చేసి అలసి పోయాము. ఇంకా ఇక్కడెవరు చేస్తారు ? "

తల్లికి నడుం పడుతున్న గీత " అవునే అమ్మా ! అది కాలేజీలో అయితే మసి గిన్నెల దగ్గర్నించి తోమగలదు కాని ఇంట్లో ఇటు పుల్ల తీసి అటు వెయ్యలేదు. వంట చేత కాదు కాని చూడబోతే 'హోం సైన్సు' వెలగ బెట్టింది ! " అంది హేళనగా నవ్వుతూ.

కళకు కోపం వచ్చింది.

" గీతా ! మాటలు తిన్నగా రానియ్ ! వంట చేతగాని దెవరికి ? చెయ్యనన్నాను కాని చేతకాద న్నానా ? "

" ఎందుకు చేత కాదు ? అమ్మా, శారద వూరి కెళ్లినప్పుడు నీ వంట రుచి చూపించావుగా అమ్మా ! నువ్వూరి కెళ్లటం కాదు కాని ఆ నాలుగు రోజులు మాకు ఉపవాసమే ! "

" అప్పుడా ? అప్పుడు నాకు కొత్త .... కాలే జీలో అప్పుడే నేర్పారు. ఏ మాత్రం ప్రాక్టీస్ లేకుండా నువ్వు మాత్రం చేయ గలవా ఏమిటి ? ఇప్పుడు చూసుకో! ఎప్పుడూ నాదే ఫస్టు మార్కు, 60%కు తక్కువన్న మాట లేదు. మా మిస్‌కు నేనంటే చాలా ఇష్టం. అంతా నాకు ఫస్టు క్లాసు వస్తుందనుకుంటున్నారు. కూడా ! " అంది కళ. గర్వంగా చూస్తూ.

" భేష్ ! నీకే అరవై మార్కులొస్తే శారదకు నూటికి నూరూ ఇవ్వచ్చు అది కాలేజీలో నేర్చు కున్నదా ఏమన్నానా ? శాస్త్రోక్తంగా నేర్చుకుని ఇది చేస్తున్నదిగా చూడాలి. ? అంతోటి వంటకు బ్రహ్మాండంగా మార్కులొకటి ! "

కళ ఉక్రోషం పట్టలేక పుస్తకం మూసేసి, జానకమ్మ దగ్గర కెళ్లింది. సన్నగాపొడుగ్గా, అందంగా కనబడే కళ ముఖంలో కోపం చిందులు త్రొక్కింది.

గీతను చుర చురా చూస్తూ " దాని కంటే చదువూ సంధ్యాలేదు. ఇరవై నాలుగ్గంటలూ వంటిం టినే వేళ్లాడుతుంది. అది చేయటం ఏం గొప్ప ? " అంది.

గీత వెక్కిరింతగా మూతి తిప్పింది.

" అవునే అదేం గొప్ప ? వంట గురించి బోలెడు పుస్తకాలు చదివి వంటింట్లో ఎలా తంటాలు పడాలో తెలియక దిక్కులు చూడ్డం గొప్ప కాని ! "

గీత నవ్వుతూ ఉంటే రెండు బుగ్గలూ సొట్టలు పడ్డాయి. కవల పిల్లలు కావటం చేత కాబోలు కళ, గీత ఒకే పోలికన ఉంటారు.

" చాల్లేవే గీతా ! అక్కడికి నీ గ్రూపేదో గొప్పదైనట్టు ఎందుకొచ్చిన మిడిసి పాటు ! అసలు నీ చదువు ఎందుకు పని కొచ్చినట్టు ? . . . . దీని డాబులన్నీ నా దగ్గరే ! సంగీతం వాళ్లని మిగతా స్టూడెంట్సు ఎంత చులకనగా చూస్తారో నాకు తెలియదను కున్నది పాపం ! "

కోపంతో వూగి పోయేసరికి కళ నెత్తి మీది కుండ కాస్తా పగిలింది. కాస్తా ? బ్రహ్మాండంగా పగిలింది. ఆడవాళ్ళెప్పుడూ నెత్తిన ఒక నీళ్ల కుండ పెట్టుకుని తిరుగు తుంటారు. ఎందుకో మరి !

రామయ్యగారు ఎవరో అబ్బాయిని వెంటేసు కుని ఇంటి కొచ్చారు. కాస్సేపయ్యాక " కళా ! "

# అయిదు రేళ్ళు

అంటూ కేకేశారు. కళ ఏమిటి చెంగుతో కన్నీళ్ళు తుడుచుకుని కోపంగా మాట్లాడకుండా కూర్చున్నది. పగిలిన కుండ గమ్మత్తుగా అతుక్కొపోలికిన నీళ్ల సన్నిటినీ నింపుకుని మళ్ళా నెత్తి నెక్కి కూర్చున్నది. ఆడవాళ్ల కంతే! నెత్తి మీద కుండ ఇంతలోనే పగులుతుంది. అంతలోనే మళ్ళా నెత్తి నెక్కుతుంది.

చూసి చూసి రామయ్యగారే లోపలి కొచ్చారు.

"పిలిస్తే ఒక్కరూ ఉలకరు, పలకరు ఏమొచ్చిందర్రా?" అన్నారు విసుక్కుంటూ.

"కళనేగా పిలిచారు? ఒకర్ని పిలిస్తే మరొకరు పరుగెత్తుకుంటూ రావాలా?" అంది గీత.

ఈలోగా ఆయన కళ ముఖం చూసి సంగతంతా ఆకళింపు చేసుకొన్నారు.

"మళ్ళా తగువులాడు కున్నారా? ఇంకా చిన్న పిల్లల్లా ఏమిటర్రా ఏడుపులూ మీరూను?" అంటూ జానకమ్మ వైపు తిరిగి "నా స్నేహితుడు రాఘవయ్య లేడూ — అతని కొడుకు సుధాకర్ మద్రాసు చూద్దామని వచ్చాడు. రెండు రోజుల పాటు మనింట్లోనే ఉంటాడు. వాడి ఆలనా పాలనా జాగ్రత్తగా చూసుకోండి." అన్నారు.

తర్వాత అమ్మాయిల కేసి చూసి "ఎప్పుడనగా తిన్నాడో తిండి! వాడికి కాస్త కాఫీ, టిఫిన్ తయారు చేసి తీసుకు రండి!" అని వెళ్ళబోతూ మళ్ళా ఆగి "వాడి కొక్కడికే అనుకునేరు? ఆ చేత్తోనే నాక్కూడా తీసుకురండి!" అని నిష్క్రమించారు.

జానకమ్మ అమ్మాయి లిద్దర్నీ చెరొక రెండు, మొత్తం నాలుగు చీవాట్లు వేసింది.

"వెధవ కుక్క జట్టీలూ మీరూను! ఇంక లేచి వంటింట్లోకి నడవండి. గీతా! నీకెన్నిసార్లు చెప్పినా బుద్ధి లేదు! దాని జోలి, దాని చదువు జోలి నీ కెందుకే? . . . . . . . నీకంటే చిన్నది కదా, అదొక మాటంటే పట్టుకుని రాద్ధాంతం చెయ్యాలటే కళా? చంటి పిల్లలా ఏడ్వాలా?"

"చీటికీ మాటికీ పెద్ద దాన్నంటావ్! ఎంత పెద్దదాన్నేమిటి? దానికంటే ఒక గంట ముందు పుట్టానో, లేదో ఎంతో తేడా ఉన్నట్టు మాట్లాడతావు? అన్నిటికీ దాన్ని వెనకేసుకుని వస్తావు —" అంటూ కళ అక్కడి నుంచి కదిలింది. గీత కూడా కదిలింది.

ఇద్దరూ వంటింట్లోకెళ్ళి, ఎడ ముఖం, పెడ ముఖంగా కూర్చున్నారు. ఏదో తగువులాడుకుంటున్నట్టు వినిపించింది కాని దేనికోసమో శారదకు బోధపడలేదు.

"ఏం? అలా ఉన్నారేం?" అనడిగింది.

"నీ గురించేలే తగువు వచ్చింది. నీకు వంట బాగా చేతొచ్చు అని నేనంటే తనకే బాగా వచ్చుని కళ కోతలు! పైగా నీకు చదువు సంధ్యా లేదట...."

శారద వంకాయలు తరగటం పూర్తిచేసి కత్తిపీటను వాల్చి ఓ పక్కగా పెట్టింది. వంకాయలు తరిగిన స్టీలు గిన్నెకు పళ్ళెం తెచ్చి మూతపెడుతూ "నిన్ననేగా నేనువండిన అరటికాయ కూర 'రుచీ పచీ' లేదని అంతా అలా పట్టుకెళ్ళి వీధిలో పారేసొచ్చావ్?" అంది.

కళ ఆశ్చర్యంగా చూసింది.

43 వ పేజీ చూడండి.




మధ్యాహ్నం, రేడియో 'వివిధ భారతి' ఆగి పోయింది. దాని ముందు నుంచి లేచి ఒకసారి ఒళ్ళు విరుచుకున్నాను. ఇంగ్లీషు సినిమా ఏదైనా ఉంటే పోదామనుకున్నాను గానీ యేమీ లేక పోవడంతో ఆ ఆలోచనకు స్వస్తి చెప్పి, ఏదన్నా కథ రాద్దా మను కుని కాయితాలు ముందు వడేసుక్కూర్చున్నాను. కథా వస్తువులేం తట్టకపోవడంతో 'కాఫీ చేయ' మని ఒక్క కేక పెట్టాను. అమ్మ కాఫీ తెచ్చే దాకా ఆలోచిస్తూనే ఉన్నాను. ఆలోచన ఒక్కటీ నిలకడగా కుదరడం లేదు. ఒక్కక్షణం ఒక దాని గురించి ఆలోచిస్తే, మరో క్షణంలో ఇంకో విష యం మీదికి మారిపోతుంది. రెండో కప్పు కాఫీ కూడా ఖాళీ చేశాను. పక్కపాడి నోట్లో వేసుకుని టేబిల్ ఫాన్ 'ఆన్' చేసి పడుకుని, మా కాంపౌండ్ గేట్ వైపు చూస్తూ ఆలోచన ప్రారంభించాను.

కునుకు పట్టబోతుండగా "సార్" అనే కేక వినిపించింది. నేను పట్టించుకోలేదు. మళ్ళీ "సార్.. సార్...." అని ఆ సుదీర్ఘమైన కేకలు వినిపించ సాగాయి. విసుగుతో కళ్ళు తెరిచాను.

దెబ్బతో మత్తు వదిలింది.

ఎదురుగా గ్లాస్కో పంచే, సిల్కు జుబ్బాలలో మా 'కరక్కాయ పంతులు' ప్రత్యక్షం ! 'చచ్చాన్రా భగవంతుడా' అనుకోకుండా ఉండలేక పోయాను !

ఇప్పుడు ఆయన్ని పరిచయం చెయ్యడం ఎంతైనా అవసరం ! ఆయన అసలు పేరేమిటో గానీ, ఎవ్వరూ ఆ పేరు ఉపయోగించగా విన్లేదు నేను. ఆయనా మాలాగే వూరికి కొత్తవాడు. చూడడానికి చాలా వింతగా ఉంటాడు. కలుపుగోలు మనిషి. కొత్తా పాతా లేకుండా అందరితోనూ సరదాగా మాట్లాడ గలడతను. కానీ ఒక్కటే చిక్కాయ నతో ఎదుటి మనిషి తన మాటలంటే సుముఖంగా ఉన్నాడా, విసుగుతో చస్తున్నాడా అనేదృష్టి ఆయనకు అసలు ఉండదు ! అలాగని అతణ్ని ఆ అమాయకుడని అనగలమా ?. . . . చెప్పలేం.

ఆయన పూర్వాశ్రమంలో రాజకీయాలలో పాల్గొని శ్రీ కృష్ణ జన్మస్థానాన్ని దర్శించి ఉండ వచ్చునని మా తమ్ముడి అభిప్రాయం ! లేక పోతే— ఏ విషయమిమ్మాటైనా అంత ధాటిగా (ఒక్క చుక్క సారం లేకుండా అనేది ముఖ్యం !) ఉపన్యాసం దంచ గలడా ?

"నాన్నగారున్నారాబ్బాయ్ !" అనడిగాడు— నన్ను తన గురించి ఇక రాయడానికి అవకాశ మివ్వ కుండా.

ఒక్కసారి ఉలిక్కిపడి— 'లేరండీ' ! అన్నాను. నిజానికి నాన్నగారు మేడమీద పడుకొని నిద్ర పోతున్నారు అసలే ఆయన రెండు వేల మంది విద్యా ర్థుల ఫలితాలు విన్నసే ప్రకటించడంలో బాగా అలసి పోయారు. ఇవాళయినా కాస్త తెరిపి ఇస్తే మంచి దని తడుముకోకుండా అబద్ధ మాడేశాను. అదీ కాక ఆయన నిన్నటి వరకూ పడ్డ అవస్థంతా ఒక యెత్తూ, కరక్కాయ పంతులుతో ఇక మాట్లాడడం ఒక యెత్తూను.

"ఎక్కడికి కెళ్ళారు ?"

"తెలీదండి !"

"అయినా ఇంత యెండలో యెక్కడికోయ్ ? ఎంత హెడ్మాస్టరు గిరీ అయినా అంత అవసరం ఉంటుందా ?.... పోనీ, యెంత సేపట్లో వస్తారం టావ్ ?" అన్నాడు పంతులు.

"అదీ చెప్పలేనండి !" అన్నాను ఎలాగైనా ఇతణ్ని సాగనంపుదామని. కానీ కరక్కాయ పంతు లేం తక్కువ తిన్న వాడు కాదు. ఉసూరుమని నిట్టూర్చి "వెధవ యెండ !" అని తనలో తను గొణుక్కుంటూ వరండాలో ఉన్న పడక్కుర్చీలో కూలబడ్డాడు. "హతవిధీ" అనుకుంటూ, ఆయన మంచినీళ్ళు అడక్కుండానే, ఒక మరచెంబెడు నీళ్ళూ, ఓ స్టీలు గ్లాసూ ఆయన పక్కనే, పెట్టాను. నేను లోపలికెళ్ళి కూర్చున్నాను.

అంతలో ఆయన— "అబ్బాయ్, ఓ మాటిటు వస్తావ్ ?" అన్నాడు.

ఒక్కసారి నిట్టూర్చి ఆయన కెదురుగా వెళ్ళి నిలబడ్డాను.

"ఎంత హాయిగా ఉందోయ్ ఈ పడక్కుర్చీలో? పాతకాలందైనా చాలా బావుంది ! నువ్ నమ్మవ్ గానీ ఎంత అనుకూలంగా ఉందనుకున్నావ్ ?.... నాన్నగారికి కుర్చీ అంటే చాలా ఇష్టమనుకుంటా! అయినా హెడ్మాస్టరు దర్జాకిలాంటి చోటుండా లోయ్ ?...." ఆయన పడక్కుర్చీలో తాపీగా కాళ్ళు చాపి, ముందుకూ వెనక్కీ వూగుతూ మాటాడుతున్నాడు.

"ఇది చెప్పడానికా పిల్చాడు ?" అని తిట్టు కున్నాను లోలోన.

"అబ్బాయ్ ! కాసిని మంచినీళ్ళు తెచ్చిపెడతావ్ ?"

"తెచ్చి మీ పక్కనే పెట్టాను కదండీ !" అనబోతుండగా 'భళ్ళున' నవ్వాడాయన.

"మరచెంబు నీళ్ళా? ఏ మూలకోయ్ ? !" అన్నాడు బొజ్జ తడుముకుంటూ.

అంతవరకూ మరచెంబు వైపు చూళ్ళేదు నేను. చూడగానే ఆశ్చర్యంతో అలాగే ఉండి పోయాను. ఆ మరచెంబులో ఒక్క చుక్క నీరు మిగిలి ఉంటే ఒట్టు !

ఏం జేస్తాను, మళ్ళీ ఇంకో చెంబుడు నీళ్ళు తెచ్చి పెట్టాను.

"ఇప్పుడప్పుడే దారంటున్నావ్ కదా ?.... అంత దూరం.... పాత టౌను నుంచి కాళ్ళీడ్చుకుంటూ వచ్చానే ?.... ఎలాబ్బా ?" అన్నాడు. నేనప్పుడే గ్రహించాను. పంతులు కాఫీ టిఫిన్లకు ప్లాను వేస్తున్నాడని. ఓ పత్రికను తీసుకు వచ్చి ఆయన (మొహాన)కి పడేసి, లోపలికి వెళ్ళి కూర్చున్నాను. అంతలో వంటింట్లోంచి కమ్మగా పకోడీల వాసన రావడం మొదలయింది. అందాకా పత్రికను తిరగే స్తున్న పంతులు గభుక్కున దాన్ని మూసేసి నోరు చప్పరిస్తూ ఆ పత్రికను విసనకర్రగా చేసుకున్నాడు. "పాపం" అనుకున్నాను· నిజం చెప్పాలంటే నాకూ నోరూరుతోంది !.... మళ్ళీ కథకు 'ప్లాను' ఆలో చించడం మొదలెట్టా. పంతులెంత తొందరగా వెళ్ళిపోతాడా ? అన్న ఆలోచనే గానీ మరో ఆలోచన నా మనస్సు దరిదాపులకు కూడా రావడం లేదు. ఆయనకు కనిపించకుండా కూర్చుని కిటికీలోంచి బైటకు చూస్తూ మళ్ళీ ఆలోచించడం ప్రారం భించాను.... ఎప్పుడూ అబ్బాయిలూ, అమ్మా యిలూ వాళ్ళ ప్రేమాయణాలూ లేకుండా కథా వస్తువులు దొరకడం లేదు. అలాంటి ప్రేమా యణ గాథలు రాయడం నా కిష్టం లేదు. కొత్త రకం ప్లాను కోసం చూస్తున్న నాకు అలాటిం కథా వస్తువులు దొరికే సూచనలు కనిపించడం లేదు !....

ఉన్నట్టుండి మా కాంపౌండు గేటు ఓమాటు తెరుచుకున్న చప్పుడు వినిపించింది. అటు చూశాను. ఎవరో ఒక గళ్ళ షర్టాయన చకచకా నడుస్తూ వచ్చి, 'అటెన్షన్' పోజులో నిల్చుని పంతులు గారికి ఒక సెల్యూటు పారేశాడు. పంతులు ఆశ్చర్యంతో కళ్లప్పగించాడు. బహుశా తన మొహానికి సెల్యూట్ చేసేవాడొకాడా అనికాబోలు ఆయన ఆశ్చర్యం ! గళ్ళషర్టు శాల్తీ పంతుల్నే హెడ్మాష్టరనుకున్న ట్టుంది. పంతులు అది గ్రహించినవాడై, ఇంట్లో పలికే మాట, చూశాడు. అంతలో నే నతనికి కనిపించకుండా సర్దుకు్కూర్చున్నాను.

ఎవరూ కనిపించక పోవడాన్నిమో— ధైర్యంగా ఓ మాటు గొంతు సవరించుకొన్నాడు.

"ఏం కావాలండీ !" అని తనే హెడ్మాష్టు

లయినట్టు గంభీరంగా అడిగాడు ఆ వచ్చిన వ్యక్తిని. అతణ్ని కూర్చోమని కూడా చెప్పలేదు?

"మా అబ్బాయి విత్ హెల్డయ్యాడు! అంటే ...." చెప్పబోయాడతను.

పంతులికి హఠాత్తుగా కోపం వచ్చేసింది.

"అయ్యా, 'విత్‌హెల్డంటే' — మీ అబ్బాయి గారు బడికి సున్న చుట్టాడూ క్లాసులకు ఎగనామం పెట్టాడూ— అని" గట్టిగా అరిచాడు పంతులు.

అదిరి పడ్డాడా వచ్చినాయన. తమాయించుకొని—

"దాన్ని సవరించడానికేదేనా మార్గముందంటారా సార్!" అని అడిగాడు.

"మార్గమా ?.... ఏ మార్గమూ లేదు. ఈ తెలివి మీకు ముందరే ఉండాలి. కుర్రాడు సోమరిపోతై, గడుగ్గాయి ఐ బడి ఎగగొడ్తున్నప్పుడు శ్రద్ధ తీసుకోరు! తీరా వాళ్లు 'విత్‌హెల్డ' అయ్యాక దాపురిస్తారు మా ప్రాణాలకు! ఛీఛీ... ఏం మనుష్యులో ? !...." పంతులు విసుగుదలా, కోపమూ తార స్థాయినందుకొన్నాయి.

"అది కాదండీ!...." ఆయనేదో చెప్పబోయాడు గానీ పంతులది వినిపించుకొనే ధోరణిలో లేదు.

"ఏది కాదండీ ? మూణ్నెళ్ల పరీక్షలప్పుడు, అర్ధ సంవత్సరం పరీక్షలప్పుడూ ప్రోగ్రెస్ రిపోర్టులో ఎటెండెన్సు తెలపడం లేదా ? అప్పుడు మీరేం చేస్తున్నట్టు ? అంతా అయ్యాగ్గానీ అవతరించరు!.... ఇప్పుడో డాక్టరు సర్టిఫికేట్ తేవాలా? అదొచ్చాక దాన్ని మరో ఇలాంటి పది కాసుల్తో కలిపి డీఈఓ గారికి పంపాలా ? పంపేప్పుడు దాంతో పాటు లేనిపోని ఇంత రిపోర్టొకటి వెలిగించాలా ?... అబ్బబ్బబ్బబ్బా!.... తల్లి తండ్రులు జాగ్రత్త తీసుకోక పోవడం ఈ వూళ్లో మరీ యెక్కువగా ఉంది!"

"నా మాటల కాస్త వింటారా మాష్టారూ?" —ఇక లాభం లేదని గ్రహించిన గళ్ళ చొక్కా పెద్ద మనిషి వినుగ్గా అన్నాడు— "మాకు కర్నూలు నుంచి ఇక్కడకు బదిలీ అయింది. మూణ్నెల్ల పరీక్షలూ అర్ధసంవత్సరం పరీక్షలూ అక్కడే రాశాడు. అందువల్ల మీ గుమాస్తాకు చెబితే ఆ స్కూలు నుంచి పై రెండు పరీక్షల మార్కులూ తెప్పించుకునేటప్పుడు అటెండెన్సు కూడా తెప్పిస్తామన్నారు!" అర్థమైందిటోయ్ పంతులూ— అన్నట్టు మొహం పెట్టాడు.

వెలక్కాయ అడ్డుపడింది పంతులు ధోరణికి. అయినా— "ఆ మాట మొదటే యెందుకు చెప్పలేదండీ ?" అన్నాడు.

"మీరు వినిపించుకొంటే కదండీ!"

పంతులికి మళ్లీ ఎక్కళ్లేని కోపమూ ఉక్రోషమూ వచ్చింది. "నేనటయ్యా వినిపించుకోంది ? అప్పణ్నుంచీ పత్రికన్నా ముట్టకుండా నీ గోడే పట్టించుకొన్నానే ?... పూఁ సర్లే! బడి తెరిచాకరా! ఆ స్కూలు నుంచి 'డేస్' తెప్పించి అలాగే వేద్దాం!" కనీస మర్యాదైన బహువచన ప్రయోగం కూడా మర్చిపోయాడు పంతులు కోపంలో.

"అయితే మా వాడు ప్యాసయినట్టే నాండీ ?"

"బాబోయ్! మీకు చెప్పలేక చస్తున్నాను. 'విత్ హెల్డంటే' త్రిశంకు స్వర్గం లాంటిది! అటూ కాదు ఇటూ కాదు! స్కూలు తెరిచాక అన్నీ తెలుస్తాయి ?"

అతగాడు "అలాగేసార్"! అంటూ ఓ సెల్యూట్ పారేసి, ఎన్సీసీ వాడిలా నడుస్తూ కాంపౌండు గేటు వెయ్యకుండానే వెళ్లిపోయాడు.

కరక్కాయ పంతులు మళ్లీ లోనికో మాటు చూసి, గంభీరంగా మీసం మీద చెయ్యి వేసుకుని దరహాసం చిందించాడు. నాకు పెద్దగా, హాయిగా నవ్వాలనిపించింది. కానీ బావుండదని నాలో నేనే చిన్నగా నవ్వుకున్నాను.

అంతలో— బిగుతు పైజామా, వదులు, షేర్వాని తొడుక్కుని తలమీదాక నల్లటి కుచ్చుగల ఎర్రటోపీ పెట్టుకుని హుందాగా ఉన్న ఒక గడ్డపు సాయిబు ప్రవేశించాడు.

పంతులు ప్రశ్నార్థంగా మొహం పెట్టాడు.

"సలామలేకుమ్! సలామలేకుమ్!...." అన్నాడా సాయిబుగారు.

"ఏం కావాలి ?"

"ఏం లేదూ సాబ్! మా కుర్రవాడు సెకండ్ ఫారం చదువుతున్నాడు. వాడి రిజల్టు నా కర్మం గానడం లేదు."

"మీరంటున్న దేమిటో నా కర్థం కావడంలేదు. రిజల్టర్థం కాక పోవడమేమిటండీ ?" ఆశ్చర్యం ప్రకటించాడు పంతులు.

"మా వాడి క్లాసులో ఇద్దరు హుసేన్లున్నారు సాబ్! అందులో ఒకడు పాస్ ఒకడు ఫేల్!.... అందుకని...." ఆగిపోయాడు ఆ సాయిబు పంతులు 'పోజు' చూసి.

"బావుందయ్యా! నన్ను పైళ్లు తిరగెయ్యమన్నావా? నేనేమన్నా క్లర్కు ననుకున్నావటయ్యా? అయినా హుసేన్లు ఇద్దరున్నప్పుడు మీ వాడికి హుస్సేన్‌ఖాన్ అనో, సయ్యద్ హుసేన్ అనో, హుసేన్ భాషా అనో,— ఇవేవీ దొరక్కపోతే హుసేన్ శాస్త్రి అనో శర్మ! అనో తగిలించెయ్యకూడదటయ్యా ? ప్రతి దానికీ ఇలా గొడవ చేస్తే యెలా ?

"ఆ పనివాళ్లే చెయ్యగూడదా సాబ్ ?" అన్నాడు సాయిబు తన తప్పేం లేనట్టు.



"మీకెంతగా ఈ విషయం పట్టిందో వాళ్లకీ అంతే పట్టింది! పరేగానీ మీ వాడికీ తెలిదా తన పేరెవరి పేరు ర్యాంత వస్తుందో ? అటెండెన్సు నెంబర్లు కూడా వేశారు కదటయ్యా ?" తీక్షణంగా చూశాడు పంతులు.

"అదంతా మాకెలా తెలుస్తుంది సాబ్? మీరెలాగన్నా మా వాడు ప్యాసయ్యేట్టు చూడాలి. ఒక వేళ మా వాడే ఫేలయి ఉంటే వీడి పేరునీ ఆ హుసేన్‌గాడి పేరుతో బదలాయించండి! .... ఎంత డబ్బు ఖర్చయినా ఫర్వాలేదు ?" అంటూ జేబులోంచి కొన్ని కొత్త పచ్చనోట్లు బైటకు తీసి చూపించాడు.

దాంతో అదిరి పడ్డాడు పంతులు, నిలువెల్లా వణికి పోయాడు, "సాయిబూ! నువ్విక్కణ్ణుంచి వెడతావా ? పోకిర్లి కేకేయమన్నావా ?" అని గట్టిగా అరిచాడు.

సాయిబు బైటకు ఉడాయించేశాడు.

నాన్నగారు గనక మేల్కొని ఉన్నట్టయితే ఆ సాయిబుగాడి తిక్క వినిగేదే! తప్పించుకొన్నాడు లక్కీ ఫెలో!.... మనసారా నవ్వుకొన్నాను.

పంతులొకమాటు అతిభారంగా నిట్టూర్చి, విజయగర్వంతో మొహం కళకళ లాడగా, హెడ్ మాస్టరు దర్జా ఉట్టి పడేట్టు కాళ్లు జాపి పడుకున్నాడు— పడక్కుర్చీలో. "ఇంకా టిఫిన్ రాలేదే ? ఇంకా నాలుక్కాలేదా ?" అని తనకు సంక్రమించిన తాతల నాటి గడియారాన్ని కోటు జేబులోంచి బైటకు తీశాడు. అంతలో— అది రోజుకు రెండుసార్లే సరియైన టయిము చూపించ గలదని స్ఫురణకు వచ్చి మళ్లీ లోపలకు నెట్టేశాడు. పత్రిక తెరిచాడు. అప్పుడప్పుడూ చూపరిసైన నాకు వింత గొలిపేట్టు 'భళ్లు భళ్లు'న నవ్వేస్తున్నాడు. "కార్టూన్లు చూచి కాబోలు— సెన్సాఫ్ హ్యూమరుండే మనిషికి ? ?" అనుకున్నాను—

పది నిముషాలు గడిచాయో లేదో— వీధిలో సందడి వినిపించింది. ఏమిటూ అని చూద్దును గదా!— చిన్న సైజు దొడ్డు దొరలాంటి ఓ (అ)పూర్వ మనాసిని అడ్డంగా గేటులోకి



సౌందర్యోన్నతిని
పొందండి, ముగ్ధపరచే

# బిన్నీవారి అచ్చమైన శిల్కు చీరలలో

జార్జెట్, చిఫాన్ మరియు మెత్తని శిల్కులలో తయారైనాయి. మా తిరుగు మరుగు కట్టగల మరియు షాట్ శిల్కు చీరలను అడగండి.




ది బెంగుళూరు ఉల్లెన్, కాటన్ & శిల్కు మిల్సు కంపెనీ లిమిటెడ్
అగ్రహారంరోడ్డు, బెంగుళూరు 23
బిన్నీ & కంపెనీ లిమిటెడ్, మద్రాసు వారి అంగ సంస్థ

# బిన్నీ

JWT/BM/SS/2713

# విక్రమార్క సింహాసనం

మారడానికి తెవన్న వేడుతూ చివరికి గేటు గుర్రం వారి చేసుకుని, తనవెంట ఒక పది పన్నెండేళ్ళ కుర్రాణ్ని బరబరా ఈడ్చుకొంటూ వచ్చి, పంతులు కుర్చీకి నాలుగడుగుల యెడంగా నేలమీద చతికిల బడింది.

అందాకా పంతులు వింతగా చూస్తుండి పోయాడు. నోట మాట రాలేదు. ఆమెను చూసి కొస్త జంకినట్టు కనిపించాడు. ఇంకా 'సంగతేమి' టని అడక్కముందే బొడ్లోంచి ఒక కాయితపు పొట్లం తీసి— "ఇంద నాయనా.... తిరుపతి ప్రసాదం !" అని పంతులికి సమర్పించుకొంది. పంతులామె వైపోకసారి చూసి యేమీ మాట్లాడకుండా ఆ పొట్లంలోంచి ఓ చిన్న (!!!) లడ్డును నోటి కెత్తాడు !.... "ప్" అని నా దురదృష్టాన్ని నిందించుకొన్నాను.

పంతులు లడ్డును నోటో పెట్టుకోడంతోటే, ఆవిడ ముక్కు మీద వేలేసుకుని, నోటిని సాగదీసి— "హవ్వ !.... ఇదేం అన్యాయమండీ ?" అంటూ రాగాలాపన మొదలెట్టింది.

నేనూ ఉలిక్కి పడ్డాను. "పొరబాటున ప్రసాదం కళ్ళకద్దుకుని తినలేదు గాబోలు ?" అనుకున్నాను.

పంతులు గొంతులోని లడ్డు నోట్లోకి వచ్చేసింది. పెంకులున్నాయా లేదా అన్నట్టు అనుమానంగా పైకొక మాటు చూసి, గభాలున లడ్డును కాస్తా మింగేసి,—"ఇంతకీ యేమిటమ్మా సంగతి!" అని ప్రశ్నించాడు.

"జరిగి జరిగి ఇలాంటిది ముత్యాల్లాంటి నా ముగ్గురు మనమలకే జరగాలా నాయనా !.... ఇదేం కలికాలం రోయ్ భగవంతుడా ?.... నా మనవళ్లకే ఇలా అయిందేమిట్రోయ్ !" అంది శోకాలు తీస్తూ లేని కన్నీళ్లను వత్తుకొంటూ.

"ఏమైందమ్మా నీ మనవళ్లకూ ?" హడలి పోయిన పంతులు ఇంట్లోపలికి చూస్తూ అడిగాడు.

"అదేమిటో నాయనా ! వాళ్ల ముగ్గురికీ '(ప్రొమొటెడ్)—'ప్రొయినా' అని బోర్డు మీద వేశారుట. పాసని గానీ ఫేలనిగానీ వెయ్యలేదుట !"

"ఏమిటమ్మా ఏమని వేశారూ ?" అన్నాడు పంతులు ఆశ్చర్యంగా.

నిజానికి నాకూ అర్థం కాలేదు అదేమిటో ! బిడియం లేకుండా చెప్పొద్దూ !

"అదేదో ప్రొయినో, మొయినో అన్నాడమ్మా మా చిట్టి బాబు !"

"ఓ.... డిటెయిన్డా!" కనిపెట్టేశాడు పంతులు. నిజంగా అతన్ని మనసులోనే అభినందించాను అంత సులభంగా కనుక్కున్నందుకు.

"అవున్నాయనౌన్నాయన ! అదేదో కాస్త చూడు. పెద్ద ముండని... అలా అంటే ఏమయినట్టు నాయనా ?"

"డిటెయిన్డంటే ఫెయిలేనమ్మా !"

"ఆఁ !" అంటూ విస్తుబోయిందావిడ.

"ఆదేవిట్నాయనా ? టెయినా అని బోర్డు మీద వేసి ఫెయిలంటావా ? ఇదేం అన్యాయం తండ్రీ, ఎప్పుడూ విన్నైనా లేదు ! ఫెయిలయి ఉంటే లక్షణంగా ఫెయిలూ అని రాయక ట్రెయినా అని యెందుకు రాశారంట !.... .... అంటే నా ముగ్గురు మనవలూ ఫెయిలయినట్టేనా. అవ్వ.. అవ్వ ! చచ్చేలా రాత్రి తొమ్మిదింటి దాకా కూలేసి చదివించేదాన్ని ! మీ స్కూలు మాస్టారి దగ్గరికే ప్రైవేటుకి పంపేదాన్నే ! దరిద్రుడు ! ఆ మేష్టరెలాంటి వాడూ ? లక్షణంగా ఏ వంకా లేకుండా నెల నెలా టంచన్‌గా నాలుగు నెల్లపాటు నా కష్టార్జితమైన కరుకు రూపాయలు ఇరవై ఇరవై తిన్నాడే ! వెధవ— నాలుగు మార్కులు వేయిద్దామన్న బుద్ధి ఉందీ ? విశ్వాస ఘాతకుడు... కానీ వాడిపని తర్వాత చెబుతా !.... చూణ్నాయనా! ఎలాగోలాగు మా వాళ్లను పాస్ చేయించండి ! దయచేసి !.... ఏదో పెద్దదాన్ని చెబుతున్నాను !.."!

"అదేమిటమ్మా— అలాగంటావ్ ? ఫెయిలయిన వాళ్ల నెవడన్నా పాస్ చేయించగలడా ?"

"నాయన్నాయనా— అలాగనకు ! హెడ్మాష్టరు పదవి అంటే యెంత గొప్పది !...." అంటూ చాలా పొగిడేసింది. పంతులు తైరుపడే అయిపోయాడు.

"నిజమే నమస్తే !.... కానీ ఇప్పుడేం చెయ్యలేనమ్మా !" అన్నాడు సానుభూతిగా. ఆవిడ పొగడటంతో ఆమె మీదేదో గౌరవ భావం ఉదయించినట్టుంది పంతులికి. ఆ భావం ఆ కంఠంలో స్పష్టంగా వినిపించింది నాకు. తను నిజంగా హెడ్మాష్టరే అయి ఉంటే తప్పకుండా ఏదో చేసేవాడేమో!

"కనీసం ఇద్దర్నన్నా పాస్ చేయించండి బాబూ! చంటాడు చూడండి యెంత ముద్దొస్తున్నాడో !" అంటూ వాణ్ని ముద్దు పెట్టేసుకుంది. ఆవిడకు అంత ముద్దొస్తున్నాడేమో గానీ పంతులికీ, నాకూ మాత్రం భయంవేసింది వాణ్ని చూడగానే పంతుల్నే కొట్టే వాడిలా కనిపించాడు.

"వీణ్ని చూసైనా ఏదో ఒకటి చేయించండి బాబూ ? మీకు నేను చెప్పేదాన్ని కాదు !.... ఎలాగైనా..." సాగదీసింది.

"ఇది మరీ బావుంది. ఫెయిలైన వాళ్లకేవడేం చేస్తాడమ్మా ! మీ రెవరైనా చెప్పండి ? కంఠ శోషే గానీ యేం లాభం లేదు !" పంతులు భయపడ్తూనే నిక్కచ్చిగా అనేశాడు.

"అలాంటే యెలా నాయనా !.... మన అమ్మడికి నిన్న అవగాయ వద్దు వద్దంటుంటే కూడా ఇచ్చావే ! మిమ్మల్నయితే చూశ్లేదు గాని అమ్మడు వాళ్లంటే నా కెంత అభిమానం !.... ఏం నాయనా కాస్త చూద్దూ !" బంకమన్నులా తయారయిందావిడ.

"లాభం లేదండీ బామ్మగారూ లాభం లేదు. ఫెయిలయిన వాళ్లను బ్రహ్మ కూడా పాస్ చేయిరాలేడు ? మార్కులు దిద్దడం వాడివల్ల కూడా కాదు. మీ రనవసరంగా శ్రమ పడుతున్నారు" పంతులు గట్టిగా అన్నాడు.

"పోనీ నాయనా, సెకండ్ లిస్టయినా ఉంటుందా ?"

"ఉండవమ్మా ఉండవ్— అలాంటి వెప్పుడూ జరగవ్ !"

"అదేవిట్నాయనా ! మా వాళ్లంతా పోయిన సంవత్సరం సెకండ్ లిస్టులోనేగా పాసయింది !"

"అలాంటివి జరగడానికిది పోయిన సంవత్సరం కాదు గదమ్మా !"

"ఏం చోద్యమో నాయనా. కనీసం మా వాడి మార్కులన్నా చూపిస్తావా ?"

"మార్కులు బడి తెరిచాక చెబుతారు బామ్మగారూ !"

"అదేవిట్నాయనా మరీ వింత !" అంటూ నోరు నొక్కుకుంది. "మా వాడి మార్కులు మేం జ్ఞాపకోడానికి బడితెరవాలా ? మార్కులన్నా తెలిస్తే యెందులో తక్కువచ్చాయో ఆ మాష్టర్ని పట్టుకుని దులుపుదును ?" అంటూ పంతుల్నే దులిపేలా తయారైందావిడ.

"బామ్మగారూ మీరిక వెళ్లి రేపు ఉదయం పదింటికి రండి. ఇక్కడికి కాదు. ఆఫీసుకి! ఇంట్లో ఆఫీసు ఫైళ్లుంచుకో కూడదు. అక్కడ క్లర్కు మీ క్కావలసిన విషయాలన్నీ చెబుతాడు. దయచేసి మీరు వెళ్లిరండి !" బతిమాల సాగాడు పంతులు.

"అంతేనంటారా ?" జాలిగా అడిగింది.

"అంతేనమ్మా అంతే! ఇక మీరు వెళ్లిరండి !" గేటువైపు చెయ్యి చూపించాడు.

ఆవిడ కోపంతో మండిపోతూ ఏదో గొణుక్కుంటూ ఎలాగో కష్టపడి వచ్చిన దార్నే తిరిగి వెళ్లిపోయింది. కుర్రాణ్ణి ఈడ్చుకుంటూ !

"హమ్మయ్య !"— కరక్కాయ పంతులు



# విక్రమార్క సింహాసనం

గట్టిగా నిట్టూర్చాడు.

నాకు నవ్వు వచ్చింది.

ఇంతలో నిట్టూర్పుల మీద నిట్టూర్పులు వినిపించ సాగాయి.

ఇక లాభం లేదనుకుని ఒక పెద్ద ప్లేటు నిండుగా పకోడీలు పట్టికెళ్లి ఆయన ముందుంచాను. అంతే ఇక నిట్టూర్పులు ఆగిపోయాయి. సావధానంగా తినడం సాగించాడు. అసలే ఆయన్ది భల్లూకప్పట్టని ప్రసిద్ధి. తిరుపతి నుంచి తెచ్చిన ఒక పెద్ద లడ్డును సైతం ఒక్కసారిగా నోట్లో కుక్కుకొని, ఒక్క గుటకలో మింగగల డంటారు. మీరు నమ్మకపోవచ్చు ? అంతటి అసాధారణ మానవు డాయన ! మొదటిసారిగా ఆయన పరిచయ భాగ్యం పొందిన నాడే ఈ పై విషయాలన్నీ గమనించి లోకులు చెప్పిన్దాన్లో యే మాత్రం అతిశయోక్తి లేదని గ్రహించి స్తంభించి పోయాను. తరువాత్తరువాత అలా ఆశ్చర్య పడడం మానుకున్నాము. 'కొత్తొక వింత !— పాతొక రోత ? ?' అని నానుడి. అది నిండు నిజం. వింత కలిగించే విషయం కొన్నాళ్లు పోయాక సర్వసాధారణ విషయం గానే కనిపిస్తుంది కదా !

అంతలో 'చింతామణి' తాలూకు సుబ్బిసెట్టి లాంటి మానవుడొకాయన 'బుడుగో బుడుగో' మంటూ వచ్చి, పంతులుకు కాస్త అవతలగా ఉన్న స్టూలును అతి కష్టమ్మీద వంగి పంతులు కెదురుగా లాక్కొని కూర్చున్నాడు.

"మీ కథేమిటండీ" అన్నాడు పంతులు— పకోడీల పళ్లెన్ని అతనికి కనిపించకుండా పడక్కుర్చీ కింద దాస్తూ.

"మీరు ఎనభై పర్సెంటు రిజల్ట్సు ఇచ్చారే ఇదేమన్నా బాగుందా ?" అచ్చు సుబ్బిసెట్టిలా అరిచాడాయన.

"ఏం ? ఎంతివ్వ మంటారేమిటి ? తొంభై పర్సెంటు ఇవ్వాలా— సెంట్ పర్సెంటివ్వాలా ?" కోపంగా మొహం పెట్టాడు పంతులు.

"అది కాదుసార్ ! ఎంతిచ్చినా యాభై అయిదూ, అరవై దాటగూడదూ !.... మా పిల్లకాయ స్టాండర్డు మాకు తెలీదంటారా ? 'ఓ' అంటే 'నా' రాదు వాడికి ! అలాంటి వాడు ఫస్టు ఫారం యెలా పాసయ్యాడు చెప్పండి !"

కాసేపటి వరకూ ఆశ్చర్యంలోంచి తేరుకోలేక పోయాడు పంతులు. (అఫ్ కోర్స్.... నేను కూడాననుకోండి!)

"ఇది మరీ ఆశ్చర్యంగా ఉంది. యెలా ఫెయిలయ్యామూ అని వచ్చిన వాళ్లున్నారు గానీ ఎలా ప్యాసయ్యామూ అని వచ్చిన వాళ్లంత వరకూ లేరు !" ఈ విషయం నమ్మలేనట్టు మొహం పెట్టాడు.

"అది గాదు మాస్టారూ ! ఇప్పుడో భవనం నిర్మిస్తున్నామనుకోండి. పునాదులు సరిగ్గా లేకపోతే అదెలా నిలబడుతుంది ? అలాగే లోయర్ ఫారాల్లో పునాది లేక పోతే ముందు ముందు కష్ట మవుతుంది. ఇప్పుడెలాగో కొట్టు కొచ్చా డనుకోండి. దయచేసి మళ్లీవాడు అదే క్లాసు చదివేలా చూడండి !

"ఏమిటీ ప్యాసయిన వాణ్ణి మళ్లీ ఫెయిలు చేయమంటారా ?" తన చెవులను తనే నమ్మలేక అడిగాడు పంతులు.

"అది కాదండీ ! ఇప్పుడు సంవత్సరపు పరీక్షల మార్కులు మాత్రమే చూడరు. క్లాసు పరీక్షల మార్కులూ, క్వార్టర్లీ హాఫియర్లీ పరీక్షల మార్కుల మార్కులూ— అన్నీ కలిపి మొత్తంగా చూస్తారు. ఒక వేళ క్లాసు మార్కులు బాగా రాకపోతే ఇందులో బాగరాసీ ప్రయోజనం లేదు. వాటిల్లో బాగా రాసి వీట్లో కాస్త తక్కువ వచ్చినా ఫర్వాలేదు ! ఇవన్నీ కొత్త రూల్సు !

"ఏం రూల్సో ఏమో ! ఇన్నేళ్లుగా చూస్తున్నా.. ఈ రోజున్న రూల్సు రేపటికుండవు !... ఇంతకీ చెప్పండి ! మళ్లీ మా వాడి నా క్లాసులోనే ఉంచాలంటే యేం చెయ్యాలంటారు ?

పంతులు కాసేపు ఆలోచన్లో పడ్డాడు:

"ఏం లాభం లేదండి. ఫెయిలయిన వాళ్లను ప్యాస్ చేయించడం యెంత కష్టమో ప్యాసయిన వాళ్లను ఫెయిల్ చెయ్యడం అంతే కష్టం !... అయినా ఓ చిన్న సలహా ! మీకు కావాలంటే ఈ సంవత్సరం మీ వాడిని స్కూల్లో చేర్పించకుండా ప్రయివేటు ట్యూషన్ చెప్పించండి !

"మంచిదండి !.... అయితే మీ స్టాఫ్లో యెవరన్నా బాగా చెప్పగలవారున్నారాండీ?

"అదీ నేనే చెప్దామనుకుంటున్నా !.... అయినా నోరు తెరిచి అడిగారు కనుక చెబుతున్నా వినండి ! కొత్తగా బళ్లోకి ఉద్దండుడైన ఓ పంతులొచ్చాడు! ఆయనకు కుర్రాళ్లు సరదాగా కరక్కాయ పంతులనే పేరు కూడా ఇచ్చారు. కాస్త డబ్బు యెక్కువ తీసుకున్నా చాలా బాగా చెబుతాడు ! మీరే అతడి దగ్గరకు వెళ్లకండి ! సంకోచమేం లేకుండా కుర్రాణ్ణే అతడి దగ్గరకు పంపండి !.... ఏం..."

నాకు నవ్వాగింది కాదు !... బ్రహ్మాండమైన బుర్ర పంతుల్ది. తనను తనే 'రెకమెండు' చేసుకుంటున్నాడన్న మాట ! కాస్త 'ఇన్టర్నేషనల్ పబ్లిసిటీ' ఇప్పిస్తే అమెరికా వాళ్లో, రష్యనులో ఈయన గట్టి బుర్రని ఎంత డబ్బైనా పెట్టి కొనేయగలరేమో !

"అలాగే సార్?"

"మీరు వెళ్లి అడిగితే అతను ఒప్పుకోడు ? కుర్రాడు చాలా బుద్ధిమంతుడని ఆయననుకుంటే చెబుతాడంతే ! ముందుగానే హెచ్చరిస్తున్నా !... మర్చిపోకండి ! కుర్రాణ్ణే పంపండి !.... ఆఁ ?"

"అలాగేసార్ !" అంటూ సెలవు తీసుకోడానికి లేవబోతుండగా ఆయన ముక్కుపుటాలు అదిరాయి. గట్టిగా గాలిలోనికి పీల్చి అటూ ఇటూ చూశాడు. కాసేపటి కాయన దృష్టి నిశ్చలమై పంతులుగారి పకోడీల పళ్లెం మీద నిలిచింది. "పకోడీలా ! అనుకున్నాముందే !" అనుకుంటూ కాబోలు నోరు చప్పరిస్తూ మళ్లీ కూలబడి పోయాడు. పంతులు మొహం చూసి జాలిపడ్డాను.

పంతులు విధిలేక మర్యాదకోసం ప్లేటు అందిస్తూ "తీసుకోండి" అని నవ్వుతూ (!) అన్నాడు.

"అబ్బే యెందుకులెండి !" మొహమాట పడ్డాడు చెట్టిగారు.

"ఫర్వాలేదు తీసుకొందురు !" అని ప్లేటు వెనక్కు తీసేసుకొంటుండగా ఆ చెట్టిగారు పరిస్థితి మించిపోగలదని గ్రహించిన వాడై తన కబంధ

హస్తాన్ని ముందుకు చాచి ఒక పిడికెడు గ్రహించి తన గొంతులో పోసుకున్నాడు. ఒక వైపున నము ల్తూనే రెండో పట్టుపట్ట బోగా— కుచేలుడి ముల్లెలో ఉన్న అటుకుల్లోంచి రెండో పిడికెడు అటుకులు సంగ్రహించ బోతున్న శ్రీ కృష్ణ పర మాత్మను రుక్మిణి వారించినట్టు — నేను ఈయనని వారిద్దామనుకున్నాను గానీ నాకీ ఆలోచన వచ్చేటప్ప టికీ సమయం మించిపోయింది. పంతులు ఖాళీ అయిపోయిన ప్లేటువైపే దీనంగా చూసుకొంటుం న్నాడు. అంతలో మరచెంబుడు మంచి నీళ్ళు తాగేసి ఖాళీచేసి— "క్షమించండి. నాకు కాఫీ, టీ అలవాటు లేదు ! నే వెళ్తొస్తా ! సెలవు !" అంటూ నిష్క్ర మించాడు చెట్టిగారు.

మళ్లీ ఇంకొన్ని పకోడీలు పంతులుకేద్దామా అనుకున్నాను గానీ అంతలోనే అతడి దురదృష్టం కొద్దీ—

"వణక్కం సార్ !" అని వినబడింది.

తెల్లపంచ (హతోస్మి— ఆ పంచెకున్న రంగు తెలుపంటారు! అని అనకండి ! అవి 'ఒరిజనల్'గా తెలుపు కాదనగలరా ? ! ) భూప్రపంచంలో యెవరూ వాడని రంగుగల షర్టూ తొడుక్కొని ఉన్నాడు. ఇటీవలే కంటి ఆపరేషను చేయించు కున్నట్టున్నాడు. ఎడమకంటికి అడ్డంగా ఒక చిన్న గుడ్డ ఆకుపచ్చరంగు గుడ్డ కట్టుకున్నాడు. కరక్కాయ పంతులు కేసి ఒంటి కంటితో ఉరిమి చూస్తూ— "అడడడడా.. రొంబ అన్యాయం సార్ !" అంటూ మొదలెట్టాడు.

ఈ కొత్తరకం "ఇంట్రొడక్షన్" ఏమిటా అని ఆశ్చర్య పోయినా తమాయించుకొని "ఏమిటయ్యా నీ సోది ?" అన్నట్టు మొహం పెట్టాడు.

"నిన్నదా చూస్తిని.. మా వాడు పాస్ ! ఇవేళ ఫేలని ఉండాది !.. ఏంది సార్ అన్యాయం ? !"

పిచ్చాడా అన్నట్టు అనుమానంగా చూశాడతని వైపు.

"అమసార్ ! విన్న నానుదాసూస్తిని మా వాడు పాస్ ! ఇయేల ఫేల్ !"

"అంటే నీ ఉద్దేశం ?...."

"ఈడ ఉద్దేశమేముండాది సార్ ! ఒరు మాటు పాసయిన వాడు మల్లా ఫెయిలెట్టా అవుతాడు ? విన్న నాలుగు బల్లల మీద రిజల్టు వేస్తిరి. ఈయేల అంజి బోర్డు ఇరికీ !నిన్న నల్ల కార్బను మీద టైపు చేసిన కాయితాలు అంటేస్తిరి. ఇయేళేమో యెర్రకార్బన్‌లో ఉండాది. యేందిసార్— బీదాళ్ల మీదనా అన్యాయం ?" గడగడా కంఠో పాఠం చేసిన పాఠంలా అప్పచెబుతున్నాడు.

పంతులికేం, అర్థమయినట్టు లేదు. ఏం చెబుతాడో అనుకున్నా. అయినా పంతులేం వెనక్కు తగ్గలేదు.

"ఏమిటయ్యా నువ్వనేది ? విన్న బోర్డు వేసి ఇవాళ మార్చారనా ? నీకేమైనా తెలివుందీ ? అలా ఎక్కడైనా జరుగుతుందా ? నీవు సరిగ్గా చదువు కొని ఉండవు. వెళ్లి సరిగ్గా చూడు !"

"నా కెందుకు తెలీదు ? నేనూ చదువుకున్న వాడినే !" అన్న మాటలు ఇంగ్లీషులో అన్నాడా అరవతను.

"ఆఁ ఆఁ ! చదువుకొన్నావు !.. చదూకోడ మంటే నాలుగు యింగిలీపీసు ముక్కలు బట్టీ పట్టి వాగడం కాదు !.... ఎక్కడైనా రోజుకో బోర్డు వేస్తారుటయ్యా !"

"వెయ్యకపోతే నాలుగు బోర్డులైదెలా అవు తాయి ? నల్లకార్బను యెర్రకార్బనుగా యెలా మారుతుంది ? మాకేం తెలీదను కోకయ్యా ! మాకూ బాగా తెలుసు !" ఇంగ్లీషులోనే అన్నాడు.

"ఏం తెలుసయ్యా నీకు ? నీ బొంద తెలుసు ! అర్థం చేసుకోలేకపోతే సరి ! ఏదో పొరబాటు చూచి ఉంటావు. అందులో ఒక కన్ను కూడా లేదాయె ! వెళ్లి సరిగ్గా చూసి ఏడు !"

"సామీ ! ఏడూ గీడూ అనకూ !"

"ఏం ? ఏం చేస్తావయ్యా. మహా గొప్పగా వచ్చావు ? నడవ్వయ్య నడు ! బుద్ధి లేకపోతేసరి. పెద్దగా తయారవుతారు ప్రతి అడ్డసన్నా సీను !" పంతులు గొంతు చించుకో సాగాడు.

"ఏమిటోయ్ పంతులూ పెంకు లెగరేస్తు న్నావ్ ?"

ఉలిక్కి పడ్డాన్నేను. నాన్నగారి గొంతది. నాన్నగా రెప్పుడు మేడమీదనుంచి దిగారో, ఎప్పుడు మొహం కడుక్కున్నారో గమనించనే లేదు నేను— ఈ సంద డిలో.

ఈమాటు కరక్కాయ పంతులు గొంతులో వెలక్కాయ పడ్డది. తడబడుతూ— "మీరు ఇంట్లోనే ఉన్నారాండీ ?" అనడిగాడు.

"ఆ ! నిద్ర పోతున్నాను· కాఫీ టిఫిన్లయ్యాయా ఎవరండీ మీరు ? ఏంకావాలి ?" అన్నారు నాన్న గారు ఒంటికంటి అరవాయన కేసి చూస్తూ

"మీరు దానా హెడ్మాస్టరు ?"

"అవును నేనే ! ఏం కావాలి మీకు ?"

అరవాయన పంతులుకేసి ఒకసారి గుడ్లురిమి చూసి మళ్లీ గ్రామఫోను ప్లేటులా,— 'రొంబ అన్యాయంతో' మొదలెట్టి 'నేనూ చదువుకొన్న వాడినే' అన్నదాకా వాగేశాడు.

"ఏమండోయ్, మీరు పొరబడ్డారు ! లోయర్ ఫారమ్సన్నీ ఎర్రకార్బన్‌తోనూ హయ్యర్ ఫారమ్సన్నీ నల్లకార్బన్‌తోనూ టైపు చేశాము. మరి మీరు ఏది చూశారో !" అన్నారు నాన్నగారు.

అరవతను కాసేపు తన గీరుకొని "మరి బోర్డుల సంగతో ?" అన్నాడు.

"అది కూడా గమ్మత్తే, ఓ పెద్ద బోర్డుకు మధ్యలో అతుకు చీలలు వూడి పోయి ఉంటే— ఈ సమయానికి వేరే బల్లలు దొరకక పోవడం చేత దాన్నే జోడించి పెట్టేశాము ! పిల్లల తోపుడికి మళ్లీ అది రెండుగా విడిపోయి ఉంటుంది !"

దాంతో ఆ అరవతని చిక్కుముడి కాస్త వూడి పోయింది.

"మరి మా వాడి సంగతో ?" అన్నాడతను.

"రేపు ఆఫీసులో కనుక్కోండి ఆ విషయాలన్నీ ఇక్కడ కాదు"

అతగాడు మరేం మాట్లాడకుండా పంతులి వైపొక ఉగ్రంగా ఓమాటు చూసి వెళ్లిపోయాడు.

"గుడ్డి వెధవ ! కళ్లు సరిగ్గా కనపడక పోతేసరి! పిచ్చిపిచ్చిగా వాగుతున్నాడు. పైగా తనూ చదువు కొన్న వాడినంటాడు. ముందు జాగర్త తీసుకోరు. తర్వాత దాపురిస్తారు !" పంతులు ప్రారంభించాడు. అతణ్ని తిట్టడం.

"అయినా నువ్వు పడుతున్న గొడవేమిటోయ్ పంతులూ ?"

పంతులు కాసేపు తటపటాయించి— "ఏం లేదండి ! అబ్బాయ్ మీరు లేరన్నాడు ! సరే కదాని ఈ పడక్కుర్చీలో కాసేపు కూర్చున్నా. ఇందులో కంఫర్టూ అదీ చూస్తూంటే నేనూ ఒక హెడ్మా ష్టర్నయితే యెంత బావుణ్ను అనిపించింది. పైగా రెండు వేల మంది విద్యార్థులున్న స్కూలు ! ఇం తలో పిల్లలంతా రావడం మొదలెట్టారు. పడక్కుర్చీలో దర్జాగా ఉన్న నన్ను చూసి హెడ్మాస్టరనుకున్నారు. "మీరు ఇంట్లో లేరుకదా. రూల్సన్నీ తెలుసుకదా ! అని కాసేపైనా హెడ్మాస్టరు గిరీ అనుభవిద్దా మనుకున్నాను. వచ్చిన వాళ్లందరి యక్ష ప్రశ్నలకీ యెలాగోలా సమాధానమిచ్చా ! కానీ బాబోయ్— ఓ గంట హెడ్మాష్టరు గిరికే ఇంత ఇదయితే రోజంతా ఎలాగుంటుందో...." అన్నాడు.

నాన్నగారు నవ్వుతూ— "పోనీ స్కూలు తెరిచే దాకా ఈ గిరీ అనుభవిద్దూగానిలే !" అన్నారు.

"బాబోయ్ వద్దండి !" అన్నాడు పంతులు.

"ఇంతకీ విశేషాలేమిటోయ్ పంతులూ ! కని బడ్డమేలేదే ఈ మధ్య ? ? ఏమిటీ సంగతులూ, ఎందుకొచ్చావ్ ?.... ఆఁ ?"

"అబ్బే యేం లేదండీ ! మా బావమరిది స్నేహి తుడి కొడుకొకడు ఫెయిలయ్యాట్ట ! అబ్బాయి చాలా బుద్ధిమంతుడల్లే కనబడతాడు మరి ! ఎలా ఫెయిలయ్యాడో తెలీదు ! వాడి మార్కులోమాటు చూచి పోదామని !...." నసిగాడు పంతులూ.

"ఓరి పంతులూ ?" అని ఆశ్చర్య పోయాను. మొత్తానికి భలేవాడే ! ఇంత మందికి తనే పని కూడదని చెబుతున్నాడో అదే తను చెయ్యాలను కొంటున్నాడన్న మాట ! అసలు స్కూలు తెరిచే దాకా మార్కులు గుప్తంగా ఉంచడం నాన్నగారి 'పాలసీ'. నాన్నగారేమంటారో అన్న సందేహం వచ్చింది. ఎందుకంటే— ఏం చెప్పినా పంతులు సులభంగా బోల్తా పడడు కదా ?

"దానికి నువ్వు పని కట్టుకు రావాలిటోయ్ పంతులూ ! రేపు సాయంత్రం ఎవర్నయినా కుర్రాణ్ని పంపు. ఆఫీసు నుంచి తెప్పించి పెడతాను ?" అన్నారు నాన్నగారు సహజంగా నవ్వుతూ.

పంతులు చిరునవ్వు చిందించాడు. కానీ పంతు లికేం తెలుసు పాపం— నాన్నగారు రేపుదయమే వూరెడుతున్నట్టు ! సులభంగానే బుట్టలో పడ్డాడు పంతులు.....

అంతవరకూ కథకు 'వస్తువు' దొరకని నా బుర్రలోని కవాటం 'ధన్' మని తెరుచుకొంది. ఆ రాత్రే దాన్ని కథగా రాసి నాన్నగారికి చూపెట్టి— "పేరేం పెట్టమంటారు ?" అని అడిగాను.

"నువ్వే చెప్పు !"

"పడక్కుర్చీ— పకోడీలు !"

"ఛ !.... 'విక్రమార్క సింహాసనం' అని పెట్టు ! పడక్కుర్చీ సింహాసనమూ, మధ్యలో వచ్చే పాత్రలన్నీ సాలభంజికలూ !"

"వెరీ గుడ్ ! థాంక్యూ పాప్పా !"

"కానీ పంతులిది పత్రికలో చదివితే ఏమను కుంటాడో ?".... అన్నారు నాన్నగారు నవ్వుతూ.

ఏమనుకుంటాడో మరి— మీరే చెప్పాలి ! పంతులుచెప్పినాఫర్వాలేదు!ఇకఉంటా—టాటా!! ★

# యుగసంధి

19 వ పేజీ తరువాయి

నాకూ ఉత్తర ప్రత్యుత్తరాలు రాయటమో సంధించటమోకూడా ఎండి పోవచ్చునని తెలిసే వ్రాస్తున్నాను.

నాతో పనిచేస్తున్న హిందీ పండిట్ శ్రీరామచంద్రన్నాయున్ని వచ్చే వారం రిజిస్టర్డు పెళ్లి చేసుకోవాలని నిశ్చయించుకున్నాను. నేను విధవనన్నది ఆయనకి తెలిసినదే. ఆరు నెలలు కాలంగా నేను ఆవేదనతో— ఒక పాపకరమైన కార్యం అన్న ఒక అర్థంలేని అనుభూతితో— పోరాడే ఈ నిర్ణయానికి వచ్చాను. పూర్తిగా తెలిసివుండి వైధవ్య వ్రతానికి కట్టుబడి ఉండనేరక, వేషం వేసుకుని తిరిగి తర్వాత చెడ్డ పేరుకి చోటిచ్చి కుటుంబాన్ని అవమాన పరచకుండా ఉండడమే సరైన పద్ధతని నేను తెలుసుకున్నాను. ఈ ముప్ఫయవ వయస్సులో— అన్ని పరీక్షలని భరించలేక— ఇంకా అయిదు సంవత్సరాలికి తర్వాత ఇదే నిర్ణయానికి రావాల్సి వస్తుందేమోనన్న భయంపుట్టి— ఇప్పుడే చేస్తే సరి అన్న నిర్ణయానికి వచ్చేశాను.

నా పని నా వరకూ సరైనదే! నేను తప్పు చేసినట్లుగానో, దీనికోసం విచారించాలనో, మీ దగ్గర క్షమాపణ కోరుకోవాలనోకూడా నాకు తోచలేదు. కానీ మీ బంధుత్వాన్ని, ప్రేమని వదులుకుంటున్నానే అన్న బెంగ కొన్ని సమయాల్లో ఎక్కువగా బాధిస్తోంది.......కానీ ఒక క్రొత్త జీవితం, ఒక క్రొత్త వెలుగుని సంపాదించి, ఒక క్రొత్త యుగ మనిషిగా సంచరించకోరుతున్నానన్న లక్ష్యసిద్ధితో— నేను వోదార్పుని— అంతులేని ఆనందాన్ని అనుభవిస్తున్నాను.

ఈ కాలంలో ఎవరి మనస్సు ఎలా మారుతుందో చెప్పనేరము. ఒకవేళ మీరు నా నిర్ణయాన్ని ఆదరిస్తే ఇంకా వారం ఉంది.........మీకు, మీ ప్రేమపూరిత ఆశీర్వాదాన్ని ఎదురుచూస్తున్నాను. లేకపోతే మిమ్మల్ని తలుచుకున్నంత వరకూ "గీత చచ్చిపోయింది" అని తలకి స్నానం చేసేయండి.

అవును, చాలా స్వార్థచింతతో చేసిన నిర్ణయమే. నా కోసం బామ్మ తప్పించి వేరే ఎవ్వరుమాత్రం తమ సుఖాల్ని త్యజించి 'త్యాగం' చేశారు. ఎందుకు చేయాలి?

మీపై ఎప్పటికీ మారని ప్రేమగొన్న,
గీత."

"ఏమిటో ! ఇలా గ అయిపోయిందే!" అన్నది తప్ప వేరే ఏదీ చెప్పడానికి చెయ్యడానికి శక్తి లేక బెంగతో గుడ్లప్పగించి చూసింది బామ్మ గారు.

"అది చచ్చిపోయింది. తలకి స్నానం చేయాల్సిందే అని నిర్దాక్షిణ్యమైన స్వరంతో ధృఢంగా చెప్పారు గణేశయ్యారు.

బామ్మగారు నివ్వెరపోయింది. !

— తల్లి ఆలోచనకో, అవాజుకో, ఆజ్ఞకో ఉత్తరవుకో కాచుకోక ఆ 'తల్లిచాటు పిల్లవాడు' పుట్టి మొదటిసారిగా ఒక నిర్ణయానికి వచ్చింది ఇదే మొదటిసారి.

"అలాగా చెప్పుతున్నావా" అను కళ్ళు రెండు కన్నీటి చెరువులుకాగా, ముసలి హృదయం వాత్సల్యంతో ఆవేదనపడగా, హృదయంమీద చేయి పెట్టుకుని అడిగింది. బామ్మగారు.

"వేరే ఏమని చెప్పమని అంటావు ?........ నువ్వు పుట్టిన వంశంలో, ఈ కుటుంబంలో..... ....అయ్యో !" అని ఈ దారుణాన్ని కల్పన చేసుకోలేక బాధపడ్డారు గణేశయ్యారు.

"నేను పుట్టిన యుగమే వేరురా !" అన్న మాట బామ్మగారి నోటిలోకి వచ్చి నిలిచిపోయింది. అప్పుడే బామ్మగారికి ఒక అద్భుతమైన నిజం ఇంతకాలం తర్వాత అర్థమయింది.

"నా కొడుకు నా మాటకో నా ఆజ్ఞకో కాదు ఒక్క తల్లి ప్రేమవల్లే మాత్రంకాదు. నేను ఒక యుగానికి ప్రతినిధిని. అది ఒక్క తల్లి ఆచారమైన యుగం. నేను పుట్టినది శాస్త్రానికి భయపడి నడచిన కుటుంబంలో........ అదేలాగా తన కుటుంబమూ నడవాలి— నడిపించడం తన వల్ల కాకపోయినా నావల్ల అవుతుందన్న నమ్మకంతో ఆ యుగాన్ని ఆ ఆచార జీవితాన్ని గౌరవించడానికి నా మాటనీ నా పలుకునీ ఎదురుచూసాడు......."

అని తనవిగూర్చి........ తన కొడుకు— మహోన్నతమైన నిర్ణయాన్ని గురించి, అనురాగానికి దూరమైన గీతని గూర్చి ఆలోచించి మౌనంగా గొంతు పెగలక కూర్చుండిపోయింది బామ్మగారు.

అప్పుడు అక్కడకి వచ్చి వారిని అట్టి విపరీత పరిస్థితిలో చిక్కుకోనిచ్చిన ఆ ఉత్తరాన్ని తీసి చదివిన పార్వతి "ఓసినీ. పాపిష్టి కూతురా..... నా తలమీద నిప్పు పెట్టావుకదా !.........." అని తలమీద మొత్తుకుని ఏడ్చింది.

బామ్మగారు, తన వయస్సుకి, తగిన నిదాన బుద్ధితో ఆ ఉత్తరాన్ని తిరిగి చేతిలో తీసుకుని ఆ ఆఖరి పంక్తుల్ని చదివింది..........

"చాలా స్వార్థ చింతోత చేసిన, నిర్ణయమే. నా కోసం బామ్మ తప్పించి వేరే ఎవరుమాత్రం తమ సుఖాన్ని త్యజించి 'త్యాగం' చేశారు"— బామ్మగారికి 'చురుక్కు'మనింది..........పెదిమని, కరచుకుంది.

ఈ మాటల్లోని అర్థం మిగతావారికి అర్థమవదు. బామ్మగారికి అర్థమవుతుంది.

గీత, పద్దెనిమిదో సంవత్సరాన నుదుటి తిలకం చెరుపుకున్నట్లుగా, జుత్తులో అలంకరించుకునే పూవులని త్యజించినట్లుగా— 'అది దాని కర్మ' అని చెప్పి దాని దుఃఖాన్నే మర్చిపోలేదా, దాన్ని కన్న తల్లీ తండ్రీ? గీత ఇలాగ అయి వచ్చాకనేకదా పార్వతి, అంబినీ జానాని కనింది !............

—దానికేమిటి అదే జీవించేవారి జీవితపు మార్గం.

జీవించవేరని గీత లోపల పెరిగి, చెదరి, ప్రమ్మ్గి

## యుగసంధి

మన్ను అయి పురుగు తొలిచినట్లు తొలిచి తొలిచి పుండుగా అయి, కుప్పగా పడివున్న అనుభూతులను జ్ఞాపకాలని, ఆశలని కలలనీ వారు తెలుసుకోగలరా?

కానీ?.....................

గీతలాగే— దానికంటే ఇంకా చిన్న వయస్సులో అర్థ శతాబ్దానికి ముందర ఉన్న హిందూ సముదాయపు వైధవ్యమనే దారుణాగ్నిలో చిక్కి జీవితాన్ని పోగొట్టుకుని, జ్ఞాపకాలన్నీయున్నా ఆ కలలన్నీ కన్నటువంటి, ఆ ఆశలన్నీ చంపుకున్న గౌరీ బామ్మగారు, అవన్నీ గీతలో చూడకనో, చూసీ గ్రహించకుండానో ఉండగలదా?

అందువల్లే గణేశయ్యారులాగో, పార్వతమ్మలాగో— గీత ఇలాగ నడుచుకుంటోంది అని ఎరిగి ఆమెని అసహ్యించుకు, త్యజించడానికో, దూషించి శపించడానికో వీలవక "అయ్యో, ఏమిటో ఇలాగయిపోయిందే, ఇలాగయిపోయిందే" అని చేతుల్ని మనస్సునీ నలుపుకుని బాధపడిపోతోంది బామ్మగారు.

ప్రొద్దుగ్రుంకి దీపాలు పెట్టే వేళలో మాట్నీ షోకి వెళ్ళిన మీనా, అంబి ఇంటికి

ప్రఖ్యాత కథారచయిత ఓ హెన్రీని ఎవరో కథ రాయడమెట్లాగని అడిగారు. అందుకతను "అదేమంత కష్టమైన పనికాదు. కథ ముగింపు ముందురాసి తరువాత కథ మొదలు పెట్టు" మన్నాడు.

ప్రకాశం (అనంతపూర్)

తిరిగారు. వీధి మెట్టుమీద కాలుతీసి పెట్టిన అంబి, సావిట్లో ఈజీ చైర్‌లో చారగిలబడి పడుక్కుని దీర్ఘచింతనలో మునిగివున్న బామ్మగారిని చూడగానే చటుక్కున ఆగి తిరిగి వెనక్కి వచ్చి మీనాతో,

"బామ్మేవ్............" అని రహస్యంగా హెచ్చరించాడు.

"ఎక్కడ? లోపల ఉందా? సావిట్లో ఉందా?" అని కొంచెం వెనక్కి తగ్గి నిలుచుంది మీనా.

"సింహాసనంలో జారగిలబడి నిద్రపోతోంది...." అన్నాడు అంబి.

మీనా భుజంమీదుగా 'స్టయిలుగా' మడతలు పెట్టి వ్రేలాడదీసుకున్న పమిటని సరిగ్గా విప్పి లాగి నడుములో దోపుకుని, పై దుస్తులు సరిగ్గా ఉన్నవా అని ఒకసారి చూసుకుని తర్వాత తలదించుకుని సాధువులాగా లోపలికి దూరింది.

లోపలికి వచ్చాకే బామ్మ నిద్రపోవటంలేదు అని తెలిసింది. తండ్రి ఒక ప్రక్క కుర్చీలలోనూ, తల్లి ఒకప్రక్క ముఖంమీద పైట చెరగు కప్పుకుని ఏడుస్తూ ఒక మూలపడి ఉండటం ఏమి విపరీతమో ఏమిటో అర్థం అవక ఇద్దరూ నిశ్చేష్టులయి నిలుచుండిపోయారు.

అప్పుడు జానా నవ్వుతూ అంది దగ్గరికి వచ్చి గెత్తుకుంటూ వచ్చింది.

"బామ్మ నక్క దోసకాయ పిందెలని కొనుక్కొచ్చింది........" అన్న జానా మాటలు వినగానే బామ్మగారు మీనాని తిరిగి చూసింది.

"ఎప్పుడొచ్చారు బామ్మా?" అని అడిగి, "ఏమిటి విషయం? ఇదంతా ఏమిటి?" అని సైగతో అడిగింది మీనా.

బామ్మగారి కళ్ళు చెరువులయ్యాయి. మీనాని చూడగానే ఆవిడకి ఇంకో విషయం— గణేశయ్యారు గీతని తల కళ్యంగవం గావించుతానన్న దానికాృరణం, పార్వతమ్మ గీతని శపించిన న్యాయావేశం రెండూ— అర్థమయింది బామ్మగారికి.

అక్కడే పడివున్న ఆ ఉత్తరాలు మీనా తీసి చదివింది.

"దాన్ని నువ్వు చదవవద్దు" అని అపుదామని అనుకుంది బామ్మగారు. తర్వాత కానీ ఎందుకో 'చదవనియ్యి' అని తలచి మీనా, ముఖాన్నే నిశితంగా అవలోకించింది.

మీనా ముఖం అసహ్యంతో చిట్లించుకుంది.

"ఓసినీ నువ్వు నాశనమయి పోతావే" అని తిట్టుకుంటూ తిరిగి ఉత్తరాన్ని చదివింది. దాని భుజంమీదుగా కాళ్ళెత్తి నిలుచుని, ఉత్తరాన్ని చదివిన అంబి కూడా ఆముదం తాగినట్లుగా ముఖాన్ని మార్చుకున్నాడు.

ఇల్లే శూన్యమయింది. వూరంతా ప్లేగు వ్యాధి వ్యాపించి ఉన్నప్పుడు ఇంట్లో ఒక ఎలుక చచ్చి పడి ఉంటే చూసినవారిలాగా ఒక్కొక్కరూ చాలా ఇరుకునపడి ఇంకొకరి ముఖం చూడసాగారు.

రాత్రి పూర్తిగా గౌరి బామ్మగారు నిద్రపోలేదు. తినలేదు. సావిట్లోని ఈజీచైరుని వదలి లేవనూ లేదు.

కొడుకుని చూసి, కోడలుని చూసి, మిగిలిన మనుమల్ని చూసి, గీతని తలుచుకుని దీర్ఘంగా వూపిరి వదలుతూండింది.

అలవాటుకి వ్యతిరేకంగా నన్ను పంపటానికి బస్సుస్టాండుదాకా వచ్చి, బస్సు బయలుదేరే సమయానికి కొంగుతో కళ్ళు తుడుచుకున్నావే గీతా? బమ్మ్మ వదందేమోననుకున్నాను.

"ఏమిటే ఇలాగ చేశావు ! ఏమిటే ఇలాగ చేసేశావు!" అని పదేపదే తనలో తాను చింతించి చింతించి ప్రశ్నించుకుంది.

ప్రొద్దు పొడిచే వేళకి కొంచెం ముందుగా తనకే తెలీకుండా కళ్ళని మూసింది. కళ్ళు మూసి కళ్ళు తెరచినప్పుడు మాయగా తెల్లవారింది.

వీధి మెట్లుతలుపు వారగా చేతిపెట్టెతో వచ్చికాచుకున్నాడు వేలాయుధం.

కళ్ళు తెరచిన బామ్మగారు— జరిగిన సంగతంతా కల అవకూడదా అని తలచుకుని ముగించేలోగా 'ఇది నిజం !' అన్నట్లుగా ఆ ఉత్తరం స్టూలు మీద పడివుంది.

ఆ ఉత్తరాన్ని తీసి తిరిగి చదివింది బామ్మగారు. అప్పుడు గదిలోనుంచి వచ్చిన గణేశయ్యారు రాత్రి అంతా ఇదే జ్ఞాపకంగాపడి రోదిస్తున్న తల్లిని వోదార్చనెంచి "అమ్మా అమ్మా ! వేలాయుధం వచ్చాడు............అదే చచ్చిపోయిందని

తొలుచుకు వెళ్ళలో మునుగుసాగాను..." అన్నారు.

"నోరు ముయ్యరా........" అని అరిచి లేచింది బామ్మగారు.

"తెలవారీ తెల్లవారకుండా దయ్యంపట్టినట్లు ఏవిటా మాటలు? ఇప్పుడేం జరిగిందని దాన్ని చావమంటున్నావురా.......?" అని అడిగింది, భరించనేరని శోకంతో ముఖమంతా ఎఱ్ఱబడి బాధపడి గట్టిగా రోదించింది బామ్మగారు. తర్వాత ఎఱ్ఱబడ్డ కళ్ళని తెరుచుకుని కోపంతో అడిగింది.

"ఏవిటిరా తప్పు చేసింది అది?....ఏం తప్పు చేసింది, చెప్పు?" అని తన తల్లి అడగడంచూసి, గణేశయ్యరుకి ఒక్క క్షణం ఏమీ అర్థంకాలేదు.

"ఏం తప్పా?.....ఏవిటమ్మా మాట్లాడు తున్నావు నువ్వు? నీకు పిచ్చి పట్టిందా ఏవిటి? అని అరిచారు గణేశయ్యరు.

తర్వాత క్షణం తన స్వభావ ప్రకారం నిదానంగా కొడుకు ముఖాన్నే చూస్తూ శాంతంగా ఆలోచించింది. బామ్మగారు. తన కొడుకు తన దగ్గర ఇలాగ మాట్లాడటం ఇదే మొదటిసారి !

బామ్మగారు చిన్న గొంతుకతో నిదానంగా చెప్పింది.

"అవునురా నాకు పిచ్చేను........ఇప్పుడు పట్ట లేదురా.....ఇది పాత పిచ్చే. తీర్చనేరని పిచ్చి— కాని నా పిచ్చి నాతోటే పోనియ్యి! ఆపిచ్చే దానికి 'భడేలు' మని తేట తెల్లమయిందంటే, దానికి ఎవరేంచేస్తారు.? అదేచెప్పేసిందే—నా పని నా మట్టుక్కి సరి, వేషం వేసి ఆడి చెడ్డపేరు తెచ్చుకోకుండా న్యాయంగానే చేసానని......"

"అందువల్ల సరి అవుతుందా దాని పని?" అని ఖండిస్తూ మాట్లాడారు గణేశయ్యరు. దాని పని దాని మట్టుకు సరి అయినదే అంటుందే అది..........దానికేం చెప్పుతావు?" అని అర చేతితో గ్రుద్దుకుంటూ అడిగింది బామ్మగారు.

"శాస్త్రం చెడిపిన దరిద్ర దేవత.......ఆచారమైన కుటుంబం పేరు చెడిపిన శని.....చచ్చి పోయిందని తలకి స్నానం చేసెయ్య అన్నాను" అని పళ్ళను కొరుక్కుని అరిచారు గణేశయ్యరు.

బామ్మగారు ఒక్క క్షణం తననీ తన ఎదురుగా నిలుచున్న కొడుకుని వేరే ఎవరో లాగా తప్పించుకుని నిలుచుని చూసి, ఒక విరక్తి నవ్వుతో చెప్పింది.

"మన శాస్త్రం......ఆచారం ! అలాగయితే నువ్వు ఏంచేసి ఉండాలో తెలుసా? నన్నేవిటి చేసింది తెలుసా ఆ శాస్త్రం......అప్పుడు నువ్వు పాలు త్రావే పసివాడివిరా....... నాకు వయస్సు పది హేనేరా ! నా కొడుకు నా ముఖంచూసి దెయ్యాన్ని చూసినట్లు గోలపెట్టేవాడివిరా......!

కన్నతల్లి దగ్గర పాలు త్రాగలేక పిల్లవాడు గోలపెట్టేటట్లు అరిచే వాడివిరా, దగ్గరకివస్తే భయంతో ఏడ్చేవాడివి ...... అలాగ నన్ను, కర్మకి మూల్లో కూర్చో పెట్టేశారురా ! ఆ ఘోరాన్ని నువ్వు ఎందుకని గీతకి చెయ్యలేదు?.... ఎందుకు చెయ్యలేదు చెప్పు?" అని తన కళ్ళ నుండి కన్నీరు కారగా అడుగుతుంటే, గణేశయ్యరు కళ్ళని నలుపుకున్నారు.

ఆవిడ తిరిగి మాట్లాడసాగింది.

"ఏ శాస్త్రం దాన్ని రంగు చీరలు కట్టుకోమని చెప్పిందా? జడని తల్లకుని ముడివేసుకుని బడికి వెళ్ళిరమ్మందటరా? తన కడుపుకి తానే సంపాదించుకుని తినమని చెప్పిందా? దీని కన్నింటికీ నువ్వు నన్ను అనుమతి అడిగినప్పుడు నేను సరే నన్నాను. ఎందుకు?......కాలం మారుతూ వస్తోంది. మనుష్యులూ మారాలనే కదా ! నాకు నువ్వున్నావు ! ఇల్లూ పొలమూ ఉండింది. ఆ కాలమూ అలాగ ఉండింది. గీత చేయాలనుకున్నది మనప్పుడో కూడా అనుకోనేరని యుగం అది. అప్పుడది సాధ్యం గానూ ఉండింది. ఇప్పుడు సాధ్యం కాదురా.....నాకు ఏ స్థితి అర్థమవుతోంది. నువ్వు పిల్లాజెల్లలతో జీవించేవాడివి వారికి రేపు శుభకార్యాలూ అవీ చేయాలి. అదీ అర్థం చేసుకునే కదా రాసింది— ఏ శాస్త్రం దాన్ని జీవించనిస్తుందిరా? దానికి అది వద్దనుకుంది. కాని ఒరేయ్ గణేశా...... నన్ను మన్నించుకోవాలిరా — నాకు అది కావాలి ! అదేరా కావాలి..... నాకు ఇంకమీద వేరే ఏం కావాల్సి ఉంది! నా శాస్త్రం నాతోపాటే ఉండి ఈ కాయంతోటే మండనీ..... అందువల్ల మీరు బాగా ఉండండి.... నేను వెళ్ళుతున్నాను...... గీతతోపాటే వెళ్ళిపోతాను. అదే మంచిది.. దానివల్లన నువ్వు లోలోపల తృప్తి చెందవచ్చు — ఆలోచించి చూడు. లేకపోతే దానితో బాటు కలిపి నాకూ ఒక మునక మునిగెయ్యనే వస్తాను" అని చెప్తుతూ మారు చీరని చుట్టే కాకి సంచీలో దూర్చుతూ లేచి నిలుచుంది.

"అమ్మా ! ఆ......." అని చేతులని జోడించి ధార ధారగా కన్నీరు కార్చారు గణేశయ్యరు.

"పిచ్చివాడా!— ..... ఎందు కేడుస్తున్నావు ? నేను చాలా యోచించే ఈ నిర్ణయానికి వచ్చాను. ఏంచేసినా అది మన పిల్లరా" అని మెల్లగా చెప్పి "పార్వతీ నువ్వు ఇల్లు బాగా చూసుకో......." అని అందరి దగ్గరా వీడ్కోలు పుచ్చుకుని బయలు దేరింది బామ్మగారు.

"నేను వెంటనే వెళ్ళి గీతని చూడాలి" అని తనలో తానే చెప్పుకుని తిరిగినపుడు వీధి మెట్ల దగ్గర నిలుచున్న వేలాయుధాన్ని చూసింది బామ్మ గారు.

"నువ్వు వెళ్ళవయ్యా....నేను అవసరంగా స్టేషనుకి వెళ్ళాలి" అని వాడికి నాలుగణాలు ఇచ్చి పంపేసింది.

"ఇంకమీదట వీడికిక్కడ పనిలేదు— దాని కేమిటి? ప్రపంచంలో ఏవేవిటో మారు తున్నాయి.! నేను ఒక మంగలిని కూడా మార్చుకో కూడదా?" అని అనుకుని నవ్వుకుంటూ, నడుము సంచీ పెట్టుకుని వీధి మెట్లు దిగిన బామ్మగారు ఒక్కసారి తిరిగి నిలుచుని "నేను వెళ్ళి వస్తాను" అని మళ్ళీ వీడ్కోలు తీసుకుంది.

అదుగో, ప్రాతఃకాలపు లేయెండలో, వేడిలేని మట్టి బాటలో పాదాల్ని మోపి మోపి ఆన్చి ఒక ప్రక్కన ఒరిగి ఒరిగి నడిచి వస్తున్న బామ్మగారి విగ్రహం. ★



"బాబూ! ఇచ్చినదానికి పదో, పాతికో తగ్గించుకొని... ఈ రేడియో తీసుకో ! నీకు పుణ్యముంటుంది ! నిన్ననే మా పక్కింటివాళ్లు రేడియో కొనుక్కున్నారు!!"

ఆస్పత్రికి వెళ్లటం, ఇంజక్షను కాగానే మళ్లా రిక్షా ఎక్కి మందుసీసా చేత్తో పుచ్చుకుని రావటం, కడుపుతో ఉన్న వాళ్ల దినచర్యల్లో ఇదొకటి. అక్కయ్యకు మాత్రం కడుపుతో ఉన్నాననే సంతోషంగాని, తల్లిని కాబోతున్నాననే ఉత్సాహంకాని, మందు తీసుకుంటున్నాననే తృప్తికాని లేదు. ఆసుపత్రికి వెళ్లినా, రిక్షాలో కూర్చున్నా, ఇంట్లో ఉన్నా ఏదో పరధ్యానం, దిగులు. బావ దృష్టిలో మాత్రం తమా భార్య కడుపుతో ఉండంగానే చక్కగా మందులూ, ఇంజక్షన్లూ ఇప్పించి ఏ లోటూ లేకుండా దాని ఆరోగ్యం కాపాడుతున్నాననే సంతృప్తి. చుట్టుప్రక్కల అమ్మలక్కలకు మొదటి కానుపుకే అయిదోమాసం నుంచే ఎంత శ్రద్ధగా ఆవిడ మొగుడు మందూ మాకూ ఇప్పించి ఆపేక్షగా చూసుకుంటున్నాడమ్మా అని అనుకోవటమూ. ఏమిటో ఈ ఆత్మవంచన. ఇంట్లో భర్తచేత చీవాట్లూ, దెబ్బలూ తింటూ, తిరస్కారంతో, మానసిక వ్యథలతో కుళ్లి కృశించిపోతోందని ఎవరికి తెల్సు. చక్కగా తల దువ్వుకుని, మంచి బట్టలు కట్టుకుని, ఉన్న నాలుగు నగలూ పెట్టుకుని నేమా, అక్కయ్య రిక్షాలో ఆస్పత్రికి పోతుంటే చూసే వాళ్లకు అదీ ఒక అందంగానే కనబడుతుంది. మా మనసుల్లో, హృదయాంతరాళాల్లో ప్రజ్వరిల్లి భగభగమంటే అగ్ని పర్వతాల విషయం ఎవరికి తెల్సు. అక్కయ్యలాంటివారు ఎంతమందో ఈ దేశంలో, ఈ పవిత్ర భారతదేశంలో.

అక్కయ్య రాలేకపోతే ఒకరోజున మందు తీసుకురావటానికి నేను ఆస్పత్రికి వెళ్లాను. మందు తీసుకునివస్తుండగా రమాదేవి కనిపించింది. నాకూ పలకరించటానికి ఇష్టంలేకపోయింది. ఎదుటపడగానే రమాదేవి పలకరించింది.

# హృదయ కుసుమాలు

27 వ పేజీ తరువాయి

"అక్కగారికి కులాసాగా లేదా"

"లేదు. వంట్లో బాలేదు".

"ఎన్నో మాసం".

"అయిదో మాసం పూర్తికావస్తోంది."

"పురిటికి ఏలూరు తీసుకు వెళతారా"

"ఇంకా ఏం ఆలోచించుకోలేదు".

"వోసారి మా ఇంటికి రండి. బ్రాడీపేట, పధ్నాలుగో అడ్డరోడ్డు, రెండో లైను".

"అట్లాగే. రేపు సాయంత్రం అయిదు గంటలకి వస్తాలెండి"

"తప్పక రావాలి" నవ్వుకుంటూ వెళ్లింది.

నాలో ఏవో ఆలోచనలు దొర్లిపోతున్నాయి. రమాదేవిని మార్చగలనా? చివాట్లు తిని రాగలనా? నిండా మునిగినవాడికి చలేమిటి?

మర్నాడు సాయంత్రం అయిదున్నరకు రమాదేవి ఇచ్చిన అడ్రసుప్రకారం వెళ్లాను. పెద్ద మేడ. ఎన్నో పూలమొక్కలూ, రకరకాల చెట్లూ, పొదలతో చూడ ముచ్చటగా ఉంది. నే వెళ్లేసరికి వరండాలో ఈజీ చైర్‌లో పడుకుని, కాళ్లూగిస్తూ, జారిపోయిన పమిటెనైనా చూసుకోకుండా 'ఆల్సేషియన్' కుక్కతో ఆడుకుంటూ న్నది రమాదేవి. నన్ను చూడంగానే లేచి నవ్వుతూ ఆహ్వానించింది. ఆ కుక్కను గొల్సుతో స్తంభానికి కట్టేసి సాదరంగా ఆహ్వానించింది.

"రండి మేడమీద కూర్చుందాం" అంటూ దారితీసింది. వెనకాలే నేనూ మేడమీదికి వెళ్లాను. రమాదేవి గదిలోనే ఇద్దరం చెరో కుర్చీలో కూర్చున్నాం. గది నాలుగ్గోడలకూ రకరకాల చిత్రపటాలూ, రమాదేవి ఫోటోలూ ఉన్నాయ్యి. అంతా రోజ్ ఉడ్ ఫర్నిచర్. రెండు అద్దాల బీరువాలు రెండు డ్రాయర్లు ఒక డ్రస్సింగ్ టేబిల్. నాలుగు కుర్చీలు. రెండు ఈజీ చైర్లు. రెండు బట్టల స్టాండులు. వాటిమీద బట్టల దుకాణాల్లో అలంకరించినట్లు సిల్కు చీరెలు, జాకెట్లు, ప్రేసరీసు వడేసివున్నాయ్యి. ఒక పందిరి మంచం, బూరుగ దూది పరుపు. దోమతెర. అంతా సినిమా సెట్టింగులా ఉంది. ఆ సెట్టింగులో నాయిక రమాదేవి. ఆమె స్నేహితురాలు నేను.

"కాలేజీనుంచి వచ్చి ఎంతసేపయింది" అన్నాను.

"చాలాసేపయింది. ఇవ్వాళలాస్టవరు లేదు"అన్నది.

"మీరు చాలా అదృష్టవంతులు".

"ఏం"

"మీగది చూస్తేనేతెలుస్తున్నది.ఇంట్లోమీమాటకు తిరుగులేదనుకుంటాను. చక్కగాచదువుకుంటున్నారు. సుఖప్రదమైనజీవితం గడుపుతున్నారు. కోరితే కొండమీది కోతినికూడాతెచ్చుకోగలరు" అన్నాను.

నిరాశగా నవ్వింది రమాదేవి.

"నా చదువు చూసీ, నా గది చూసీ, నా బట్టలు చూసే అంతా అట్లాగే అనుకుంటారు. ఏ వ్యక్తీ ఆడదయినా, మగవాడయినా ఆరడుగులకుమించి ఉండరు. కాని వాళ్ల జీవిత సంఘటనలు మాత్రం కొన్ని కొన్ని మైలురాళ్లు. మరికొన్ని గోపురాలు, కొన్ని శిఖరాగ్ర సన్నివేశాలు, కొన్ని గోరీలు, అంతా కలిపి చూస్తే కొన్నివేల అడుగుల సినిమా రీళ్లు. ఏమంటారు" నిర్లిప్తతంగా అడిగింది.

"నిజమే. మీరూ అట్లా అంటే ఎట్లా. ఇంక మా బోటి వాళ్ల జీవితాలు. డబ్బుగలవాళ్లే అట్లా అనుకుంటుంటే మధ్య తరగతికుటుంబీకులు ఎట్లా అనుకోవాలి. ఎంతనిరాశపడాలి."అన్నాను. (సశేషం)

# అయిదు రెళ్ళు

30 వ పేజీ తరువాయి

"అదా సంగతి! దీని జన్మకి ఒకర్ని మెచ్చుకోవటం కూడానా? వాతో తగువు లాడాలని కాబోలు విన్న అమాంతం ఆకాశానికి ఎత్తి పారేసింది. కూర పారేసిన సంగతి తెలిస్తే నాలుగు అంటించేదాన్ని. నేను చూస్తే ఇలా మాటలు మెలిక పెట్టటానికి వీలుండదని కాబోలు రహస్యంగా పారేసొచ్చింది!"

"ఇంకా కాఫీ కాలేదటే? పాపం! ఆవతలా అబ్బాయి ఆకలితో అవురావురు మంటున్నా" డంటూ రామయ్యగారు లోపలి కొచ్చి హెచ్చరించి వెళ్ళారు.

ఆయనటు వెళ్ళగానే కళ మూతి ముప్పయి వంకర్లు తిప్పింది.

"అంత ఆకలితో అవురావురు మనక పోతే ఏ హోటలుకో వెళ్ళక పోయాడా? ఇక్కడ తేరగా చేసే వాళ్ళు ఉన్నారనుకున్నాడు కాబోలు హోటలుకు వెళ్తే ఖర్చవుతుందని పీనారితనం!"

"ఆ మాటలన్నీ తర్వాత — ముందు కాఫీ సంగతేమిటో చూసుకోండి. నాన్న గారికి, కోప మొస్తే పట్ట పగ్గాలుండవు." అంతలో శారద చేతులు కడుక్కొని వంటింట్లో నుంచి ఇవతల కొచ్చింది.

కళ, గీత కాస్సేపు నిశ్శబ్దంగా కూర్చున్నారు. కూర్చుంటే పనులు జరుగుతాయా, తరుగుతాయా?

"మరెలా?" అంది కళ దిక్కులు చూస్తూ.

"ఎలా ఏమిటి? ఇద్దరం కలిపి ఎలాగో కుస్తీ పట్టేద్దాం."

"టూ మెనీ కుక్స్......"

"స్పాయిల్ ది బ్రాత్. అందుకే నువ్వు చేసి తీసుకెళ్ళు. నేను కాస్సేపు డాబా ఎక్కి వస్తాను...."

కళ కంగారు పడింది.

"అమ్మో! నేను చేస్తే ఎలా ఉంటుందో?... అది అతనికి నచ్చుతుందో లేదో!"

"అమ్మయ్య! ఇప్పటికైనా ఒప్పుకున్నావ్!"

"ఏమిటి?" అని గ్రుడ్లురిమింది కళ.

"అదే! మనం చేస్తే అతనికి నచ్చుతుందో లేదో అనే నా బెంగ!" అని సర్దుకుంది గీత.

కళ మెత్తబడింది.

"నచ్చకేమిటి కాని నాన్నగారు ఒకటే తొందర పెడుతున్నారు. తొందర పెడితే మాత్రం నాకు కంగారు!"

"శారద కాళ్ళు పట్టుకుందాం పద!"

"దాని కాళ్ళు పట్టుకుంటే అది మరి కాస్త కొమ్మెక్కి కూర్చుంటుంది.! దాని కాళ్ళెందుకు పట్టుకోవటం? సిగ్గు లేకపోతే సరి! పైగా అది మనకంటే చిన్నది.!"

గీత నిస్పృహాయంగా చూస్తూ "అప్పుడు! వసుదేవుడు అంతటి వాడు గాడిద కాళ్ళు పట్టుకున్నాడు —" అన్నది.

"పట్టుకుంటే ఈడ్చిపెట్టి తన్ని ఉంటుంది." అంది కళ.

"ఎందుకు తన్నుతుంది? తన్నితే వసుదేవుడు నాలుగు వడ్డించ లేడేమిటి?"

"అయితే ఇంతకీ నీ దృష్టిలో శారద గాడిదన్న మాట! ఆ మాట కొస్తే నీకే గాడిద పోలి కున్నాయ్!"

కోపం రావటం ఈసారి గీత వంతు.

"వీటికి మాటికీ నవ్వు వెక్కిరిస్తే ఊరుకునేది లేదు! నా గొంతుకేం గాడిద గొంతుకలా లేదు. మొన్న సంగీతం పోటీలో నాకు ప్రయిజు వచ్చింది తెలుసా?."

"గీతక్కా! అవతల నాన్నగారు చిందులేస్తున్నారు.... ఇంకా కయ్యాలాడుతూ కూర్చున్నారా" అంటూ వచ్చింది శారద.

శారదని కుడి చెయ్యి గీత, ఎడమ చెయ్యి కళ పట్టుకున్నారు.

"శారదా! మంచి దానివి! కాస్త పరువు దక్కించవే!"

"నేను చేస్తే రుచీ, పచీ, ఉండదుగా మీరే చేసుకోండి!"

గీత శారద గడ్డం పుచ్చుకుని బ్రతిమాలింది.

"శారదా! తెంప తేసుకుంటావేం! నేను పొయ్యి దగ్గర కెళ్తే ఆనక సేవ చెయ్యాల్సింది నువ్వే కదా? ఆ రోజు పులుసు గిన్నె దింప బోయి కాళ్ళ మీద వంపేసుకున్నాను. జ్ఞాపకం లేదూ? నీకు హిందీ పరీక్షలు దగ్గర కొచ్చినా, పాపం,నాకోసం డాక్టరు చుట్టూ తిరిగి మందూ, మాకూ తీసుకు రాలేదూ? నేను లేసుకునే సరికి నువ్వు చిక్కి సగమై పోయావ్!"

శారద నవ్వింది.

"కళక్క వంట గురించి చదువు కున్నది కూడా! చదువు, సంధ్యా లేని దాన్ని నాకేం వస్తుంది?" 'తెంప తేసుకుంటావే శారదా!" అంది కళ బతిమాలుకుంటూ.

"పైగా అది చేసిన టిఫిన్ కాస్త తిన్నాడంటే ఆయనికి వాంతులు పట్టు కుంటాయి. ఆ తర్వాత మనింట్లో పడకేసి ఏ నాలో రెండు నెలలకో తాపీగా తేరుకున్నాక ఇంటి కెళ్తాడు. అంత వరకు మనం ఆయన గారికి సెయ్యాలన్నీలు సత్తారి!" అంది గీత.

శారద నవ్వుతూ స్టౌ వెలిగించి నిమిషంలో చకచక కాఫీ, ఉప్మా తయారు చేసింది. ఉప్మా రెండు ప్లేట్లు పెట్లలో సర్దింది. కాఫీని కప్పుల్లో పోసింది. అన్నీ ఒక ట్రేలో సర్దింది.

"నువ్వు తీసుకెళ్ళు" అంటే "నువ్వు తీసుకెళ్ళు" అని గీత, కళ కాస్సేపు వాదులాడుకున్నారు. తర్వాత ఒకరు ట్రే, మరొకరు మంచినీళ్ళ గ్లాసులు చేత పుచ్చుకుని వెళ్ళారు.

డ్రాయింగు రూంలో రామయ్యగారు, ఆ అబ్బాయి సోఫాలో పక్కపక్కనే కూర్చుని ఉన్నారు. ఉష, చిత్ర కూడా అక్కడే ఉన్నారు. రూం మధ్యలో అందమైన చిన్న ముక్కాలిపీట. దాని మీద ఉష ఎంబ్రాయిడరీ చేసిన నీలిరంగు శాటిన్ గుడ్డ పరచి ఉన్నది. సెంటర్‌లో గాజు పూలకుండీ, కుండీలో రంగు రంగుల కాయితం పూలు. ముక్కాలి పీటకు చెరొక వైపున ఖాళీగా ఉన్న మరో రెండు చిన్న బల్లలు ఎదురుగా సోఫా, రెండు వేపులా అటొక కుర్చీ, ఇటొక కుర్చీ— ఆ రెండిటిలోనే ఉష, చిత్ర కూర్చున్నారు— సోఫాకు, కుర్చీలకు అందమైన నీలిరంగు బొమ్మల గలేబులు తొడిగారు. క్రింద కుంకుమ వర్ణం పూల తివాసీ ఉన్నది.

డ్రాయింగు రూంలోకి అడుగు పెట్టటం తేలికైన పనిలా కన్పించలేదు రామయ్యగారి మొదటి ఇద్దరమ్మాయిలకు. ఆ అబ్బాయికి ఎదురుగుండా వెళ్ళటానికి చెప్పలేనంత సిగ్గేసింది. పెద్ద సభాస్థలి ముందు నిలబడినంత వణుకొచ్చింది. అయినా ఏమీ పడేయకుండా జాగ్రత్తగా ఖాళీగా ఉన్న బల్లల మీద పెట్టారు. రెండిటినీ సోఫాకు దగ్గరగా ఈడ్చారు.

"మా పెద్దమ్మాయి కళ! బి. ఎస్. సి. పరీక్ష కెళ్ళింది! ఇది రెండో అమ్మాయి గీత! బి. ఏ.కు వెళ్ళింది. ఇద్దరూ కవల పిల్లలు."

"ఐసీ! చాలా సంతోషం!"

దబ్బపండు రంగుతో మెరిసి పోతున్న అబ్బాయి టబ్బున లేచినమస్కారం పెట్టాడు.

"ఈయన సుధాకర్ ఎం. ఏ. గుంటూరు కాలేజీలో అసిస్టెంటు లెక్చరర్." అన్నారు రామయ్యగారు అతన్ని అమ్మాయిలకు పరిచయం చేస్తూ.

కళ, గీత ఇద్దరూ గాభరాగా నమస్కారం పెట్టి ఆ తర్వాత ఏం చేయటానికీ తోచక అబ్బాయి వంక తప్ప మరో వంకకు చూస్తూ నిలబడ్డారు.

సుధాకరే చొరవ చేసి "కూర్చోండి!" అన్నాడు.

చిత్ర నవ్వింది.

"ఎక్కడ కూర్చోమంటారు?"

నిజమే మరి! నలుగురు కూర్చోగల సోఫాని తను, రామయ్యగారు ఆక్రమించేసారయ్యె! కుర్చీలో ఒకరు లేపించి కూర్చోలేరు—

సుధాకర్ కంగారు పడుతూ అటూ ఇటూ కలయ జూశాడు కనుచూపు మేరలో కుర్చీలేవైనా ఉంటే మోసుకు రావచ్చును కదా అని.

ఉష అతని కంగారు చూసి కరిగి పోయింది. కుర్చీ చేతుల మీద కూర్చోమని అక్కలకు సైగ చేసింది.

కళ కాస్త ధైర్యం చేసుకుని "ఫర్వాలేదు! ఇక్కడ కూర్చుంటాం లెండి! మీరు కూర్చోండి?" అంది సుధాకర్ కేసి చూస్తూ.

కళ, గీత అంగరక్షకుల్లా ఉషకు రెండు వేపులా కుర్చీ చేతుల మీద కూర్చోగానే సుధాకర్‌కు స్థిమితం చిక్కింది. మరి మాట్లాడకుండా కూర్చున్నాడు.

"కాఫీ చల్లారి పోతున్నది. తీసుకోండి!" అని జ్ఞాపకం చేసింది ఉష.

"అవును! ఆ సంగతే మర్చిపోయాం. తీసుకోండి!" అంది గీత మాట కలుపుతూ.

రామయ్యగారు "తీసుకోవయ్యా!" అంటూ తన ప్లేటు తీసుకుని తొందర తొందరగా ఖాళీ చేయటం ప్రారంభించారు.

అమ్మాయిలు చూస్తూ కూర్చుంటే తను మేస్తూ కూర్చోటం సబబా అని ప్రశ్నించు కుంటే 'కాదు' అని జవాబొచ్చింది సుధాకర్‌కు. అందుకని "మరి మీరు కూడా తీసుకోండి!" అన్నాడు.

కళ గుండెలు దడదడ లాడాయి. గీత కంగారు పడింది. ఆ ఫలహారం వెనుక ఎన్ని పాట్లున్నాయో ఆ అబ్బాయి కేం తెలుసు!

"అబ్బే! మేం ఇంతకు ముందే తిన్నాం లెండి. మీరొస్తారని మాకేం తెలుసు?" అంది గీత.

సుధాకర్ నమ్మకం లేనట్టు చూశాడు.

"నిజమేనండి! సరిగ్గా మీరొచ్చే ముందరే మా టిఫిన్లు అయ్యాయి." అంది కళ గీతను బల పరుస్తూ.

"మీరో?" అని సుధాకర్ ఉష చిత్రలను అడుగుతున్నట్టు రెండు కుర్చీల వేపుకి చూశాడు.

రామయ్యగారు కాఫీ కూడా త్రాగేసి నిలబడ్డారు.

"సుధాకర్! వాక్కాస్త పనుంది. అలా వీధిలో కెళ్ళొస్తాను కాని నీ కేం కావాలో మొగమాటం లేకుండా చెప్పి చేయించుకో." అని అమ్మాయిల వైపు తిరిగి "అతనికి గది చూపించి ఏం కావాలో కాస్త కనిపెట్టి చూడండి." అంటూ రామయ్యగారు చెప్పులు తొడుక్కుని వీధులోకి అడుగు పెట్టారు.

ముసలాయన వెళ్ళిపోగానే సుధాకర్ హుషారుగా చూశాడు.

"ఇప్పుడేగా వీధిలో నుంచి వస్తున్నారు. ఎక్కడ తిన్నారు?" అన్నాడు నవ్వుతూ.

"మా స్నేహితురాలింటి కెళ్ళాం ..... అది కాస్త

# అయిదు రెళ్ళు

మమ్మల్ని కాఫీ, టిఫిన్ తీసుకుంటేనే కాని కదల నివ్వలేదు —" అంది ఉష.

పట్టెది! ఆ స్నేహితురాలు వోట్లో వచ్చి మంచినీళ్ళు కూడా పొయ్యలేదు!

"తిన్నదేదో ఈ పాటికి అరిగి పోయే ఉంటుంది. కొంచెం తీసుకోండి. లేకపోతే నేనూ తీసుకోను —" అని భీష్మించాడు సుధాకర్.

చేసేది లేక ఉష "సరే! మీ మాటే కానివ్వండి! కొద్దిగా తీసుకురావే! మన కోసం ఆయన తిన[illegible] మానేస్తున్నారు......" అంది తన కుర్చీ చేతి మీద కూర్చున్న కళ మీద చెయ్యేసి. కళ లేచి లోపలి

"దర్జాగా కూర్చుని తీసుకు రమ్మని ఆజ్ఞాపిస్తున్నది రాణీ గారిలా! ఇక్కడెవరు చేసి పెట్టారనుకున్నది? తింటే తిన్నాడు లేకపోతే లేదని ఊరుకోక!" అని విసుక్కుంది కళ.

"అంతా మర్యాదనుకున్నాడు — తింటున్నదో, లేదో ఆ ఆలోచనంతా అబ్బాయి కెందుకు? అమ్మాయిల పాట్లు గ్రహించుకునే అబ్బాయిలు కూడా ఉంటారూ?" అని సుధాకర్ నెత్తిన నాలు గక్షింతలు వేసింది గీత.

నోరెత్తి ఏ మాటా చెప్పక ముందే శారద మరో రెండు ప్లేట్లల్లో టిఫెన్ సర్ది చేతి కందించింది. చల్లారిన కాఫీని వెచ్చబెట్టి కప్పుల్లో పోసి ఇద్దరికీ చెరొకటి అందించింది.

"ఎంత తెలివైన దానివే శారూ!"

"ఎంత మంచి దానివే శారూ!"

శారద మంచిదే కాని పాపం ఏం తెలీదు — ఇప్పుడు అవసరం వచ్చింది కనుక సరిపోయి కాని లేకపోతే ఇదంతా ఉప్పు దండుగే కదా? తూకం లేకుండా చేతికెంత వస్తే వస్తే అంతా పోసి వండుకుంటే ఇలా కాక మరెలా తగలడుతుంది? పాక కళ అని వేళాకోళం చేస్తారే కాని ఆ కళ అందరికీ అబ్బుతుందా? అదీ ఒక పద్ధతిలో నేర్చుకుంటేనే ఫస్టుగా కుదురుతుంది. పాక కళను గురించి చదువుకోబట్టి కాని లేకపోతే తనకు మాత్రం ఈ తూకాలు, పాకాలు ఏవి తెలిసేవి అనుకున్నది వెళ్తూ వెళ్తూ కళ.

ఫలహారాలు పూర్తయ్యాక కళ సుధాకర్ ఉండటానికి వరండాకు ఎడమ వైపున ఉన్న మొదటి గదిని చూపించింది. బాత్‌రూంకు, ఆ గదికి మధ్య తలుపేం లేదు కాబట్టి ఆ గది మట్టుకు ఆ గది వేరుగా ఉన్నది. పోతేవీధి వరండాలు ఒక గుమ్మం, హాల్లోకి దారి తీసే మరో గుమ్మం మొత్తం రెండు ప్రవేశ ద్వారాలున్నాయి ఆగదికి.

గదిలో ఓ మూలగా పాత బల్ల, కుర్చీ, మరో మూలగా జానకమ్మ గదిలో నుంచి తీసుకొచ్చి పెట్టిన నవారు మంచం ఉన్నాయి. సుధాకర్ తన తోలు పెట్టె, బెడ్డింగు, ట్రాన్సిస్టర్ గదిలో చేర వేశాడు. బల్లమీద ట్రాన్సిస్టర్ పెట్టి మంచం మీద బెడ్డింగు పరిచాడు. మూసివున్న కిటికీ తలుపులు తెరిచాడు. కిటికీలో నుంచి మెల్లిగా గాలి చొరబడి శరీరానికి, మనసుకు గిలిగింతలు పెడుతున్నది. ఏవో తీయని వూహలను రేకెత్తిస్తున్నది.

నిడివైన ముక్కు, విశాలమైన నుదురు కాంతివంతమైన కళ్ళు, చిరునవ్వు చిందించే పెదాలు, వీటన్నిటికి తోడుగా చక్కని నొక్కుల జుట్టు — అన్నీ ఒక అందమైన ముఖంలో చోటు వెదుక్కున్నాయి. అంత అందమైన మోము, ఎంతో చక్కని రంగు ఆరడుగుల ఆజానుబాహుని అతి ఆప్యాయంగా వరించాయి. చక్కదనానికి సరితూగే పేరు సుధాకర్! .....

నాన్నగారి మాట విని మద్రాసు రావటం మంచి పనే అయింది. లేకపోతే ఇంత అందమైన చలాకీ అమ్మాయిల్ని తను మరెక్కడ చూడగలడు? అసలు ఇంట్లో సంచరిస్తున్నది అమ్మాయిలా అప్సరసలా అనుకున్నాడు దిగ్భ్రమతో సుధాకర్...

పంచ కన్యల పంచ చేరిన సుధాకర్ మనసు చలిస్తే అది ఎవరి తప్పను కోవాలి? (సశేషం)



ఏడడుగుల రెండంగుళాల ఎత్తూ, 260 పౌనులు బరువూ కలిగిన సునీల్ సంధూకు ఇటీవలనే 'బాటా' కంపెనీవారు జోళ్ల జతనొకదానిని బహూకరించారు. ఈ ఆజానుబాహువు వయసు ప్రస్తుతం 17 సంవత్సరాలే. ఇంకా ఎదిగే అవకాశం లేకపోలేదు. మామూలుగా 17 సంవత్సరాల అబ్బాయికి అవసరమయే చెప్పులకంటే, చాలా పెద్దవి ఇతనికోసం తయారుచేయవలసింది వచ్చిందట. ఇతను మొన్ననే హయ్యర్ సెకండరీ పరీక్ష వ్రాశాడు. ఇతని సోదరులు, సోదరిలుకూడా మంచి విగ్రహ పుష్టి గలవారట. జోళ్ల జతను సునీల్‌కు బహూకరిస్తున్న చిత్రం ఇది.

# రచయిత్రి పెళ్లి

12 వ పేజీ తరువాయి

మెచ్చుకుంది పార్వతమ్మగారు దూరన్నుండి ఇదంతా చూస్తూ.

"మా అమ్మాయి తెలుగు పత్రికల్లో కథలు రాస్తూ ఉంటుంది" అని మదన్ ముఖంలో ఏమైనా మార్పు వస్తుందేమోనని చూశాడు రాఘవయ్యగారు.

"ఓ. ఐ. సీ" అన్నాడు మదన్ ముక్తసరిగా.

ఇంతకు లలితాకుమారి ఒక్క మాట మాట్లాడ లేదు. ఆమెను మదన్ ఒక్క ప్రశ్న వెయ్యలేదు.

ఈ నాటకం త్వరగా ముగిస్తే బావుణ్ణనిపించింది లలితకు.

"మీరు ఇక స్నానం చేస్తారా ? వేడినీళ్ల ఏర్పాటు చేయిస్తాను." అన్నాడు రాఘవయ్యగారు.

మదన్ లేచి నుంచున్నాడు. రాఘవయ్యగారు అతనికోసం ఓ గది ఏర్పాటు చేయించారు. నౌకరు వచ్చి మదన్ సూట్‌కేస్ తీసుకుని గదిలో పెట్టాడు. ఆ గది లలితాకుమారిది. దక్షిణంవైపు ఉంది. గాలి బాగా వస్తుందని ఆ గదిని అతనికి ఏర్పాటు చేశారు. లలితాకుమారికి ఆ గది అతనికివ్వటం ఇష్టంలేదు ఆ గదిలో తన కిష్టమైన పుస్తకాలూ వస్తువులూ ఉన్నాయి. ఆ గదిలోనే తన బాల్యం గడిచి, యౌవనం ప్రవేశించింది. ఆ పక్క మీదనే తను రోజూ పడుకుంటుంది. తనకు అత్యంత ప్రియమైనదేదో తన వద్ద నుంచి పోతున్నట్లనిపించింది.

స్నానం అయినాక అంతా భోజనానికి కూచున్నారు. లలిత కూడా తల్లికి తోడుగా వడ్డించింది. భోజనాలప్పుడు ఏమీ మాటలు జరగలేదు.

నెయ్యి కావాలా అని లలిత అడుగుతే "వద్దు", "వూ" అని మాత్రం వూరుకున్నాడు మదన్. ఏ వస్తువూ రెండోసారి వేయించుకోలేద తను. సేమియా పరమాన్నం రెండోసారి వెయ్యపోతే రెండు చేతులూ అడ్డం పెట్టాడు.

"ఈ మనిషి కొంచెం కూడా నా కర్థం కావటం లేదు" అనుకుంది లలిత.

భోజనా లయిన తర్వాత మదన గదిలోకి వెళ్లి పడుకున్నాడు.

"అబ్బాయి ఎట్లా ఉన్నాడే ?" అని అడిగింది పార్వతమ్మ కూతుర్ని.

"ఇంత వరకూ ఏమీ తెలియలా" అంది లలిత.

"ఏం చోద్యమే ?" అని బుగ్గలు నొక్కుకుంది పార్వతమ్మ.

మధ్యాహ్నం మూడు గంటలకు టీ ఇచ్చి లలితను పంపించింది పార్వతమ్మ మదన గదిలోకి.

"ఏం, నౌకరుకు ఇచ్చి పంపకూడదూ ?" అని ఎదురు తిరిగింది లలిత.

"ఛా, బాగుండదు. ఎం. ఏ. చదువుకున్న దానివి, మరీ వంటింట్లో కూచుంటే నీ మీద అతనికి ఏం అభిప్రాయం కలుగుతుంది ?" బలవంతం చేసింది పార్వతమ్మ.

పెళ్లి కాబోయే ఆడపిల్లల్ని పసిపిల్లల కంటే కనా కష్టంగా ఎందుకు చూస్తారో ఈ పెద్దవాళ్లు, లలితకు చచ్చినా అర్థం కాలేదు. తను ఈ క్షణంలో పదేళ్ల పిల్లయి పోయినట్లనిపించింది లలితకు.

నెమ్మదిగా గది తలుపు తోసుకుని లోపలకు వెళ్లింది. మదన మంచి నిద్రలో ఉన్నాడు. దగ్గరగా వెళ్లి చూసింది. నిద్రలో కూడా ఎంత అందంగా ఉన్నాడు అనుకుంది లలిత. ట్రేను పక్కనే ఉన్న బల్లమీద ఉంచింది. సగం చదువుతూ పెట్టేసిన పుస్తకం ఏదో బల్లమీద ఉంది. అదేం పుస్తకమో చూడాలని లలితకు ఆరాటం ఎక్కువ కాసాగింది. కొంపతీసి తన కథల సంపుటి ఏమైనా ఏమో !

పుస్తకం తీసుకుని అట్టచూసింది. భీకరమైన కార్మికుడి బొమ్మ, వెనకాల ఫాక్టరీ, "జాక్ లండన్" అని ఇంగ్లీషులో రాసి ఉంది. ఆ పేరు విన్నట్టు తనకు తట్టను కూడా లేదు. ఎటువంటి పుస్తకాలు చదువుతాడో ఇతను అనుకుంది లలిత. "ఇతనికి సాహిత్యం అంటే తెలియదేమో పాపం" అనుకుని జాలిపడింది. ఢిల్లీలో పుట్టి పెరిగి ఈ దిక్కుమాలిన పుస్తకాలు ఎందుకు చదువుతాడో ? ఈ మనిషి తనకు కొంచెం కూడా అర్థం కావటం లేదని మరోసారి అనుకుంది లలిత. పరధ్యానంగా అతనివైపు చూస్తుంటే, పుస్తకం చెయ్యి జారి బల్లమీద పడి పెద్ద చప్పుడైంది.

మదన గబుక్కున లేచి కూచుని, తనకు దగ్గరగా నుంచున్న లలితను చూశాడు.

లలిత కాసేపు బిత్తరపోయి "టీ. . . . . . టీ. . తెచ్చాను. . . టీ తీసుకోండి" అని నవ్వుతూ అంది.

మదన చిరునవ్వు నవ్వి "థాంక్యూ" అని, బాత్‌రూం వైపు వెళ్లాడు. లలిత అక్కడ నుంచి పారిపోయింది.

ఆ సాయంత్రం లలితాకుమారి మదనతో నది ఒడ్డుకు షికారు వెళ్లింది. వాళ్లిద్దరూ నడిచి వెళ్తూ ఉంటే, దోవన పోయే వాళ్లంతా వాళ్ల వైపే చూస్తున్నారు. ఎంత ముచ్చటగా ఉన్నారు జంట, అనే భావం కొందరి మొహాల్లో చూసింది లలిత. అతని పక్కన నడుస్తూంటే మనసులో కొద్దిగా గర్వంగా ఉంది. నది ఒడ్డు చేరేటంతవరకూ ఇద్దరి మధ్యా మాటలులేవు.

ఒడ్డున ఇసుకలో కూచున్నారు ఇద్దరూ. కాస్సేపయిన తర్వాత ఇద్దరు ఆడపిల్లలు— లలిత ఈడు వాళ్లు— అటుగా వచ్చారు. జానకీ, సుమిత్రా తనతో కాలేజీలో చదువుకున్నవాళ్లు. వాళ్లను గుర్తించి "జానకీ" అని కేకేసి "ఇప్పుడే వస్తానండి" అని మదన్‌తో చెప్పి వాళ్లదగ్గిరగా వెళ్లింది.

"ఎవరే అతను ?" అడిగింది ఆత్రంగా సుమిత్ర.

"కాఫీ తీసుకోండి" అంది నెమ్మదిగా లలిత.

"థాంక్యూ." కాఫీ కప్పు అందుకున్నాడు మదన్.

లలిత గుండెల్లో రైళ్లు పరుగెత్తుతున్నాయి. తన మనసు తన అధీనంలో లేదని మాత్రం తెలుసుకుంది లలిత. తనకు ఆనందంగానే ఉందో, భయంగానే ఉందో తెలుసుకునే అస్కారం లేదు. మదన్ తన వైపు చూస్తున్నప్పుడు, అతని చూపుల్ని ఎదుర్కొనే ధైర్యం తనకు లేక పోయింది. అతని చూపుల్లో ఉండే వివేకం, ధైర్యం లలితను బంధించేశాయి. లలిత ఈ క్షణంలో తన మనోభావాన్ని వర్ణించ మంటే ఒక్క వాక్యం కూడా రాయలేదు. ఈ ఘట్టాన్ని ఎన్నిసార్లు తన కథల్లో చిత్రించిందో. కాని వాటికీ, దీనికీ ఏ విధమైన సంబంధం లేదని పించింది లలితకు. కాస్సేపు నిశ్శబ్దం.

ఈ నిశ్శబ్దం భయంకరంగా ఉంది లలితకు. ఆఖరుకు రాఘవయ్య గారు నిశ్శబ్దాన్ని ఛేదించారు.

"మీకు పుస్తకాలంటే ఇష్టమా ?"

మదన్ ఒక చిరునవ్వు నవ్వి "పుస్తకాలంటే ఇష్టం లేనివాళ్లు ఈ రోజుల్లో అరుదేమో నను కుంటాను" అన్నాడు లలిత తలెత్తి చూసింది అతని వైపు. అతను పలికే ప్రతి మాటా తన మనస్సులో 'రికార్డు' చేసుకోటానికి ప్రయత్నిం చేస్తోంది.

"కానీ నాకు అట్టే తీరిక ఉండదు. ఎప్పుడైనా తీరిక ఉన్నప్పుడు పుస్తకాలు చదువుతాను, అవంటే పెద్ద మోహం లేదు" అని ముక్తసరిగా పూర్తి చేశాడు మదన్. అతను తూచి తూచి మాట్లాడుతాడల్లే ఉంది. ఎక్కువ ఇంగ్లీషు మాటలు వస్తూ ఉంటాయి.

"తెలుగు పుస్తకాలూ, తెలుగు పత్రికలూ చదువుతూ ఉంటారా ?" రాఘవయ్య గారి ప్రశ్న.

మదన్ కొన్ని సెకన్లు వరకూ సమాధానం చెప్ప లేక చివరికి, "నిజానికి నాకు తెలుగు రాయటం, చదవటం అంత రాదు" అన్నాడు.

ఏదో పెద్ద బాంబు పేలినట్టయింది లలిత మనస్సులో.

"అక్షరాలు వచ్చు. పట్టిపట్టి చదువుతే కష్టం మీద కొద్దిగా చదవ గలను. మేమంతా ఢిల్లీలోనే పుట్టాం. మా అన్నయ్యలూ, నేనూ, మా అక్కయ్యా కాన్వెంటులోనే చదువుకున్నాం. బయట ఉర్దూ, కొంచెం పంజాబీ నేర్చుకున్నాం మా చెల్లెలు మాత్రం తెలుగు స్కూలుకు వెళ్లింది. దానికి వచ్చు తెలుగు చదవటం, రాయటం." అన్నాడు మదన్ సంజాయిషీ చెప్పుకునే ధోరణిలో.

లలిత మనస్సులో కలవరం తీవ్రమయింది. తన కున్న హిందీ జ్ఞానం నెమరు వేసుకోసాగింది.

రాఘవయ్యగారు వెంటనే నవ్వుతూ "అవును, కాదూ మరీ పుట్టి పెరిగింది అక్కడనే ఆయ మరి. ఇంట్లో మాత్రం తెలుగే మాట్లాడుకుంటారల్లే ఉంది" అన్నాడు కూరల బేరం చేస్తున్న వాడిలా.

"అవును, తెలుగే మాట్లాడుతాం. నిజానికి మా అందరిలోకీ తెలుగు బాగా మాట్లాడ్డం రానిది నాకే. మా అమ్మ నన్ను తిట్టేది తప్పులు మాట్లాడి నప్పుడల్లా" అని ముచ్చటగా నవ్వాడు మదన్.

అతని మాటల్లో ఎంత నిజాయితీ ఉందో అని

---

స్స...స్స...స్సార్! వా... వ్వా...వాడికి.

న...న...నత్తిసార్!! ఆ... ఆ ఉద్యోగము...న...న... నాకు యిప్పించండి సార్!

రామసుబ్బారెడ్డి (పుల్లిపేట)

---

# రచయిత్రి పెళ్లి

"మా నాన్న స్నేహితుడే! కాదు కాదు! మా చుట్టాలు. మద్రాసు వెళ్తూ ఒక్కరోజు మా యింట్లో ఉంటానికి దిగారు" గబగబా చెప్పింది లలిత.

"ఏం నంగనాచివే? మమ్మల్ని 'ఫూల్' చేస్తున్నావా? నిన్ను చూడ్డానికే వచ్చి ఉంటాడు అతను. ఏ కథలు మా దగ్గర పనికిరావు" అంది జానకి.

తప్పుచేసి దొరికి పోయిన దాని మొహం పెట్టి, తల దించేసుకుంది లలిత.

" అదంతా ఏమీ లేదు. మీ ఊహాగానం " తప్పించుకుందామనుకుంది లలిత.

" ఎంత బాగున్నాడో ? నువ్వు చాలా లక్కీ దానివే ! వెంటనే పెళ్లి చేసుకోవే లలితా." అంది సుమిత్ర.

" ఓ వేళ నీకు పనికి రాకపోతే మా ఇద్దరిలో ఎవరికైనా ఇప్పు"' అంది నవ్వుతూ జానకి.

" పోవే " అంది లలిత.

" కనీసం మాకు పరిచయమైనా చెయ్యవే ? నువ్వొక్కదానివే ఎత్తుకు పోతావేమోనని భయం " అంది సుమిత్ర.

" నాకేం భయం లేదు. రండి."

ముగ్గురూ మదన్ కేసి నడిచారు.

వీళ్లు కూడా మదన్‌ను మెచ్చుకునేవాళ్లే. మదన్‌కు ఎన్ని సర్టిఫికెట్లో ! లలితలో ఉండే 'డిఫెన్సు' మెల్లిగా సడలి పోతోంది.

వాళ్లని పరిచయం చేసింది మదన్‌కు. మదన్ వాళ్లని చాలా సోగ్గా 'గ్రీట్' చేశాడు.

కొంచెం సేపు కూచుని జానకీ, సుమిత్రా వెళ్లి పోయారు.

మదన్ వెంటనే లలితతో మాటలు కలిపాడు.

" మన పెళ్లి అయిన తర్వాత 'సమ్మర్'లో నైనీతాల్ వెళ్దాం. అక్కడ నా స్నేహితుడికి బంగళా ఉంది. హాయిగా వుంటుంది. వింటర్‌లో 'సిమ్లా' వెళ్దాం. అప్పుడు మంచు పడుతుంది. నువ్వు ఎప్పుడైనా మంచు మీద నడిచావా ? అంతా 'సమ్మర్'లో సిమ్లా వెళితే మనం 'వింటర్'లో వెళ్దాం. మంచు మీద స్కేటింగు చెయ్యవచ్చు. ఇళ్ళు కన్పించ్వి తెల్లని దుప్పటి కప్పుకుని ఉన్నట్టుంటాయి. భలే బాగుంటుంది. ఢిల్లీ దగ్గర చూడాల్సినవి ఎన్ని ఉన్నాయో తెలుసా ! పోనీ ప్యాలెస్ .........." మదన్ ఏవో చెప్పుకుంటూ పోయాడు. అతని మనస్సు జెట్ 'పేస్ స్పీడు'లో పరిగెత్తుతోంది. లలిత మనస్సు ఒంటెద్దు బండి నడక నడుస్తోంది. దారంతా గుంటలూ బురదా.

మదన్ మొట్ట మొదటిసారి 'నువ్వు' అనటం గమనించింది లలిత. అతను అప్పుడే పెళ్లి అయిపోయినట్టు మాట్లాడుతున్నాడు.

" అదంతా పెళ్లి అయిన తర్వాతనేగా ? " అంది లలిత.

" ఏం కాదా ? " అన్నాడు మదన్ ఆత్రంగా.

" నేను మిమ్మల్ని చేసుకుంటానని మీకేమిటి ధైర్యం ? "

"ఓ యస్ ! అదీ ఒక పాయింటే ! దాన్ని గురించి నేను ఆలోచించనేలేదు." మదన్ ఆలోచనలో పడ్డాడు.

" పదండి, వెళ్దాం. చీకటి పడుతోంది " అని లేచింది.

ఇద్దరూ నడువసాగారు.

" అయామ్ సారీ, మిస్ లలితా, నేను మిమ్మల్ని నొప్పించాను. మిమ్మల్ని బలవంతం చెయ్యలేను మీ ఇష్టమైతేనే నన్ను పెళ్లి చేసుకోండి. నేనెంత ఫూల్‌ని ! నా కిష్టమైపోతే పెళ్లి అయిపోతుందను కున్నాను. మీకు 'ఫీలింగ్సు' అనేవి వుంటాయని నాకు తట్టను గూడా లేదు. అయామ్ రియలీ సారీ."

లలిత సమాధానం చెప్పలేదు. అతని మాటలు ఆమె గుండెల్లో తగిలాయి. కాస్సేపు నిశ్శబ్దంగా నడువ సాగారు.

మళ్లీ మదనే మాట్లాడ్డం మొదలు పెట్టాడు.

" నేను చాలా ముందుగా ప్లాను చెయ్యటం మొదలు పెట్టాను. పెళ్లి అయిన తర్వాత ఇవన్నా లెన్ను. పారిస్ ఒకటి తీసుకుందామనుకున్నాను. వేరే మన కోసం చిన్న బంగళా, చిన్న కారూ.. అయామ్ వెరీ సారీ ..........."

---

ఒకరు : నమస్కారమండీ. నేను మీకు జ్ఞాపకం ఉన్నానా?

జ్ఞానేశ్వరరావు : లేకేమండీ... నా జ్ఞాపకశక్తి అమోఘం ! మీకు తెలియదా ఏమిటి ? అప్పుడే మరిచారా, ఒకసారి మీరు నేను మరచిపోయిన చెప్పుల్ని, గొడుగును తీసుకొచ్చి ఇచ్చారే!

(ప్రకాశం (అనంతపూర్)

---

" పోన్లెండి. దాని గురించి మీరంత బాధ పడనక్కర్లే......" లలిత ఇంక పైన మాట్లాడలేక పోయింది. గుండెల్లో ఏదో ఉప్పెన లాంటిది లేస్తోంది. ఇంకా ఎక్కువ మాట్లాడితే ఏడ్చే పరిస్థితి వచ్చేటట్టుంది. ఆమె కళ్లల్లో నీళ్లు నిండిపయ్. అతను చూడకుండా చీకట్లో కళ్లు తుడుచుకుంది.

ఇల్లు చేరేటంత వరకూ ఎవరూ మాట్లాడ లేదు.

" ఎక్కడెక్కడకు వెళ్లారే," అంది పార్వతమ్మ గారు.

లలిత క్లుప్తంగా సమాధానం చెప్పింది.

రాత్రి భోజనాల దగ్గర మదన్ తను తెల్లవారు జామున వెళ్లుతున్నట్లు చెప్పాడు.

" అప్పుడేనా ? రెండు మూడు రోజులుండి వెళ్లండి " అన్నాడు రాఘవయ్య గారు.

మదన్ లలిత వైపు చూశాడు. లలిత ఆ చూపును అర్థం చేసుకుంది.

" లేదండీ, నాకు అట్టే లీవ్ లేదు. మళ్లీ సోమవారానికి ఢిల్లీ చేరుకోవాలి " అన్నాడు మదన్.

భోజనాలు ముగిసిన తర్వాత మదన్ అతని గది లోనికి వెళ్లిపోయాడు.

రాఘవయ్యగారూ, పార్వతమ్మ లలితను గుచ్చి గుచ్చి అడిగారు. లలిత వాటన్నిటికీ ఏవో సమాధానాలు చెప్పి తప్పించుకుంది.

ఆ రాత్రి లలితకు నిద్రలేదు. పక్క మీద అటూ ఇటూ దొర్లింది. తను తప్పు చేసిన చేసిన దానిలా బాధ పడింది. తనకు మళ్లీ మదన్ లాంటి వరుడు దొరుకుతాడా ? ఎంత సంస్కారం ఉంది అతన్లో ! ఒక్కమాట తను అనేసరికి ఎంత బాధ బాధ పడ్డాడు అతను. తను దేన్నించి తనను రక్షించుకోవాలని చూస్తోంది ? తనలో ఏదో మార్పు వస్తోందని గ్రహించింది లలిత. ఆ మార్పు తన అంగీకారంతోనే వస్తోందా, లేక తనకు తెలియకుండానే వస్తోందో చెప్పలేదు. తన వెనకటి జీవితమంతా మరుపు గదుల్లోకి జారుకుంటోంది. తనకు తెలియని ప్రపంచంలోకి కాలుపెట్టి పోతుంది.

గడియారం పన్నెండు కొట్టింది. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది.

లలిత పక్కమీద లేచి కూచుంది. అప్రయత్నంగా ఆమె కాళ్లు మదన్ గదివేపు నడిచి వెళ్లాయి. తలుపు వారగా వేసి ఉంది. మెల్లిగా తలుపుతోసి లోపలకు వెళ్లింది. మదన మేలుకునే ఉన్నాడు. బెడ్‌లైట్ వెలుగుతోంది. మధ్యాహ్నం చదువుతూన్న పుస్తకం చదువుతున్నాడు. లీలగా కదిలి వస్తున్న లలితను చూసి, కొద్దిగా పైకి లేచి కూచున్నాడు.

"ఏమండీ ?" అప్రయత్నంగా అతని నోట్లోంచి వెలువడ్డాయి.

"నన్ను 'మీరు' అనకండి. నేను సాయంత్రం అన్న మాటలు మనసులో ఉంచుకోకండి. మనం 'నైనీతాల్' వెళ్దాం" అని లలిత భారంగా వెనక్కు తిరిగింది బయటకు వెళ్లటానికి. మదన గబుక్కున పక్కమీంచి లేచి ఒక్క అంగలో ఆమెను పట్టుకున్నాడు.

ఆమె రెండు బుజాల్ని పట్టుకుని "రియలీ ?" అన్నాడు.

లలిత తల దించుకుంది.

మదన ఆమెను దగ్గరకు తీసుకుని ముద్దు పెట్టుకో బోయాడు.

లలిత అతని కౌగిట్లోంచి విడిపోయి "గుడ్ నైట్" చెప్పి వెళ్లిపోయింది. ఆ రాత్రి ఇద్దరికీ నిద్రలేదు.

తెల్లవారుజామున ఇల్లంతా అడావిడిగా ఉంది. మదన ప్రయాణ మవుతున్నాడు. లలిత గది లోంచి బయటకు రాలేదు.

*  *  *

లలితా మదనల పెళ్లి చాలా బాగా జరిగింది. పెళ్లికి రెండు వైపుల్నుంచి పెద్దలు చాలా మంది వచ్చారు. కొంత మంది పత్రికాధిపతులూ, రచయితలూ లలితకు బహుమతులిచ్చారు. ఒకరిద్దరు పిల్ల కవులు లలిత మీద పద్యాలు చదివారు. అవేవీ మదనకు అర్థం కాలేదు.

లలిత మాత్రం లోలోపల చాలా గర్వపడింది. తన బావగార్లూ, ఆడబిడ్డలూ చాలా మంచివాళ్లూ సంస్కారం గలవాళ్లూ ఢిల్లీ నుంచి మదన స్నేహి

టులు వచ్చారు. వాళ్ళంతా లలితను 'భాభీ' అని పిలిచారు. మదనతో ఉర్దూలో ఏవో మాట్లాడారు. అవేవీ లలితకు అర్థం కాలేదు.

ఆ రోజు రాత్రి లలిత మొట్ట మొదటిసారి పురుష ప్రపంచంలోకి తొంగి చూసింది. ఆ అనుభవం ఆమె వర్ణించలేదు.

పెళ్ళయిన మర్నాడు లలితను తీసుకుని వెళ్ళిపోయారు. వెళ్ళే ముందు తన గదిని ఒకసారి చూసుకుంది. పుస్తకాల బీరువాలో తను రాసిన కథల సంపుటి పేజీలు తిప్పింది. తను రాసిన 'ప్రేమా—పెళ్ళీ' కథ— మొదటి బహుమతి పొందినది— లలిత చిన్నగా నవ్వుకుంది. పుస్తకం బీరువాలో పెట్టేసింది.

* * *

మదన ఆఫీసునుంచి వచ్చి టై వూడదీసి సోఫాలో కూలబడ్డాడు. చాలా చిరాకుగా ఉన్నాడు.

లలిత టీ కప్పు టీ పాయ్ మీద పెడుతూ "ఏం జరిగిందండీ ?" అని అడిగింది.

"స్కౌండ్రల్స్ ! నేను వర్కర్ల దగ్గర నుంచి కమీషన తీసుకుంటానట. చచ్చీ చెడీ రక్తం, చెమట వోడ్చి పనిచేసి వీళ్లకు లాభాలు తెచ్చిపెట్టిన వర్కర్లకు ఐదురూపాయలు జీతం పెంచమంటే వాళ్ల తాతసొమ్మంతా పోయినట్టు జుట్టు పీక్కుంటారు. గవర్నమెంటుకు టాక్సులు కూడా కట్టరు."

లలితకేమీ అర్థం కాలేదు. నిజానికి అతని ప్రపంచం ఆమెకు ఎప్పుడూ అర్థం కాదు. ఆ ప్రపంచంలో అన్నీ మరలూ, చక్రాలూ, స్క్రూడ్రయివర్లూ. ఎప్పుడూ ఏవో ఇంజనీరింగు పుస్తకాల చదువుతూ ఉంటాడు.

ఒక్క రోజు రాత్రి పది, పదకొండు గంటలకు వస్తాడు. ఎక్కడికి వెళ్లారంటే యూనియన మీటింగుకు వెళ్లానంటాడు. అతను వాళ్ల ఫాక్టరీ యూనియన ప్రెసిడెంటు.

ఒక్కొక్కప్పుడు అనిపిస్తుంది మదన ప్రపంచం అర్థం చేసుకోలేనంత వరకూ అతని భార్యగా తనకు స్థానం లేదని, కాని అతనంటే తనకి ప్రాణం. తనకు ఏం కొరతా రాకుండా చూస్తున్నాడు. కాని ఓ పక్కన ఏదో అర్థంకాని అసంతృప్తి ఆమె మనస్సులో వేళ్లు వేసుకోసాగింది. నిజానికి తనకి కావలసింది మదన వంటి భర్త కాదు. ఆమె ఉద్దేశంలో— ఆ విషయం ఎన్నో కథల్లో పెట్టింది— భార్యా భర్తా ఇద్దరూ ఒకళ్ల ఆత్మ ఇంకొకరి ఆత్మలో కలిసి పోవాలని. అది ఎట్లా సాధ్యమో ఆమెకు తెలీదు. కనీసం ఆమె ఎరుగనన్నా ఎరుగదు. తను పెళ్లి అయినప్పటి నుంచీ జీవితానికి దగ్గరగా వస్తోంది రోజు రోజూ. ఇక్కడ వెన్నెల రాత్రులూ, పడవషికార్లూ, సాహిత్య పఠనమూ, శాంతీ ఏవీ కనుపించటం లేదు. ఇక్కడ కనుపించే దల్లా చింకి బట్టలూ, రోడ్ల మీద అడుక్కునే వాళ్లూ, బురదా, చాలీ చాలని జీతాలూ, అనారోగ్యంతో బాధ పడే పిల్లలూ, వీళ్లంతా ఎందుకు బాధ పడతారో లలితకు చచ్చినా అర్థం కావటం లేదు.

"త్వరగా అన్నం పెట్టు మళ్లీ వెళ్లాలి" అన్నాడు బట్టలు మార్చుకుంటూ మదన.

"అదేమిటి ఇప్పుడేగా వచ్చింది ?" అంది లలిత.

"రాత్రికి యూనియన మీటింగు ఉంది వెళ్లాలి. రేపు అయిపో పంయిపో తేల్చుకోవాలి. కంపెనీ వాళ్లు ఒప్పుకోపోతే నా ఉద్యోగానికి రాజీనామా ఇస్తాను."

లలిత గుండెల్లో ఆటంబాంబులు పేలుతున్నాయి. ఈ సంవత్సరం నుంచీ సుఖమయంగా సాగుతున్న జీవితం అమాంతం గోతిలో పడుతుందా ఏం ఖర్మం ? మదన ఏ అఘాయిత్యం చేస్తాడో అని భయపడసాగింది లలిత.

"ఏమిటి ఈ కూరలో ఉప్పయినా వెయ్యలేదు. వానసెన్స్ ?" చిరాకు పడ్డాడు.

మాట్లాడకుండా ఉప్పు సీసా దగ్గర పెట్టింది ఆదరాబాదరా రెండు అన్నం మెతుకులు గతికి మదన బట్టలు వేసుకుని వెళ్లిపోయాడు.

రాత్రి పన్నెండు గంటలకు తిరిగి వచ్చాడు మదన్. అతను పూర్తిగా అలిసి పోయి ఉన్నాడు. ఉన్నాడు. బట్టలు మార్చుకుని లలిత పక్కన పడుకుని ఆమెపై చెయ్యివేసి నిద్రపోయాడు.

ఆలోచనలతో తర్జన భర్జన పడి ఏ తెల్లవారు జామునో లలిత నిద్రలోకి జారుకుంది.

* * *

ఆ మర్నాడంతా లలితకు పీడకల లాగా ఉంది. మొగుడికి అన్నం పెట్టి పంపించేసి పడుకుంది. తలంతా ఏవేవో ఆలోచనలతో నిండి ఉంది. ఈ రోజు ఎట్లా గడుస్తుందా అనిపిస్తోంది లలితకు. మదన ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేస్తాడా? సలక్షణమైన ఉద్యోగం ఎందుకు మానుకుంటాడో ? ఒక వేళ ఉద్యోగం మానేస్తే మళ్లీ ఇంకొక ఉద్యోగంలో చేరేటంత వరకూ ఎట్లా గడవటం ? అతని ఫాక్టరీలో పని చేస్తున్న వెయ్యమంది వర్కర్లకు ఎట్లా గడుస్తుందో ఆమెకు తట్టనే లేదు. వారి భార్యలు రోజూ ఏ దేవుళ్లకు మొక్కుకుంటున్నారో ? వాళ్లను గుపించి వో కథ రాస్తే ? కాని ఎట్లా రాయటం ? వాళ్లని గురించి తనకేమీ తెలీదే ? నిజానికి తను ఇదివరకు రాసిన కథలు మాత్రం తనకు తెలిసిన వాటిని గురించి రాసిందా ? తను వూహించి, తన కిష్టమయినట్టుగా రాసింది. అడుక్కునే వాళ్ల గురించీ, గుడిసెల్లో వాళ్లగురించీ రాయటం తనవల్ల గాదు. కథరాసే ప్రయత్నం విరమించుకుంది. అసలు ఈ మధ్య కథలు రాయాలనిపించటమే లేదు. తనకు తీరికగా ఉన్న ప్రతి క్షణం మదన గురించిన ఆలోచనలే. అతన్ని పెళ్లి చేసుకున్న తర్వాత తన జీవితంలో ఎంత మార్పు ? ఇదివరకు ప్రాపంచిక బాధలకు తను అతీతంగా ఉండేది. ఇప్పుడు ఎన్నో ఆలోచనలు మదన జీవితం తుఫాను లాంటిది. అతను ఏ రోజున ఏం చేస్తాడో చెప్పటం కష్టం. ఇవ్వాళ ఆ కంపెనీ వాళ్లతో ఏం ఘర్షణ పడుతున్నాడో ? భగవాన, ఆయన్ను రక్షించు.

బయట ఎవరో కాలింగ్ బెల్ నొక్కిన చప్పుడు పరుగెత్తి వెళ్లి తలుపు తీసింది. తుఫానులా మదన్ లోపలికి వచ్చాడు. చేతిలో ఓ పాకెట్ ఉంది.

"ఏ మయిందండీ ?" ఆదుర్దాగా అడిగింది.

మదన్ లలితను నడుంచుట్టూ చేయివేసి దగ్గరకు లాక్కునిగట్టిగా ముద్దు పెట్టుకున్నాడు.

"ఏమిటిదంతా ? నాకేమీ అర్థం కావటం లేదు. ఆఫీసులో ఏమయింది ?"

"ఏమవుతుంది. మనం గెల్చాం" అన్నాడు చిన్న పిల్లవాడిలా నవ్వుతూ మదన.

ఆ నవ్వు ఎంత సేపు చూసినా తనివితీరదు. లలిత మనసు కుదట బడింది.

"ఇదుగో, ఈ పాకెట్ నీ కోసం. ఇవ్వాళ జీతం రోజు గదూ ! అన్నట్టు మరిచిపోయా, నీకు జ్ఞాపకం ఉందా, ఈ రోజు మన పెళ్లి యానివర్సరీ. అందుకని నీకో చీర తెచ్చా. వెంటనే కట్టుకుని బయలుదేరు, వూ"

"ఎక్కడకి ?"

"ముందు చీరకట్టుకో ! ఏమిటీ చింకిరి తలా నువ్వూనూ ? ఓడియన్‌లో ఇవ్వాళ కొత్త ఇంగ్లీషు పిక్చరు గుప్తా ఆయన భార్యా కూడా వస్తున్నారు. టిక్కెట్లు గూడా రిజర్వు అయినయి. కమాన" అంటూ లలితను తరిమాడు మదన్.

లలితకు ఆలోచించేటంత టైము గూడా లేదు.

"ఏం మనిషో ఏమిటో" అనుకుంటూ మొగుడి వేపు చూసి మూతి బిగించి చరచరా గదిలోకి వెళ్లి పోయింది. లలితాకుమారి కాదు— శ్రీమతి లలితా కుమారి.





# ప్రసిద్ధికెక్కిన జైనుల యాత్రాస్థలం

# శ్రావణబెళగోళ

ఫోటోలు, వ్యాసం :
**ఎన్. రామకృష్ణ**



గోమతేశ్వరుని విగ్రహం

మైసూరుకు అనతి దూరంలో వున్న 'శ్రావణ బెళగోళ' పేరు చెప్పగానే, సుందరమైన అక్కడి ప్రకృతిదృశ్యాలు, ఆ వైపున, యీ వైపున వున్న చంద్రగిరి, ఇంద్రగిరి పర్వత శిఖరాలు, ఆహ్లాదకరమైన వాతావరణము గుర్తుకు వస్తాయి.

భారతదేశంలో ప్రసిద్ధి కెక్కిన జైనులయాత్రాస్థలాల్లో యీ 'బెళగోళ' కూడా ఒకటి కావటంలో ఆశ్చర్యం లేదు. 'బెళగోళ' అన్న యీ కన్నడ పదానికి తెల్లని సరస్సు అని అర్థం. పైగా అక్కడి పట్టణం నడుమన సుందరమైన చెరువొకటి కూడా ఉండటంతో యీ తీర్థయాత్ర ప్రదేశానికి 'శ్రావణ బెళగోళ' అనేపేరు స్థిరపడిపోయింది. కొన్ని ప్రాచీన చిహ్నాలలో యీ ప్రదేశాన్ని 'గోమతపురం' అని వర్ణించిన సందర్భాలు కూడా లేకపోలేదు.

## విగ్రహం

గోమతేశ్వరుని విగ్రహమొకటి అక్కడే వున్న ఇంద్రగిరి మీద చక్కగా విలసిల్లుతున్నది. 'కళ్యాణీ తీర్థం' అనే చెరువొకటి కూడా ఇక్కడ వున్నది. ఇది అతి ప్రాచీనమైనదని, 1731 లోనే ఒకప్పుడు దీని పునరుద్ధరణకు కృషి జరిగిందని చరిత్రాధారాలు వివరిస్తున్నాయి. దాదాపు 470 అడుగుల ఎత్తున వున్న యీ ఇంద్రగిరి శిఖరంలోనే రాతిమెట్లను తొలచటం జరిగింది. శిఖరాగ్రం చేరుకొనేవారికి వివిధ దేవాలయాలు చూచే అవకాశం, వాటిల్లోగల కళా నైపుణ్యాన్ని కళ్లారా చూడగలిగే సందర్భమూ లభిస్తాయి. ఈ ఆలయాలను దాటిన వెనుకనే గోమతేశ్వరుని దేవాలయం కనుపిస్తుంది.



ఎనిమిదడుగులకు పైగా పొడవు వున్న గోమతేశ్వరుని పాదాలు

## దేశంలో కల్లా పెద్దది :

ఈ గోమతేశ్వరుని విగ్రహం మన దేశంలోని విగ్రహాల్లో కల్లా పెద్దదని ప్రతీతి. నగ్నంగా వున్న యీ విగ్రహాన్ని ఆ శిఖరం మీద ఎలాంటి ఆనుపు లేకుండా ప్రతిష్ఠించటం జరిగింది. విగ్రహాపు

పాదాల వద్దనున్న పాముపుట్టల్లో నుంచి పాములు పైకి ఎగబ్రాకుతున్నట్లు కూడా రాతిలోనే చిత్రించటం ఇందలి వైచిత్రి. ఒకే రాతితోనే యీ విగ్రహాన్నంతా రూపొందించటంలోనే ఇందలి అందమూ, చందమూ; అంతటి పెద్దరాతిని అంత ఎత్తుకు ఎవరైనా తీసుకొని వెళ్లివుంటారనటంలో ఔచిత్యం తక్కువే. అయినా, దానిని ఎవరు నిర్మించారో, రూఢిగా ఎవరికీ తెలియదు. కాని, ఇది మాత్రం ప్రాచీనమైనదే నని ఋజువగుతున్నది. ఒక లెఖ్క ప్రకారం ఇది 983వ సంవత్సరానికల్లా పూర్తి అయింది. అంటే, యిది దాదాపు వెయ్యి సంవత్సరాల నాటి దన్నమాట!

**కొన్ని వివరాలు :**

దీని ఎత్తు 58 అడుగులు, చెవుల వరకు ఎత్తు-50 అడుగులు; తలపరిమాణం-8 అడుగులు, పాదాలు-8¼ అడుగులు; బొటన వేలు-2¾ అడుగులు.

పన్నెండేళ్ల కొకమారు జరిగే అభిషేక వుత్సవంలో పాల్గొనటానికి దేశం నలుమూలల నుంచి ప్రజలు వస్తారు. ముఖ్యంగా జైనులు తండోపతండాలుగా వస్తారు. ఆ వుత్సవం నాడు వెయ్యి కుండల పాలు, పెరుగు, నెయ్యి, కొబ్బరి నీళ్లు, గంధం కలిపి ఆ విగ్రహం మీద వర్షింప చేస్తారు. గతసారి యీ వుత్సవం 1953 లో జరిగింది, 1965 లో మరొకటి జరుగనున్నది.

వెయ్యి సంవత్సరాల పాటు ఎండను, వాననూ, వేడిని, చల్లదనాన్ని భరించిన యీ విగ్రహం మీద ఇటీవలనే అక్కడక్కడ పగుళ్లు కనిపించాయట. విగ్రహ సంరక్షణకు కావల్సిన చర్యలను తీసుకోటంకూడా జరుగుతున్నది.

ఇంద్రగిరినుంచి చూస్తే చంద్రగిరి కనిపిస్తుంది. ఈ శిఖరం మీద దాదాపు 12 ఆలయాలు వున్నాయి.

పురుదేవ రాజుగారి ఇరువురి కుమారుల్లో గోమటేశ్వరుడొకరు. చిన్ననాటనే రాజ్యాన్ని, భోగ భాగ్యాల్ని త్యాగంచేసి తపస్సు ప్రారంభించాడు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని గోమటేశ్వరుని సోదరుడు ఆయనకోసం విగ్రహాన్ని నిర్మించాడు. కాని, కొంత కాలానికే ఆ ప్రదేశము, విగ్రహమూ కాల గర్భంలో కలిసిపోయాయి. కొంత కాలానికే, తరువాతి మహారాజైన చాముండరాయ యీ విగ్రహాన్ని ఏర్పాటు చేశాడని చరిత్రకారులలో ఒక వర్గపు వారి కథనం.

★



శిఖరానికి మెట్లు

చంద్రగిరి, కళ్యాణితీర్థం దృశ్యాలు.

# అపరాధ పరిశోధకగాధకల చిత్రంలో జగ్గయ్య, కృష్ణకుమారి, పద్మనాభం, గీతాంజలి!

## అక్టోబర్ 25 న విజయవాడలో శ్రీ రామారావుకి సన్మానం!



'బబ్రువాహన'లో యల్. విజయలక్ష్మి

### ఆలయఫిలింస్ ప్రథమ చిత్రం

ఆలయ ఫిలింస్ వారు తమ ప్రథమ చిత్రాన్ని అపరాధ పరిశోధనతో కూడి సస్పెన్సు, థ్రిల్స్ ఉన్నట్లుగా తీయుడానికి నిర్ణయించుకున్నారు.

ఈ చిత్రంలో జగ్గయ్య, ప్రభాకరరెడ్డి, బాలయ్య, పద్మనాభం, రాజబాబు, కృష్ణకుమారి, గీతాంజలి, స్వర్ణ మొదలగువారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి రచన : పినిసెట్టి శ్రీరామమూర్తి, పాటలు : దాశరథి, సి. నారాయణరెడ్డి, సంగీతం : అశ్వద్ధామ, ఛాయ : యం. జి. సింగ్, కళ : రాజేంద్రకుమార్, కూర్పు : అంకిరెడ్డి, దర్శకత్వం : కె. హేమాంబరధరావు, నిర్మాత : యం. కె. రెడ్డి.

### సన్మానం

ప్రముఖ సినిమానటులు శ్రీ ఎన్. టి. రామారావుకు అక్టోబరునెల 25 వ తేదీన విజయవాడలో సన్మానం చేయటానికి నిశ్చయించినట్లు, సన్మానసంఘ కార్యదర్శి శ్రీ ఫణిభూషణరావు వ్రాస్తున్నారు.

ఈ సన్మానం ఆంధ్ర జింఖానా గ్రౌండ్సులో జరుగుతుంది. రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి అధ్యక్షత వహిస్తారు. రాష్ట్ర కాంగ్రెసు సంఘం అధ్యక్షులు శ్రీ పి. తిమ్మారెడ్డి సభను ప్రారంభిస్తారు. కేంద్ర మంత్రి డా. కె. ఎల్. రావు ఉపన్యసిస్తారు. చలనచిత్ర ప్రముఖులు కూడా పాల్గొనగల యీ సన్మానసభలో రాష్ట్రంలోని వివిధ సాంస్కృతికసంస్థలు కూడా పాల్గొంటాయని తెలుస్తున్నది.

### 'భక్తరామదాసు'

వి. ఎస్. ఫిలింస్‌వారి "భక్త రామదాసు" చిత్ర నిర్మాణం పూర్తికావచ్చింది. ఈ మధ్య విక్రమ్ స్టూడియోలో గోల్కొండ నవాబు తానీషా రామదాసును జైలులో ఉంచడం, "నరహరిని నమ్మక" అను పాటను రామదాసు (నాగయ్య) పాడగా చిత్రీకరించారు. ఈ చిత్రీకరణలో నాగయ్య, లంకసత్యం జగ్గారావు, డాక్టరు శివరామకృష్ణయ్య పాల్గొన్నారు. వీరుగాక ఇంకా ఈ చిత్రంలో గుమ్మడి, ఏ. వి. సుబ్బారావు, నాగరాజా, రామశర్మ, కే.శే. డాక్టరు గోవిందరాజుల సుబ్బారావు, పి.కన్నాంబ, కీ.శే.సి.ఎస్.ఆర్. పసల సూర్యచంద్రరావు, పేకేటి, బ్రహ్మయ్య, చదలవాడ కుటుంబరావు, రామన్న పంతులు, పెన్షన్ రామారావు, వంగర, రాజశ్రీ, టంగుటూరి సూర్యకుమారి, ఋష్యేంద్రమణి, మొదలగువారు నటించారు.

ఈ చిత్రానికి మాటలు— యడవల్లి లక్ష్మీ నారాయణ అండ్ మల్లాది సత్యనారాయణ, సంభాషణలు, పర్యవేక్షణ— సముద్రాల రాఘవాచార్య, సంగీతం— నాగయ్య, అశ్వద్ధామ, ఓగిరాల, ఎం.డి. పార్థసారధి, హెచ్.ఆర్. పద్మనాభశాస్త్రి, ఛాయ— కె.ఎస్.ప్రసాద్, రహిమాన్, మూర్తి, రాజగోపాల్, జాగీర్దార్, కళ— రామరాజు, తోట, అమ్మయప్పన్, నృత్యం— వెంపటి సత్యం.

ఈ చిత్రానికి అసోసియేట్ డైరెక్టరు పి.ఎస్. శ్రీనివాసరావు బి.ఏ., దర్శకుడు— వి.నాగయ్య.

### 'వివాహ బంధం'

"సాత్ పాకే బాంధా" అను బెంగాలీ చిత్రం ఆధారంగా తెలుగులో నిర్మిస్తున్న "వివాహబంధం" చిత్రనిర్మాణం పూర్తి అయింది.

ఈ చిత్రంలో ఇద్దరు విద్యాధికులు పరస్పరం ప్రేమించుకుని వివాహము చేసుకోవడము, అంతస్థు, ధనము వీటితో వారి గార్హస్థ్య జీవితంలో రేగిన కలతలు, ఎదుర్కొనే సమస్యలు ఎంతో సహజంగా చిత్రీకరించబడినాయి.

ఈ చిత్రంలో ఎన్.టి.రామారావు, భానుమతి, నాగయ్య, సూర్యకాంతం, హేమలత, పద్మనాభం, వాసంతి, ప్రభాకరరెడ్డి, బాలయ్య, ఏ.వి. సుబ్బారావు (జూనియర్), బొడ్డపాటి, వంగర మొదలగు వారు నటించారు.

ఈ చిత్రానికి రచన— ఆట్లూరి పిచ్చేశ్వరరావు, సంగీతం— ఎం.బి.శ్రీనివాస్, సంగీత పర్యవేక్షణ— శ్రీమతి పి.భానుమతి, ఛాయ, అన్నయ్య, కళ— రాజేంద్రకుమార్, నిర్మాత—దర్శకుడు— పి.రామకృష్ణ. (భరణి)

## "గ్రామదేవతలు"

సుగంధి పిక్చర్సువారి "గ్రామదేవతలు" చిత్రం ఇంతవరకు ఏడున్నర రీళ్లు పూర్తి అయింది. నాలుగు పాటలను, రెండు పద్యాలను రికార్డ్ చేశారు. వాటిలో రెండున్నర పాటలను, రెండు పద్యాలను చిత్రీకరించారు. మిగిలిన వాటిని చిత్రీకరించాలి. మూడు పాటలను రికార్డ్ చేయడానికి వ్రాసి ఉంచినట్లు తెలుస్తుంది.

ఈ చిత్రంలో జగ్గయ్య, చలం, రేలంగి, లంక సత్యం, రాజబాబు, అల్లు రామలింగయ్య, వదలవాడ కుటుంబరావు, వంగర, ప్రసాద్, రామకోటి, బొడ్డపాటి, ధూళిపాళ, రాజసులోచన, గిరిజ, ఉషాకుమారి, రాగిణి (నూతన నటి హైద్రాబాద్) మొదలగువారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి రచన పాలగుమ్మి పద్మరాజు, పాటలు : ఆరుద్ర, కొసరాజు, సంగీతం : పెండ్యాల నాగేశ్వరరావు, ఛాయ : వెంకట్, నృత్యం : చిన్నిసంపత్, కళ: సూరన్న, కూర్పు: సంజీవి, పబ్లిసిటీ : టి.వి. యస్. శర్మ, దర్శకత్వం: సి. యస్. రావు.

## 'దొరికితే దొంగలు'

చందమామ ఫిలింస్‌వారు తమ చిత్రం "దొరికితే దొంగలు"లో ఒక పాటను ఈ మధ్య భరణీ స్టూడియోలో రికార్డుచేశారు.

"మావయ్యా— చిక్కావయ్యా !
చక్కని చుక్కకే దక్కావయ్యా !"

పై పాటను దాశరధి వ్రాశారు. జానకి ఆమె బృందం పాడగా రికార్డ్‌చేశారు. ఈ పాటను జమున మరికొంతమంది బృందంతో చిత్రీకరిస్తారు. ఇప్పటికి 13 రీళ్లకు పైగా చిత్రంపూర్తి అయింది.

ఈ చిత్రంలో ఎన్.టి.రామారావు, జమున, గుమ్మడి, కాంతారావు, ధూళిపాళ, రమణారెడ్డి, సత్యనారాయణ, పేకేటి, అల్లు రామలింగయ్య, సూర్యకాంతం, జయంతి, రాజశ్రీ, శారద మొదలగువారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి కథ— కె.వి.ఆర్.ఆచార్య, మాటలు పినిశెట్టి, సంగీతం—ఎస్.రాజేశ్వరరావు, పాటలు— దాశరథి, ఆరుద్ర, సి.నారాయణరెడ్డి, ఛాయ కె.ఎస్. ప్రసాద్ అండ్ రవికాంత్ నగాయిచ్, కళ—గొడ్‌గాంకర్, నృత్యం— హీరాలాల్, దర్శకత్వం— పి. సుబ్రహ్మణ్యం, నిర్మాత— డి.ఎల్. నారాయణ.

## "రాజద్రోహి"

పి.ఎన్.ఆర్.పిక్చర్సువారి "రాజద్రోహి" చిత్రం పూర్తి అయింది. ఈ చిత్రంలో సావిత్రి, ఎస్. వరలక్ష్మి, ఎం.ఎన్.రాజం, శివాజీ గణేషన్, వి.కె. రామస్వామి, రాజగోపాల్, కరుణానిధి మొదలగువారు నటించారు.

ఈ చిత్రానికి మాటలు— మహారథి, సంగీతం— కె.వి.మహాదేవన్, కూర్పు— కందస్వామి, దర్శకత్వం— ఏ.పి.నాగరాజన్, నిర్మాత— పింజల సుబ్బారావు.



'మంచిమనిషి' లో జమున, రామారావు.



'రామదాసు' చిత్రంలో రామదాసుగా నాగయ్య.



'శభాష్ సూరి'లో గీతాంజలి.



'బభ్రువాహన'లో రాజసులోచన, యన్. టి. రామారావు.

# సెట్పు వార్తలు

## "ఉయ్యాల-జంపాల"

అన్న చేసిన మోసానికి గురైన రవి దారి తెన్నూ గానక తనకు తెలియకుండానే ఒక బస్సులో ప్రయాణం చేసి "శ్రీపతిలంక" అనే వూరు చేరుకుంటాడు. అదే చేరవలసిన స్థలం గనుక బస్సులో నుండి క్రిందకు దిగుతాడు. అదే సమయంలో టపా అందుకుంటున్న రన్నరు సుబ్బయ్య (చదలవాడ కుటుంబరావు) రవి చేతిలో వున్న పత్రిక ముఖచిత్రం తను పని చేస్తున్న పోస్టు మాష్టరు వైకుంఠం (రమణారెడ్డి) గారమ్మాయి శశిరి (కృష్ణకుమారి)గా గుర్తించి.

"అవును అచ్చంగా శశిరేఖమ్మ బొమ్మే ఇది" అని బాహ్యంగా తన అభిప్రాయాన్ని వెలిబుచ్చుతాడు.

తాను ఏ అమ్మాయికి తన హృదయాన్ని అంకితం చేశాడో అదే అమ్మాయి చిత్రాన్ని పత్రికలో చూసి, స్వంతం చేసుకుని, ఆ అమ్మాయి చిరునామా తెలియని రవికి జీవనాధారం, ఆరాధ్య దేవత చేరువకు తాను చేరుకున్నట్లు గ్రహించి రన్నరు సుబ్బయ్యతో "శ్రీపతిలంక" చేరుకుంటాడు.

పై ఘట్టాన్ని పాశర్లపూడి రేవులో చిత్రీకరించబడినది.

నావలో ప్రయాణం చేస్తున్న రన్నరు సుబ్బయ్యతో రవి సందర్భవశాత్తు తన పేరు చెప్పవలసి వస్తుంది. తాను రవిని అని చెప్పడం ఇష్టం లేని రవి, తన పేరు "గోపి" అని మార్చి చెప్తాడు.

అప్పుడే నావ దిగి వస్తున్న వైకుంఠం (రమణారెడ్డి), కొడుకు కైలాసం (చలం) చెట్టు చాటున దాగొని ఉండటం గమనించి సమయం కాని సమయంలో ఇచ్చట ఎందుకున్నావని అడుగుతాడు. కైలాసం ఏదో అబద్ధమాడి తన ప్రియురాలు పారో (మీనాకుమారి)ను చేరుకోడానికి తప్పించుకు పారిపోతాడు. పారిపోతున్న కొడుకు కైలాసాన్ని చూచి—

"ఏంటో ఈ కాలం పిల్లలు ఏటి గట్టున కాలవ గట్టున సినిమాహాల్సు దగ్గర కావలా వేస్తుంటారు. ఛ్ఛ !" అని గొణుక్కుంటూ వెళ్ళిపోతాడు.

పై సన్నివేశాన్ని నర్సాపురం దగ్గర గోదావరి ఒడ్డున శ్రీ వోసూరి గంగాధరం అండ్ బ్రదర్సు వారి కొబ్బరి తోటల్లో చిత్రీకరించారు. ఈ విధంగా ఈ చిత్రానికి సంబంధించిన చాలా దృశ్యాలు గోదావరి ప్రాంతంలో చిత్రీకరించారు. కొన్ని పాటలను కూడా చిత్రీకరించారు. అవుట్‌డోరు షూటింగ్‌లో ఎక్కువగా అనుపమా ఫిలింస్ వారికి శ్రీ వోసూరి గంగాధరం బ్రదర్సు సహకరించారని తెలుస్తుంది. చక్కని సన్నివేశాలతో పటుత్వం గల ఇతివృత్తాలు గల చిత్రాలను నిర్మించే దర్శకుడు— విఖ్యాత అయిన శ్రీ తిలక్ ఈ చిత్రాన్ని కూడా త్వరలో పూర్తిచేసి విడుదల చేయనున్నారు.

ఈ చిత్రంలో జగ్గయ్య, చలం, ప్రభాకరరెడ్డి, రమణారెడ్డి, చదలవాడ, కుటుంబరావు, కె. విం

యస్. శర్మ, కృష్ణకుమారి, వాసంతి, మీనాకుమారి మొదలగు వారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి రచన : పినిసెట్టి శ్రీరామమూర్తి, సంగీతం : పెండ్యాల నాగేశ్వరరావు, ఛాయ : చౌదరి, కళ : తోట, నృత్యం : వెంపటి సత్యం, స్టూడియో: వీనస్, నిర్మాత : దర్శకుడు : తిలక్.

## "సంజీవినీ రహస్యం"

పంచశీలా ప్రొడక్షన్సు వారు తమ ప్రథమ చిత్రం "సంజీవినీ రహస్యం" తెలుగులో పూర్తి చేశారు. ఈ చిత్రానికి మాటలు, పాటలు, నిర్మాత: పొట్లూరి.

"సొగసే కనగా చాలవు కనులు. . . .
తరులు గిరులు స్వర్ణమే భావన. . ."

ఈ పాటను బసవేశ్వర్ పాడగా రికార్డ్ చేశారు. కచుడుతో చిత్రీకరించ బడింది.

"వరుగేల ఇటు చూడవే సుందరీ పవరాణీ
నిగనిగ మెరయు ప్రేమ ఫలమా నేవడంవే"

పై పద్యాన్ని పెద్దింటి రామచంద్ర పాడగా రికార్డ్ చేశారు. దీనిని కూడా కచునితో చిత్రీకరించారు.

"వింటివ దేవా ప్రేమయె మేలుర
కొలనులో కలువను మనసైన దానరా!"

పై పాటను కుమారి సునీత (రమణి) పాడగా రికార్డ్ చేయబడింది. చిత్రంలో దేవయానితో చిత్రీకరించారు.

"ప్రేమే వెన్నెల ఈ జగతికే
రమ్య రూప మది హాయీ. . . ."

ఈ పాటను అప్పారావు, కుమారి సునీత పాడగా రికార్డ్ చేశారు.

## సెట్సు వార్తలు

"విరిసేనూ కమలం ఉల్లాస నొసగె నెమలి పాడవే! కూ! అంటూ కోయిలా చక్కగా కోయిలా. . ."

పై పాటను కుమారి సునీత పాడగా రికార్డ్ చేశారు.

"తండ్రి నీవే, కచుని కాపాడూ. . . !"

పై పాటను కుమారి సునీత పాడగా రికార్డ్ చేశారు.

"గురుదేవా, కన్నా నెన్నో దివ్యలీలలూ. . .
తలేనీ సన్నిధిలో దేహ మోహ మెల్లమాయా?"

పై పాటను బసవేశ్వర్ పాడగా రికార్డ్ చేశారు.

"మనసే దోచితివి, అడుగమా హాయిగా. ."

"మదిలో కోరిక ప్రీతిగనే పలుకుదురా"

పై డ్యూయెట్ పాటను బసవేశ్వర్, కుమారి సునీత పాడగా రికార్డ్ చేశారు.

"చిదంబరా, చిదానందా,
ఆశ్రిత పాలా!. . . . . ."

పై పాటను అప్పారావు పాడగా రికార్డ్ చేశారు. చిత్రంలో నారదునితో చిత్రీకరించారు.

ఈ చిత్రానికి సంగీతం : చాంద్, దర్శకత్వం : బాలా అండ్ రమణ.

ఈ చిత్రంలో బి. సరోజాదేవి, విద్యావతి, రేవతి, అశ్వర్థ మొదలగు వారు నటించారు. ఈ చిత్రాన్ని దీపావళికి విడుదల చేయనున్నట్లు నిర్మాత శ్రీ పొట్లూరి తెలియ జేశారు.

## "తోటలోపిల్ల-కోటలోరాణి"

మణిపుర యువరాజా విజయుడితో తోటమాలి కూతురు గౌరికి వివాహం నిశ్చయమైంది. ఆ విషయం తెలిసిన తోటమాలి మన్నన్న రాజ్యం నుండి కూతురుతో పారిపోవాలని వస్తువులు సర్దుతుంటాడు. ఇంతలో గౌరి స్నేహితురాలు శ్రీమతి వస్తుంది.

"పూ! త్వరగా బయలు దేరండి. ఎవరైనా వచ్చారంటే కొంప మునుగుతుంది."

"పదమ్మా గౌరి! పద!"

"ఎక్కడికి నాన్నా!"

"త్వరగా ఇక్కడ్నించి దాటిపోతే తరువాత ఎక్కడికైనా పోవచ్చు."

"అక్కడ మాత్రం ఇలాంటి చట్టాలు, అన్యాయాలు ఉండవని నమ్మక మేమిటి? ఆకాశంలాంటి ఈ సమాజం అంతటా ఒక లాగే ఉంటుంది. ఈ మాత్రం దానికి పిరికితనంతో పారిపోతామా?"

"అలాగని ప్రాణాలను పోగొట్టుకుంటామా?"

"మృత్యువును తప్పించుకుందామని ప్రయత్నించటం మూర్ఖత్వం నాన్నా! ఒక వేళ నాకు మరణమే ప్రాప్తమంటే ఎక్కడున్నా ఏదో రూపంలో అది రాక తప్పదు. ఏ పాము కాటుకో, పిడుగు పాటుకో నిరర్థకంగా చనిపోవడం కంటే సాటి స్త్రీ జాతి కోసం జీవితాన్ని త్యాగం చెయ్యడం మంచిది కాదా నాన్నా."

"కాని ఒకరి కోసం నిన్ను పోగొట్టుకొనేటంత ఉదారుణ్ణి కాదు. తండ్రిగా నేననుభవిస్తున్న బాధ నీకు తెలియదు. నీ తల్లి చనిపోయినప్పటి నుంచి అన్నీ నేనే అయి పెంచాను. పెంచిన చేతులతో చూస్తూ మృత్యువు మందిరంలోకి పంపించమంటావా?"

"నేను కొలది పూల కన్యలు నశించి పోతుంటే ఎలా సహిస్తున్నావ్. వాటిని కూడా నువ్వేగా పెంచావ్. అలాగే నా విషయంలో గూడా నీ మమకారం తెంచుకో నాన్నా?"

"గౌరీ!"

"అక్కా! ఏమిటి నీ పట్టుదల కన్న తండ్రి కన్నీరు చూస్తే నీ మనసు కరగలేదా? నా మాట విను వెంటనే బయలుదేరు."

"శ్రీమతీ! సాటి స్త్రీవై యుండి నువ్వు చెప్పే సలహా ఇదేనా? ఈ వేళ నన్ను తప్పిస్తావ్. ఇలా ఎందరిని తప్పించగలవ్? ఈ నాడు నా తండ్రి కన్నీరు చూచి బాధ పడుతున్న నీవు నిత్యం ఎందరో తండ్రులు కన్నీరు మున్నీరుగా విలపిస్తున్నారో వూహించలేవా?"

"వూహించి మనం చేయగలిగిందేముంది? ఆ అరాచకాన్ని నువ్వూ నేనూ ఆపగలమా?"

"ప్రయత్నిస్తాను. పవిత్రమైన ఈ పోరాటంలో నిలిచి గెలిచేనా నా సాటి సోదరీమణులను కాపాడనన్న ఖ్యాతి దక్కుతుంది. లేదా ఒక పరమార్థం కోసం ప్రాణత్యాగం చేయడంలో గల ఆనందమైనా దక్కుతుంది. ఇదే నా నిర్ణయం."

గౌరిని పెళ్లికూతురుగా అలంకరించి లాంఛన ప్రాయంగా పెళ్లి జరిగింది. ఇంతలో మహాసేనాని దుర్జయుడు ప్రవేశించి. . .

"ఇంకా చూస్తారేం, కోటకు తీసుకు వెళ్లండి. పూ! పద. . ."

"దుర్జయ్!"



ప్రఖ్యాత న్యాయవాదిగా, ప్రధాన న్యాయమూర్తిగా, భక్తాగ్రేసరునిగా పేరు పొందిన శ్రీ టి. ఎం. కృష్ణస్వామి అయ్యర్‌గారి 'శతాభిషేకం' ఈ మధ్యనే మద్రాసులో జరిగింది. 'తిరుప్పుగళ్ మణి' శ్రీ అయ్యర్‌ని అభినందిస్తూ జరిగిన సభలో ప్రధానోపన్యాసకులు శ్రీ రాజమన్నార్ మాట్లాడుతున్న దృశ్యం. శ్రీ కృష్ణస్వామి అయ్యర్ కుడివైపున కూర్చుని ఉన్నారు. ఈ సభకి మద్రాసులోని ప్రముఖులు ఎందరో వచ్చారు. భజనలు జరిగాయి.

# సెట్స్ వార్తలు

"ఓ ! మహారాణీ వారా ?"

"అవును మహారాణీనే. నువ్విప్పుడు మా సేవకు డవన్న విషయం మరచిపోకు. . . మాతో ఎదురుగా నిలబడే అర్హత నీకు లేదు. ముందవతలకు వెళ్లు.."

"మహారాణీవారునీదో అజ్ఞాపిస్తున్నారు.విన్నావా? వారిని దగ్గరుండి తీసుకురా!"

గౌరి మెల్లగా వాన్న దగ్గరకు వచ్చింది. తండ్రిని ఒక సారి చూచి...

"భగవంతుడు తన కిష్టమైన వాళ్లను త్వరగా తనలో లీనం చేసుకుంటాడని చెప్పావ్ జ్ఞాపకం ఉందా నాన్నా ? ఇప్పుడు నేను నా స్వామి వద్దకు వెళ్తున్నాను. విచారించకు నాన్నా ?"

మల్లన్న గౌరీ అంటూ విలపిస్తాడు. ప్రక్కనే కన్నీరు మున్నీరుగా విలపిస్తున్న శ్రీమతిని చూచి.

"శ్రీమతీ ఏడుస్తున్నావా ? నాకు మహారాజు లాంటి భర్త వస్తాడన్నావుగా. . . ఏడవకు నాన్నను మాత్రం కనిపెట్టుకో జాగ్రత్త" అంటూ బయలుదేరింది గౌరి.

ఈ సన్నివేశం గౌరి ప్రొడక్షన్సు వారి "తోటలో పిల్ల — కోటలో రాణి" చిత్రం లోనిది. ఈ సన్నివేశంలో కాంతారావు, కె. వి. యస్. శర్మ, రాజశ్రీ, వాణిశ్రీ, పేకేటి, రాజనాల పాల్గొన్నారు. వీరుగాక ఇంకా ప్రభాకరరెడ్డి, జయంతి, రాజబాబు, కుటుంబరావు, గీతాంజలి మొదలగువారు నటిస్తున్నారు.

ఈచిత్రానికి మాటలు : పాటలు : వీటూరి : సంగీతం: కోదండపాణి, ఛాయ : హెచ్. ఎస్. వేణు, దర్శకత్వం : జి. విశ్వనాథం, నిర్వహణ : యస్. భావనారాయణ. —సి. ధర్మారావు. ★

## దాగుడుమూతలు_వెండితెర నవల

దాగుడుమూతలు చిత్రంలోని మాటలు, పాటలు పొందుపరచి సులభశైలిలో 56 పేజీలలో వెండి తెర నవలగా శ్రీ ఆదుర్తి నరసింహమూర్తి రూపొందించారు. ద్వివర్ణ ముఖ చిత్రంలో ఆకర్షణీయ చిత్రాలతో తయారు చేయబడిన ఈ డెమ్మీ సైజు దాగుడుమూతలు వెండి తెర నవల ఖరీదు 60 పైసలు మాత్రమే. (తపాలా ఖర్చులు అదనం) ప్రతులు దొరుకు చోటు : విశాలాంధ్ర ప్రచురణాలయం.

## యం. యస్. రావుకు వీడ్కోలు



"పుస్తక ప్రపంచం" సంపాదకులు ఎం శేషాచలం అండ్ కంపెనీభాగస్వాములు అయిన శ్రీ ఎం. ఎన్. రావు అమెరికా ప్రభుత్వపు ఆహ్వానాన్ని అనుసరించి, ఆ దేశపుం పర్యటనకు వెళుతున్న సందర్భంలో ప్రముఖ రచయిత శ్రీ ఆరుద్ర, రచయిత్రి శ్రీమతి రామలక్ష్మి ఆరుద్రలు గతవారంలో స్థానిక దాసప్రకాష్ హొటల్లో విందుచేశారు. నగరంలో పలువురు పుస్తక ప్రకాశకులు, రచయితలు హాజరయ్యారు.

ప్రారంభంలో శ్రీ ఆరుద్ర, శ్రీమతి ఆరుద్రలు ముకుళితహస్తాలతో అతిథులను ఆహ్వానించారు.

శ్రీ ఆరుద్ర స్వాగతం చెబుతూ, అమెరికా వెళుతున్న శ్రీ ఎం. ఎస్. రావు పుస్తక ప్రచురణకి కొత్త వాతావరణాన్ని నెలకొల్పారని, వారు ప్రారంభించిన 'ఇంటింటా గ్రంథాలయం' ప్రణాళిక చక్కని విజయాలు సాధించినదనీ చెప్పారు.

శ్రీ రావు తమకు జరిగిన సత్కారానికి కృతజ్ఞత చెపుతూ తను ప్రారంభించిన ప్రణాళికకు ఒక అమెరికన మిత్రుని సహకారం ఎలా లభించిందో వివరిస్తూ, తమ అమెరికా పర్యటనలో కొన్ని కుతూహలమైన విశేషాలు తెలిపికోగలమన్నారు. ★












Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press; 6 &7 Thambuchetty Street Madras-1. Phone; 22244 & 23713. Chief Editor S. Sambhu Prasad.




వసంత

నిగనిగలాడు నల్లని కేశములకు

# రెమి

కేస్టర్ హేర్ ఆయిల్

CRITERION RP. 423